# చతుర

సెప్టెంబరు 2007

వెల రూ. 10/-

పి.చంద్రశేఖర అజాద్

## ఉరి




Cream of Creams

Rainbow Cup

Santra Mantra

Strawberry

Vanilla

Mango Ball

Royal Casatta

Chocobar




రాయలసీమ

**THRUPTHI ASSOCIATES**

Plot No.F-9, Industrial Estate, Proddatur-516 362.
Kadapa Dt., A.P. Tel. 08564-250636 Fax : 08564-258465

కోస్తా ఆంధ్రా

**THRUPTHI FOODS**

Depo II - D.No. 1-3/18-35, Vidyadharapuram,
Vijayawada. Tel. 0866-6530156, Cell. 9849991235

తెలంగాణా

**THRUPTHI MARKETING**

Depot : D.No. 138, Sri Krupa Market, Malakpet,
Hyderabad-36. Tel. 040 - 65181115 Cell.9849991257

JOY

ఆంధ్రప్రదేశ్ అంతటా X ఐస్‌క్రీమ్ సరఫరా చేయువారు

# THRUPTHI FROZEN FOODS

## WANTED DISTRIBUTOTRS

(డిస్ట్రిబ్యూటర్స్ లేని ప్రాంతాలలో)

visit us: www.thrupthijoyicecreams.com







## పాఠకులకు మనవి

మూడు దశాబ్దాలకుపైగా అత్యుత్తమ కథలు, నవలలతో తెలుగు పాఠకులను విశేషంగా అలరిస్తూ విపుల, చతుర ఇంటింటి జంట పత్రికలుగా వినుతికెక్కాయి. 30వ జన్మ దినోత్సవం సందర్భంగా వెలువడిన ఫిబ్రవరి 2007 ప్రత్యేక సంచికల నుంచే అత్యధిక రంగుల పేజీల్ని సింగారించు కుంటూ ఇంద్రధనుస్సుల్లా ఇవి అందరినీ అలరిస్తున్నాయి.

ముద్రణవ్యయం ఇబ్బడిముబ్బడిగా పెరిగినా విపుల, చతుర ధరలు గత పదకొండేళ్ళుగా పెరగలేదన్న విషయం మా అభిమాన పాఠకులకు తెలిసిందే. పెరిగిన రంగుల పేజీలు, న్యూస్‌ప్రింట్ ధరలు, అదనపు సాంకేతికత, ప్రచురణ వ్యయం.. వీటన్నిటినీ దృష్టిలో ఉంచుకుని వీటి ధర సెప్టెంబరు నుంచి పది రూపాయలు చేయకతప్పడం లేదు. సహృదయ పాఠకులు, సాహిత్యాభిమానులు అర్థంచేసుకుని, ఎప్పటిలా ఆదరిస్తారని ఆశిస్తున్నాం. విడిప్రతి పదిరూపాయలైనా ఏడాది చందా నూట ఎనిమిది రూపాయలేనని గమనించ ప్రార్థన.

– మేనేజర్
వసుంధర పబ్లికేషన్స్





నవ్య నవలా వేదిక

# చతుర

సంపుటి - 30
సంచిక - 8
సెప్టెంబరు 2007
356వ సంచిక



మరణశిక్ష
ఉండాలా వద్దా
అనే అంశంపై
జరిగిన సంఘర్షణ
అందమైన
ఓ కుటుంబాన్ని
ఛిన్నాభిన్నం చేసి
ఏ అనూహ్య
తీరాలకు చేర్చిందనే
అంశంపై సాగిన
**పి.చంద్రశేఖర**
**అజాద్**
ప్రయోగాత్మక నవల

# ఉరి

10వ పేజీలో

బొమ్మలు: వాసు

# కాలాతీతం



# ది బ్రదర్స్ కరమజోవ్ (1880)

ఫ్యోదొర్ దొస్తొయేవ్స్కీ




ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయవేదిక

**(గత సంచిక తరువాయి)**

"ఏ మాత్రం అనుమానం వచ్చినా పోలీసులు వదిలిపెట్టరు. నీ చేత నిజం కక్కిస్తారు చూడు" అన్నాడు ఇవాన్.

మూర్ఛరోగైనా స్మెర్ద్యాకోవ్‌కు అందరి రహస్యాలు తెలుసు.

"అలాంటి మూర్ఖమైన పని చేస్తానను కోను. మిత్యా వదిలేసినప్పటి నుంచీ కాటెరినా ఇవనోదా వెంట పడ్డావు నువ్వు. నిన్న చెర్మోష్న్యా కెళ్లావని ఆమెకు తెలిస్తే బాగుంటుందా, నువ్వే ఆలోచించుకో. అందువల్ల మైడియర్ బ్రదర్, పిచ్చిపిచ్చి ఆలోచనలన్నీ కట్టిపెట్టి కాటెరినా గురించి కలలు గంటూ గడుపు. ఆమెక్కూడా నువ్వంటే ఇష్టం. స్వీట్ డ్రీమ్స్" అన్నాడు స్మెర్ద్యాకోవ్ ఎగతాళిగా.

తనకు కాటెరినా కావాలి. మిత్యా నిర్దోషి. కాని నీచబుద్ధి. చావాల్సిందే..లేదు. తన అన్నయ్యను రక్షించడం తన విధి! ప్రాణానికి తెగించి అయినా కాపాడాలి... ఆలోచనలతో సతమయ్యాడు ఇవాన్. ఊరంతా పిచ్చివాడిలా తిరిగి ఇల్లు చేరుకునేసరికి, అల్యోషా నిరీక్షిస్తున్నాడక్కడ.

'ఏమైంది? ఇలా వూడిపడ్డావు?'

కన్నీరాపుకోలేని అల్యోషా,

'స్మెర్ద్యాకోవ్ ఉరేసుకున్నాడు' అన్నాడు రుద్ధకంఠంతో.

★ ★ ★

కోర్టు సీనుతో కథ క్లైమాక్సుకు వస్తుంది.

పూలరంగడిగా, ఆడపిల్లల్ని వెంట తిప్పుకునే వాడిగా ఆ ప్రాంతంలో మిత్యాకు పేరుండడంతో అతన్ని చూడడానికి జనం గుంపులుగుంపులుగా కోర్టుకు వచ్చారు.

పబ్లిక్ ప్రాసిక్యూటర్ వాదన ప్రారంభించాడు. మిత్యా తన తండ్రితో గొడవపడి అందరి సమక్షంలో అతడ్ని గాయపరిచాడు. గ్రూషెంకాకు ఇవ్వడానికి డబ్బు కావాలి. అది తండ్రి దగ్గిరే ఉంది. అతడి తల చితక్కొట్టిన గుండ్రాయి దొరికింది. నోట్లు తీసుకుని కవర్ పారేశాడు. అతడే ఈ హత్య చేశాడనటానికిన్ని సాక్ష్యాలున్నాయి. అయితే, మిత్యా డబ్బంతా ఏం చేశాడు? ఎంత దుబారా చేసినా కనీసం రెండువేల రూబుళ్లైనా ఉండాలే అంటూ

మిత్యానే అతను అడిగాడు.

'డబ్బు సంగతి నాకేమీ తెలియదని యిప్పటికి వందసార్లు చెప్పాను. కాటెరినా నాకిచ్చిన పదిహేనువందల రూబుళ్లతోనే మాక్రో వెళ్లాను'

'ఆ డబ్బు ఎక్కడ పెట్టుకున్నావు?'

'గుడ్డ సంచీలో దాచి, దాన్ని మెడకు తగిలించుకున్నాను'

'ఆ సంచీ ఏది?'

'మాక్రోలో రోడ్డు మీద పారేశాను'

విజయగర్వంతో, ప్రాసిక్యూటర్ 'దట్సాల్ యువరానర్' అన్నాడు. డిఫెన్సు లాయర్ ఫెట్యుకోవిచ్ తెలివైనవాడు.

సాక్షులందర్నీ మళ్లీ క్రాస్ ఎగ్జామిన్‌చేసి తికమక పెట్టాడు. ఆయన ప్రశ్నలకు ముసలి గ్రెగొరీ పొంతన లేని సమాధానాలిచ్చాడు. చివరికి అల్యోషా బోనెక్కాడు. అతడు సజ్జనుడు, సత్యసంధుడని అందరికీ తెలుసు.

'మీ అన్న హత్య చేశాడని నువ్వు నమ్ముతున్నావా?' ప్రశ్నించాడు ప్రాసిక్యూటర్.

'లేదు. అతడు నిర్దోషి'

'అంత నమ్మకంగా ఎలా చెప్పగలవు?'

'మా అన్న నాతో అబద్ధమాడడు'

'నీ స్టేట్‌మెంట్‌కు మరేమైనా ఆధారముందా?'

'అవసరం లేదు'

ఇదే అదునుగా ఫెట్యుకోవిచ్ కూడా అల్యోషాను ప్రశ్నించాడు.

'మిత్యా మెడకు తగిలించుకున్న సంచీ గురించి చెప్పండి'

'అది బైటికి కనిపించలేదు. షర్టులోపల దాచుకున్నాడనుకున్నాను. మెడకింద ఎత్తుగా ఉన్నట్లు తోచింది'

"అవును, అల్యోషా" అంటూ అరిచాడు మిత్యా.

ఆ తర్వాత, ప్రాసిక్యూటర్ ఇవాన్‌ను కూడా ప్రశ్నించాడు

జవాబుగా, ఇవాన్, నోట్లకట్టలు చూపిస్తూ, 'ఇదే నా సాక్ష్యం. పాకెట్‌లో దొరికినవి యివే. అసలు హంతకుడు స్మెర్డ్యాకోవ్ నాకిచ్చాడు. ఆత్మహత్యకు కొద్ది క్షణాలు ముందుదాకా ఆరోజు నేను అతడితో గడిపాను. మాతండ్రి హత్యకు నేనే అతడిని ప్రోత్సహించానని అంగీకరిస్తున్నాను' అంటూ హేళనగా నవ్వాడు.

అతడి విపరీత ప్రవర్తన చూసి ఆశ్చ ర్యపడ్డారందరూ.

'మతి భ్రమించలేదు గదా!' అంటూ సందేహం వ్యక్తం చేశాడు జడ్జి

"పిచ్చెక్కింది నాకు కాదు మీకు. మానాన్న మరణించినందుకు మీరు బాధ పడుతున్నారా? ఈ విచారణ అంతా ఒక పెద్ద సర్కస్" అంటూ అరిచాడు ఇవాన్.

"క్షమించండి అతడికి ఆరోగ్యం బాగోలేదు" అంటూ అభ్యర్థించాడు అల్యోషా

నల్లటి కురులున్న, అందమైన యువతి లేచి నిల్చుంది.. ఆమె కాటెరినా.

"నా ఆరోగ్యం బానేవుంది. నేనే హంత కుణ్ణి" అంటూ ప్రకటించాడు ఇవాన్

"హత్య అంగీకరిస్తే చాలదు సాక్ష్యం కావాలి. కాస్త నెమ్మదిగా నీ వాదన విని పించాలి" అంటూ ఆదేశించారు జ్యూరీలు.

"నా దగ్గర సాక్ష్యం లేదు ఇప్పుడు స్మెర్ద్యాకోవ్ వచ్చి మీ ముందర స్టేట్ మెంట్ యివ్వలేడు. కాకపోతే..."

"సాక్ష్యం కావాలి"

"మత విశ్వాసాలలో డెవిల్‌కు ఒక స్థాన ముంది. కానీ కోర్టులు డెవిల్ వున్నట్టు అంగీకరించవు గదా. అతడు యిక్కడే ఎక్కడో దాగి ఇదంతా గమనిస్తున్నాడని నా విశ్వాసం" అన్నాడు ఇవాన్

అందరూ ఆశ్చర్యంగా చూశారు.

"హంతకుడు మిత్యాకాదు, నేను. అరెస్టు చెయ్యండి" అంటూ అరిచాడు ఇవాన్. పోలీసులు అతణ్ణి బలవంతంగా లాక్కె ళ్లారు.

ఇదంతా చూసి, హిస్టీరియా వచ్చిన ట్టుగా మూర్ఛపోయి తేరుకున్న కాటెరినా,

'నా వద్ద మరో సాక్ష్యముంది. ఇదిగో హత్యకు ముందురోజు నాకు వచ్చిన ఉత్తరం ఆ రాక్షసుడు మిత్యా రాసింది ఇదీ దాని సారాంశం...'

"కాట్యా,

రేపు నాకు మూడువేలు వస్తాయి. అవి నీకిచ్చేసి గుడ్‌బై చెబుతాను ఒకవేళ ఎక్కడా అప్పుదొరక్కపోతే మానాన్న తల పగలగొట్టి డబ్బు తీసుకుంటాను. కాక పోతే ఆ క్షణాన ఇవాన్ యింట్లో వుండ గూడదు. ఆ తర్వాత నాకే శిక్ష పడినా ఫరవాలేదు. నీ డబ్బు తిరిగి యివ్వటం కోసం ఏమైనా చేస్తాను. భగవంతుడి దయవల్ల అప్పు దొరికితే, హత్య చెయ్యవ లసిన అవసరం రాదు.

ఇట్లు

మిత్యా"

కోర్టు క్లర్కు చదవటం ముగించగానే, అందర్నీ పక్కకు తోసి బోనెక్కింది గ్రూషెంకా విలపిస్తూ.

"అది నీ మీద పగతీర్చుకుంటోంది మిత్యా! నీ బతుకు నాశనం చెయ్యటమే దాని లక్ష్యం" అంటూ అరిచిందామె. కోర్టు జవాన్లు ఆమెను పక్కకు లాక్కెళ్లారు.

అందరి సాక్ష్యాలూ వింది కోర్టు. క్రాస్ ఎగ్జామినేషన్ ముగిసింది. జడ్జీలంతా సుదీర్ఘంగా చర్చించుకున్నారు. చివరికి మళ్లీ కోర్టుగంట మోగింది. ప్రధాన న్యాయమూర్తి యితర జ్యూరీ సభ్యులూ ప్రవేశించారు.

'నిందితుడు హత్యచేశాడని రుజువైన ట్టేనా?' అంటూ తన సహోద్యోగులను ప్రశ్నించాడు. ప్రధాన న్యాయమూర్తి

'అతడు నేరస్థుడే' అన్నారంతా ఏకగ్రీ వంగా.

'నేను నిర్దోషిని. మా నాన్నని హత్య చెయ్యలేదు. ఆ దేవుడే నా సాక్ష్యం. కాట్యా(కాటెరినా) నిన్ను క్షమిస్తున్నాను. సోదరులారా, మిత్రులారా, ఈమెను క్షమించండి' అంటూ తన చివరి స్టేట్ మెంట్ యిచ్చాడు మిత్యా.

–ఎం.వసంత

**కోరిన అమ్మాయి తనను ప్రేమించలేదని ఆమెను కిరాతకంగా నరికి చంపాడో యువకుడు. అతనికి ఉరిశిక్ష వేయాలని మహిళా సంఘాలన్నీ పెద్దఎత్తున నినదించాయి. కానీ ఉరి తప్పంటాడతను. నేరగాళ్లను చంపేయడమే న్యాయమంటే చట్టానికీ.. నరహంతకుడికీ తేడా ఏముంది అని వాదిస్తాడా ప్రజాహక్కుల సంఘం ప్రతినిధి. ఆ విషయమై ప్రేమించి పెళ్లాడిన భార్యతోనూ విభేదిస్తాడు. ఇదేకారణంతో భార్య అతనికి దూరమవుతుంది..**

పి. చంద్రశేఖర
అజాద్






పట్టుదలలకు పోయి తాము ఎంతో ప్రేమగా పెంచుకున్న కూతురు మనసేమిటో గ్రహించరా భార్యాభర్తలు. తాము పయనించే మార్గాలు ఏ పరిస్థితులకు దారితీస్తాయన్నది ఊహించని ఆ జంటకు చివరకు లభించింది



ఏమిటి? చదువరులను ఆద్యంతం పరుగులు పెట్టించే ఆలోచనాత్మక నవల పి. చంద్రశేఖర అజాద్ 'ఉరి' ఈనెల చతుర మీకందిస్తున్న అపురూప కానుక.



అమ్మమ్మ నాకింకా గుర్తొస్తూనే వుంది. చిన్నప్పుడు ఎప్పుడో నన్ను చూసింది. అది కూడా బంధువుల ఇంటికి పెళ్లికి వచ్చినప్పుడు. అమ్మ దగ్గర్నుండి నన్ను తీసుకువెళ్లి 'ఈ పిల్ల ఎవరో తెలుసా?' అని అడిగారెవరో.

'ఎవరే' అంది అమ్మమ్మ.

'నీ మనవరాలు'

కొద్దిసేపు చూసి ఆ తర్వాత చేతుల్లోకి తీసుకుంది. ఈ విషయాలన్నీ మా అమ్మమ్మే చెప్పింది.

మా అమ్మది ప్రేమ పెళ్లి.

అమ్మ, నాన్నని ప్రేమించి పెళ్లి చేసుకుందన్న విషయంకంటే తనకు చెప్పకుండా చేసుకోవటం అమ్మమ్మకు నచ్చలేదు.

'మీ తాతయ్య చనిపోయాక పిల్లలే లోకంగా బతికాను. ఇన్ని సంవత్సరాలు కష్టపడి పెంచాను. వాళ్లకి చదువులు చెప్పించటానికి ఎన్ని ఇబ్బందులు పడ్డానో నాకు తెలుసు. అయినా నేను కాదంటే కదా, మీ అమ్మ నన్ను ఎదిరించి పెళ్లి చేసుకోవాల్సింది' అన్నప్పుడు నేను మాట్లాడలేకపోయాను.

'మీ అమ్మే కాదు, మీ మావయ్య మాత్రం ఏం చేశాడు? ఇద్దరూ నన్ను బాధ పెట్టారు' అంది అమ్మమ్మ.

మావయ్య ఇప్పుడు స్టేట్స్‌లో వున్నాడు.

తను ఈ దేశం విడిచిపెట్టి వెళ్లటం అమ్మమ్మకి ఇష్టంలేదు. మావయ్య కూడా ముందుగా అమ్మమ్మతో ఈ విషయం చెప్పలేదు. అన్ని ఏర్పాట్లు పూర్తి అయ్యాక చెప్పాడు.

అమ్మా-నాన్నా కొంతకాలం పాటు కలిసి బతికారు. నేను పుట్టాక తమ పెళ్లిని రిజిస్టర్ చేసుకున్నారు.

మావయ్య పెళ్లి కూడా స్టేట్స్‌లోనే చేసుకున్నాడు.

మా అమ్మా-నాన్నలకి క్షణం తీరిక వుండదు. ఎవరి పనుల్లో వారు బిజీగా వుంటారు.

అందుకే నేనూ- నా గది. నేనూ- ఏకాంతం. కాలేజీకి సెలవులు.

ఇన్ని సంవత్సరాల తర్వాత నాకు అమ్మమ్మని చూడాలనిపించింది. అమ్మను అడిగాను. వెళ్లమంది. నేను ఒక్కదాన్నే వచ్చాను.

మూసిన ఇంటి తలుపుల్ని చూడగానే ఏదో బెరుకు, సంతోషం కూడా. బ్యాగ్ కింద పెట్టి వాటిని రెండు చేతుల్తో తాకాను. ఈ తలుపుల మీద మా అమ్మ ముద్రలు ఇంకా వున్నట్లు నాకు అనిపించింది.

మెల్లగా తలుపుమీద చప్పుడు చేశాను.

'వస్తున్నా' అని, 'ఎవరో వచ్చారు. చూసొస్తా' అనటం వినిపించింది.

అమ్మ మాట్లాడినట్లే వుంది.

తలుపులు తెరుచుకున్నాయి. కళ్లు చిట్లించి నాకేసి చూస్తోంది అమ్మమ్మ.

'నా పేరు చైతన్య, మా అమ్మ పద్మ' అన్నాను.

ఆమె ముఖంలో కొద్దిగా చిరునవ్వు.

'లోపలికి రావచ్చా?' అన్నాను.

'నేను నిన్ను లోపలికి రానివ్వనని పద్మ చెప్పిందా?' అంది.

తల అడ్డంగా వూపాను.

'ఇంటికి వచ్చిన వారిని లోపలకి రానీయనంత చెడ్డదాన్నని నువ్వనుకున్నావా?'

'అది కాదు' నసిగాను.

'సర్లే, లోపలకు రా' అంది.

అమ్మమ్మ నన్ను ఓ గదిలోకి తీసుకువెళ్లింది. మొత్తం ఆ ఇంట్లో మూడు గదులున్నాయి.

'మీ అమ్మ పుస్తకాలు ఈ గదిలోనే పెట్టుకునేది. మీ మావయ్య ఆ గదిలో వుండేవాడు. రాత్రిపూట మాత్రం ఇద్దరూ నా దగ్గరే పడుకునేవారు' అంది. ఏదో



ఓం సచ్చిదానంద పరబ్రహ్మ పురుషోత్తమ పరమాత్మ
శ్రీ భగవతి సమేత శ్రీ భగవతే నమః

## శ్రీ భగవతి భగవాన్‌ల

# దివ్యానుగ్రహదీపిక

సమస్యల సుడిగుండంలో ఉక్కిరిబిక్కిరి అవుతూ – సంకోచాలు, సందిగ్ధాలు, సంక్షోభాల మధ్య కొట్టుమిట్టాడుతూ అనంతమైన అశాంతితో అనుక్షణమూ అలమటిస్తూ – బ్రతుకులను భారంగా ఈడుస్తున్న నేటి ఆధునిక మానవుణ్ని అన్ని దుఃఖాలనుండి విముక్తుణ్ని చేసి స్వర్ణయుగ స్థాపనే ధ్యేయంగా సంకల్పం తీసుకొని దివి నుండి భువికేతెంచిన అవతారమూర్తులు **శ్రీ కల్కి భగవాన్** మరియు **భగవతి పద్మావతి అమ్మ** – అతి సామాన్యుని సైతం ధర్మమార్గంలో పయనింపచేస్తూ ముక్తిని ప్రసాదిస్తున్న జీవన్ముక్తి ప్రదాతలు.

అనతికాలంలోనే ప్రపంచవ్యాప్తంగా దాదాపు 160 దేశాల్లో 100 కోట్ల మందికి పైగా చేరువైన భగవద్ధర్మం స్వర్ణయుగపు ఉషోదయంలో ఏకత్వపు కాంతి పుంజాలను వెదజల్లుతోంది. ఉరకలు వేస్తూ పరవళ్లుతొక్కుతున్న **శ్రీ అమ్మభగవాన్**ల దివ్యానుగ్రహపు వెల్లువలో... ఆ ఆనందసాగరంలో ఓలలాడే కోట్లాది మంది భక్తులు తమ జీవితాలను రాగరంజితం... అనురాగరంజితం చేసుకొనియున్నారు.

భగవంతుని తత్వాల్లో స్నేహతత్వం ఒకటి. తన స్నేహ హస్తాన్ని అందించి... అక్కున చేర్చుకొని, అలరిస్తూ – స్నేహంలోని మాధుర్యాన్ని అనుభవింపచేస్తూ – వారి అనంతమైన ప్రేమలో పరవశింపచేస్తూ – అనూహ్యమైన వారి కరుణలో కరిగింపచేస్తూ, మనలను పరివర్తనాదిశగా పరుగులు తీయిస్తూ – ఆనందం ... పరమానందంవైపుగా అడుగులు వేయిస్తున్నారు. మన **అమ్మా భగవాన్‌లు.**

**పురుషోత్తమ భగవాన్** స్వయంగా సృజించి – ధరించిన పాదుకలు... వారి దివ్యానుగ్రహాన్ని నింపుకొని... కేవలం మీ కోసం; మీ ఊరికి – మీ ఇంటికి వస్తున్నాయి. ఈ విశ్వాన్ని నడిపించే పాదాలే మీ చెంతకు చేరుతున్నాయి.

మన జీవితాలలో వెలుగులు నింపే మన **అమ్మాభగవాన్**లను హృదయం తెరచి మరీ ఆహ్వానిద్దాం...! మనమూ అలరిద్దాం...! వారితో ఏనాడో కోల్పోయిన బంధాన్ని... అనుబంధాన్ని పునరుద్ధరిద్దాం...!

ఇది ఒక కొత్త మతం కాదు; మరో స్వచ్ఛంధ సంస్థ అంతకన్నా కాదు; మరి దేనినో ఆశించి చేసే ప్రచారమూ కాదు. కేవలం **'మన కోసం... మన కుటుంబ సంక్షేమం కోసం'** ...! మాత్రమే..

కుంచించుకుపోయిన హృదయం మన **అమ్మాభగవాన్**ల అద్వితీయమైన అనుగ్రహంతో వికసిస్తుంది – జీవనవికాసం కలిగిస్తుంది. హృదయం వికసించిన వ్యక్తి మాత్రమే జీవించగలడు... జీవితాన్ని సంపూర్ణంగా అనుభవించగలడు – ఆసాంతం ఆస్వాదించగలడు.

**ఆధ్యాత్మికతతో కూడిన సామాజిక మార్పుకై; నవ సమాజ నిర్మాణానికై తపించి ... తపించి ... తరిద్దాం...!**

**అత్యంత శాంతియుతంగా మరింత వేగవంతంగా జరుగుతున్న మన అమ్మాభగవాన్‌ల ఈ ధర్మ సంస్థాపనలో బాధ్యతగా భాగం వహిద్దాం...!**

మనకోసం; మన ఉన్నతికోసం – మన సమాజం కోసం; సమాజ శ్రేయస్సుకోసం – మన దేశం కోసం; దేశ శాంతి సౌభాగ్యాలకోసం ... ఆ 'నారాయణుడి'తో చేయిచేయి కలిపి ఈ భూలోకాన్నే స్నేహమయం – ప్రేమమయం – రాగమయం ... అనురాగమయం – శాంతిమయం చేద్దాం....!

# FRIENDS

# Cell: 9440295528

గుర్తొచ్చినట్లు నేను తలూపాను.

'నువ్వీ గదిలోనే వుండు' అంది అమ్మమ్మ.

అమ్మమ్మకి రెండెకరాల పొలం వుంది. తానే దగ్గరుండి వ్యవసాయం చేయిస్తుంది.

నన్ను పొలం తీసుకెళ్లింది. నేనూ అమ్మమ్మా నడిచివస్తున్నప్పుడు 'ఎవరా అమ్మాయి' అని అడిగారు.

'నా మనవరాలు' అంది. ఆ మాటల్లో సంతోషమో- గర్వమో వున్నాయి.

రాత్రి పడుకున్నప్పుడు అడిగింది.

'ఏం చదువుతున్నావ్?'

'ఇంటర్ మీడియట్'

'నువ్వు కూడా ప్రేమించి పెళ్లి చేసుకుంటావా?' అంది యాదాలాపంగా.

నేను మాట్లాడలేదు. తనూ మాట్లాడలేదు.

'ప్రేమంటే ఏమిటి?' అన్నాను కొద్దిసేపటి తర్వాత.

'మీ అమ్మ నీకు చెప్పలేదా?'

'నేను అమ్మని అడగలేదు. మా నాన్నని కూడా' అన్నాను.

'ప్రేమంటే నాకు తెలియదు' అంది అమ్మమ్మ.

'నాకూ తెలియదు'

'మీ ఇంటినిండా పుస్తకాలుంటాయన్నావు. అందులో ప్రేమ గురించి లేదా?' అంది.

'పుస్తకాల్లో వుంది అమ్మమ్మా... పుస్తకాల్లో వున్నవన్నీ నాకు అర్థం కావు' అన్నాను.

అమ్మమ్మ దగ్గర నేను వారం రోజులు వున్నాను.

'మీ అమ్మ పాడుతోందా?' అంది అమ్మమ్మ ఓ రోజు.

'చిన్నప్పుడు జోలపాట పాడేదంట. నేను చిన్నపిల్లని కదా. గుర్తులేదు'

'నువ్వు అల్లరి పిల్లవే'

'అమ్మ అల్లరి చేసేది కాదా?'

'అల్లరి చేయకపోతే పిల్లలెలా అవుతారు. మీ అమ్మా - మావయ్యా ఎప్పుడూ తగాదా పడేవారు. అంతలోనే కలిసిపోయేవారు. మీ అమ్మమీద నాకు ఎంత కోపం వచ్చినా అది పాట పాడగానే కోపం ఎగిరిపోయేది. మీ తాతకు కూతురి పాటవినే అదృష్టం లేదు.'

'ఇన్ని రోజులుగా అమ్మ పాట వినాలనిపించలేదా?' అన్నాను.

అమ్మమ్మ మాట్లాడలేదు.

అమ్మమ్మ వినటంలేదని అమ్మ పాడటం మానేసిందేమో!

నేను అమ్మమ్మ దగ్గరనుంచి వచ్చేటప్పుడు పంపులో నీళ్ళు తాగాలనిపించింది. అటు నడుస్తున్నదాన్నల్లా ఆగి 'అమ్మమ్మా' అని అరిచాను.

'ఏంటమ్మా' అని పరిగెత్తుకు వచ్చింది.

నేను భయంతో వణికిపోతున్నాను. ఎదురుగా ఎనిమిదడుగుల దూరంలో పడగమీద నిలబడ్డ పాము!

అమ్మమ్మ ఆ పామును చూసి 'ఇంతేనా... ఏం చేయదులే' అంది.

'ఎవరినన్నా పిలువు, కర్రతో కొట్టి చంపేస్తారు.'

'మనల్ని ఏమీ చేయనప్పుడు పామునెందుకు చంపాలి?' అంది అమ్మమ్మ.

నేను పాముమీద నుండి దృష్టి మరల్చలేదు. కానీ అమ్మమ్మ మాటలు నన్ను ఓ 'షాక్'కి గురి చేశాయి.

అమ్మమ్మ చెప్పినట్లు ఆ పాము వెనక్కి తిరిగి పాక్కుంటూ వెళ్లిపోయింది.

'వెళ్లు... పంపులో నీళ్లు తాగు'

'నాకు భయం. ఇంకా పాములున్నాయేమో'

తనే వెళ్లింది. పంపు కొడుతుంటే ధారలుగా నీళ్లు. దోసిలితో తెచ్చింది. వాటితో

నా ముఖం కడిగింది.

అప్పుడు తగ్గింది వణుకు.

'మనిషి ప్రాణమే కాదమ్మా... ఈ ప్రపంచంలోని ప్రతి ప్రాణి ప్రాణం విలువ యిందే. ఒక్క మనిషి తప్ప మిగతా ప్రాణులన్నీ ఆకలయిన మేరకే ఆహారం తీసుకొంటాయి- సరదాకి కాదు' అంది.

* * *

కాలేజీలో అందరం కలుసుకున్నాం. కబుర్లే కబుర్లు. అందరూ మాట్లాడుతున్నారు.

'నేను మా అమ్మమ్మని చూశాను' అన్నాను.

'అదేంటి అదేదో గ్రహంనుండి వచ్చిన వింత మనిషిని చూసినట్లు.'

'నేను మొదటిసారి మా అమ్మమ్మని చూశాను' అన్నాను.

'సారీ చైతూ...'

'మా అమ్మమ్మ కోసం సెన్సేషన్ క్రియేట్ చేసే పుస్తకం రాయాలి'

ఒక్కసారిగా నిశ్శబ్దం.

'ఏమిటి సైలెంట్ అయిపోయారు?' అన్నాను.

'నువ్వేంటోయ్ సాఫ్ట్‌వేరూ- డాక్టరూ- ఎబ్రాడూ వీటి గురించి చెప్పకుండా రైటర్ అవుతానన్నావు' అంది అంజు.

'నిజంగా చైతూ.. పుస్తకం రాయాలేగాని దానికున్న గ్లామరూ, మనీ ఎక్కడున్నాయి. హారిపోటర్ సిరీస్ మా ఇంట్లో వుంది. రౌలింగ్ ఇప్పుడు ప్రపంచంలోని మిలియనీర్లలో ఒకత్తె' అంది సుష్మ.

'చైతూ రాస్తే, హారిపోటర్ లాంటి అభూతకల్పన వుండదు.'

'అరుంధతిరాయ్‌లా గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్ రాస్తుంది.'

'అవునవును. వాళ్లమ్మగారు మహిళా సంఘం నాయకురాలుకదా.'

'ఇది కూడా ఏ బుకర్ ప్రైజో కొట్టేస్తుంది. ఆ తర్వాత ఏ డ్యామ్‌లకు వ్యతిరే

## చక్కని వేదిక 'చతుర'

- పి.చంద్రశేఖర అజాద్



విభిన్న నవలలు రాయడానికి 'చతుర' ఓ చక్కని వేదిక. 'చతుర'లో ఇది నా ఏడో నవల. ఇప్పటివరకూ వచ్చిన 'భయం', 'ది రోడ్', 'మనీషి', 'భువికి దిగిన తార', 'గట్టుమీద చేప', 'భూషణంగారి భోషాణం' పాఠకుల ఆదరణ చూరగొన్నాయి. 'ఉరి'పై పాఠకుల తీర్పుకు ఎదురు చూస్తున్నాను. నవలలకు సంబంధించి 'అనిల్ అవార్డు', 'చతుర' బహుమతి, వరసగా మూడేళ్ళ ఆటా- తానా- ఆటా బహుమతులు వచ్చాయి. ఇంకా ఎన్నో కథలకూ బహుమతులు లభించాయి. ఈ యాభైఏళ్ల జీవితంలో గత పాతికేళ్ళుగా 40 నవలలు, 350 కథలు, సుమారు మూడువేల టీవీ ఎపిసోడ్లు, అరడజను వరకూ సినిమాలకు రచనలు చేశాను. పత్రికల్లో వ్యాసాలు వచ్చాయి. కొన్ని కాలమ్స్ నిర్వహించాను. ప్రస్తుతం టీవీ, సినీ రంగాల్లో కృషిచేస్తున్నాను.

చిరునామా :
ఫ్లాట్ నెం.101, సాయి రెసిడెన్సీ,
సంగీత్‌నగర్, కూకట్‌పల్లి,
హైదరాబాద్ - 5000 072.
ఫోన్: 040 - 23063975

కంగానో ఉద్యమాలు కూడా చేస్తుంది.'

ఇంతలో అంజు పరిగెత్తుకుంటూ వచ్చింది.

తనని చూస్తుంటే ఏదో జరిగిపోయిన ట్లుంది. నిలువెల్లా వణికిపోతోంది. అప్పుడే గుంపులు గుంపులుగా క్లాస్‌రూముల నుండి పరిగెత్తుకొస్తున్నారు విద్యార్థులంతా.

'ఏమైంది అంజూ...' ఎవరో కుదుపుతున్నారు.

'నరికేశాడు... నరి' మాట్లాడలేకపోతోంది అంజు.

ఎవరో వాటర్ బాటిల్ అందించారు. ముఖం కడుక్కొని బాటిలెత్తి తాగేసింది.

'నరకటం ఏమిటి? ఎవర్ని నరికేశారు?' కంగారుగా అడుగుతున్నారు.

'హాసినిని క్లాస్‌రూమ్‌లో అందరూ చూస్తుండగా మద్దు కత్తితో...'

'మద్దు కత్తితోనా?'

'అవును. క్లాసంతా రక్తపు మడుగు. గోడలనిండా రక్తపు మరకలు. చూడటానికి చాలా భయంకరంగా వుందంట'

కొంతమంది లేచి వెళ్లిపోయారు.

నాకు హాసినిని చూడాలనుంది. చూడలేను. చూసి తట్టుకోలేను. నాకు భయంగా వుంది. ఇంతకుముందు ఓ అమ్మాయి ముఖంమీద యాసిడ్ పోశారు. అప్పుడు అందమైన ఆ ముఖం, శరీరం కాలిపోయి వికృతంగా మారిపోయిన ఫొటోలు పత్రికల్లో చూశాను. అప్పుడూ అంతే... భయం...

అవన్నీ ఎక్కడో జరిగాయి. ఇది మా దగ్గర...

'ఎందుకు చంపేశాడు?'

'ప్రేమించమని అడిగాడంట. తను ప్రేమించనంది. అందుకే నరికేశాడు'

పాత కథే.

ప్రేమించకపోవటం నేరమా!

'రాష్ట్రంలో ప్రేమించని కారణంగా ఎంత మంది అమ్మాయిలు బలి కావాలి. ఒక్క ఆడపిల్లన్నా తనను ప్రేమించలేదని ఏ మగాడ్నయినా నరికేసిందా... ఇంతకు ఆ దుర్మార్గుడెవడు?'

'శంకర్.. వాడే. ఏ మాత్రం జాలిలేకుండా, క్రూరంగా నరికేసి తాపీగా నడుచుకుంటూ వెళ్లాడు.'

నేను ఇంటికి వచ్చేశాను.

ఇంట్లో ఎవరూ లేరు. ఇంట్లో నేను ఒక్కదాన్నే. ఇప్పుడు ఎవరన్నా వస్తే... నన్ను ప్రేమిస్తావా లేదా అని మద్దుకత్తి తీసి...

బిగ్గరగా అరవాలనుకున్నాను.

హాసిని అలానే అరిచి వుంటుంది.

తను రక్తంలో గిలగిల కొట్టుకుంటూ... ఆర్తనాదాలు చేస్తూ...

వద్దు... ఆ ఊహ కూడా వద్దు...

కోర్టునుండి నాన్న ఇంటికి వస్తే బాగుండును. అమ్మ వస్తే బాగుండును. నాకు ఇప్పుడు స్పర్శ కావాలి. అమ్మమ్మ గుర్తొచ్చింది. అవును నాకు అమ్మమ్మ స్పర్శ కావాలి.

★ ★ ★

పద్మ ఇంటికి వచ్చేటప్పటికి చైతన్య ఏదో కోల్పోయిన దానిలా ఉంది.

ఆ అమ్మాయి ముఖంలో కళాకాంతులు లేవు.

'ఏమిటి చైతూ, అలా ఉన్నావేంటి?' అంది పద్మ.

'హాసిని చచ్చిపోయిందమ్మా. కాదు,

**'ఏమైంది అంజూ...' ఎవరో కుదుపుతున్నారు. 'నరికేశాడు... నరి' మాట్లాడలేకపోతోంది అంజు.**




# తులసి డిజిటల్ స్టూడియోస్

మీ రంగుల కలల ప్రపంచం

అరండల్‌పేట 4/2, గుంటూరు, ✆ 0863 - 2266036, 6578036

ఇప్పుడు

## న్యూ టెక్నాలజీ లేజర్ ఫోటో ప్రింటర్

మీకు అందుబాటులో...

**16 పాస్‌పోర్ట్ సైజు ఫోటోలు**



కేవలం **రూ.30/-** మాత్రమే



కేవలం **1** గంటలోనే డెలివరీ

**మీరు కోరిన సైజులో అందించటం మా ప్రత్యేకత**

- డిజిటల్ ఫోటో ప్రింటింగ్
- ఫ్లెక్స్ & వినైల్ ప్రింటింగ్
- ఐడి కార్డ్ ప్రింటింగ్
- ఫ్యాషన్ ఫోటోగ్రఫీ




అత్యంత ఆధునిక టెక్నాలజీతో

**బెస్ట్‌క్వాలిటీ ఫ్లెక్స్/ వినయిల్ ప్రింటింగ్**

చంపేశారు'

అప్పటికి పద్మకి ఆ విషయం తెలియదు.

'హాసినిని చంపటం ఏమిటి?' అంది అనుమానంగా.

చైతన్య జరిగిన విషయం చెప్పింది. పద్మ వెంటనే టీవీ ఆన్ చేసింది.

హాసిని హత్యకు సంబంధించిన విషయాలు స్క్రోల్ అవుతున్నాయి. శంకర్ పారిపోయాడు. ఎక్కడ ఉన్నాడో తెలియదు. అతని ఫోటో కూడా చూపిస్తున్నారు.

పద్మ తన సెల్‌ఫోన్ చూసుకుంది. ఛార్జ్ అయిపోయింది. అందుకేనా ఏ ఫోన్ రాలేదు అనుకుంది. వెంటనే ఛార్జింగ్‌లో పెట్టింది.

ల్యాండ్‌లైన్ నుంచి ముందు గోపాల్‌కి ఫోన్ చేసింది. తర్వాత ఎవరెవరితోనో హడావుడిగా మాట్లాడింది. మాట్లాడుతూనే ఉంది.



గోపాల్ ఇంటికి వచ్చాక 'చైతూ ఎక్కడ?' అని అడిగాడు.

'గదిలో ఉంది. తను చాలా డిస్ట్రబ్ అయినట్లుంది గోపాల్. నేను ఈ విషయం తెలిసిందగ్గర్నుంచి ఫోన్‌లో మాట్లాడుతూనే వున్నాను' అంది.

'చైతూ భోంచేసిందా?'

'తెలియదు. మరిచిపోయాను. వంట చేయలేదు. నువ్వా పని చూస్తావా?'

'ముందు చైతూతో మాట్లాడాలి' అని గోపాల్ కూతురు గదిలోకి వెళ్లాడు.

బెడ్‌లైట్ మాత్రం వెలుగుతోంది. చైతూ మంచాన్ని ఆనుకుని కూర్చుని వుంది. 'లైట్ వేసుకోలేదేంటమ్మా' అని స్విచ్ ఆన్ చేశాడు. ఒక్కసారిగా గదంతా వెలుగు పరుచుకుంది. అప్పుడు చూశాడు చైతన్యని. చెంపలమీద కన్నీటి చారలు ఎండిపోయి వున్నాయి.

'చైతూ' అన్నాడు.

ఇంక కంట్రోల్ చేసుకోవటం చేతకాలేదు. 'నాన్నా...' అంటూ ఏడ్చేసింది.

గోపాల్ వెళ్లి కూతురు పక్కన కూర్చున్నాడు.



తండ్రి భుజం మీద తల ఆనించి ఏడుస్తూనే ఉంది.

అప్పుడే లోపలకు వచ్చిన పద్మ కొద్దిసేపటిదాకా మాట్లాడలేకపోయింది. ఆమె మనసులో దుఃఖాన్ని మించిన ఆగ్రహం ఉంది.

'చైతూ! లేచి ముఖం కడుక్కురా' అంది.

అప్పుడే చైతన్య నాన్నని ఏదో అడగాలనుకుని ఆగిపోయింది.

ఆ రాత్రి ఎవరూ భోంచేయలేదు. గోపాల్ మాత్రం 'టీ' తాగాడు.

పడుకోబోయేముందు చైతన్య అడిగింది.

'అమ్మా... ఈరోజు నువ్వు నా గదిలో నాతో పడుకుంటావా?'

పద్మ అప్పుడు చైతన్య ముఖంలోకి చూసింది.

'భయంగా వుందా?'

'అవునమ్మా'

'అలాగే పడుకుంటాను. నువ్వు భయపడొద్దు చైతూ. ప్రపంచం ఇలానే



ఉంటుంది. అన్నీ మనం అనుకున్నట్లు జరగవు. ప్రతిరోజూ ఎక్కడో చోట ఏదో ఒక మారణకాండ జరుగుతూనే ఉంటుంది చైతూ. మనం మనసుని గట్టిగా చేసుకో వాలి. ఇప్పుడే వస్తాను' అని గోపాల్ దగ్గ రకు వెళ్లింది.

★ ★ ★

నేను నాన్నని అడగాలనుకున్న ప్రశ్న- 'ప్రేమంటే ఏమిటి?' అని. అడగలేకపో యాను. ఎందుకో తెలియదు. మా కాలే జీలో మేమందరం కూర్చున్నప్పుడు ఈ 'ప్రేమ' గురించి తరచుగా వస్తుంటుంది. మా చర్చల్లో అదో భాగం.

మాలో చాలామంది ఆడపిల్లలు కాలేజ్ ఎగ్గొట్టి సినిమాలు చూస్తుంటారు.

'బ్యూటీఫుల్ లవ్‌స్టోరీ' అంటారు ఒక్కో సారి.

'అందమైన ప్రేమ వుంటుందా... ప్రేమంటే అందమేనా?'

మొదటిసారి నేను పుస్తకాలు చదువుతు న్నప్పుడు కొన్ని వాక్యాలు నన్ను ఓ కుదు పుకు లోను చేశాయి-

'స్త్రీకి హృదయం ఉంది. స్త్రీకి మనసు ఉంది. స్త్రీలకు స్వేచ్ఛ కావాలి.'

ఇలాంటి పదాలు ఎందుకు రాస్తున్నారు. స్త్రీ గురించే ప్రత్యేకంగా ఎందుకు చెబుతు న్నారు. మాకూ హృదయం- మెదడు- బుద్ధి ఉన్నాయని ప్రపంచానికి స్త్రీలే చెప్పాలా అనుకున్నాను.

'చెప్పటం కాదు. గుర్తు చేయాలి. ప్రపం చమంటే మగవాళ్ల మాత్రమే అనే భావం పెరిగిపోయింది. అలాంటప్పుడు ఎవరో ఒకరు ముందుకు రావాలి. ఒకప్పుడు ఆడ వాళ్ల గురించి మగవాళ్లే చెప్పేవారు. చాలాకొద్దిమంది ఆడవాళ్లు మాత్రమే తమ భావాల్ని బయటకు చెప్పేవారు. మిగతా వారు తమ బాధల్ని-భావాల్ని మనసులో దాచుకునేవారు. అలా దాచుకోవటం గొప్ప త్యాగం అనుకునేవారు. సాహిత్యంలో గాని - సినిమాల్లోగాని నేను నిన్ను ప్రేమిస్తు న్నాను అని స్త్రీలు ముందుగా చెప్పటం జరిగిందా. ఎక్కడో ఒకరో ఇద్దరో మాత్రమే అలా చెప్పారేమో. ప్రపోజల్ ఎప్పుడూ మగవారి నుండే వస్తుంది.'

'అమ్మా - నాన్నని ప్రేమించానని నువ్వు చెప్పావా- నాన్న చెప్పారా?'

అమ్మ ఆలోచనల్లో పడింది.

'ఇద్దరి ఆలోచనలూ అవే అయినా మీ నాన్నగారే ముందుగా అడిగారు' అంది అమ్మ. అమ్మ ఈ విషయం వెంటనే ఎందుకు చెప్పలేదో నాకు అర్థం కాలేదు.

ఇంతకూ 'ప్రేమ' అనేది వుందా అంటే తప్పకుండా వుంది. మా అమ్మ- నాన్నలే అందుకు ఉదాహరణ.

నన్ను ప్రేమించకపోతే చంపేస్తాను అనటం. కొబ్బరి బొండాలు నరికే కత్తుల్తో ఆడపిల్లల్ని నరకటం ఇటీవలి పరిణా మమే.

'చైతూ నిద్ర పోలేదా?'

'నిద్ర రావటం లేదమ్మా'

'కళ్లు మూసుకుని పడుకో. మనసులోకి ఎలాంటి ఆలోచనా రానీయకు. హాసినిని చంపినవాడ్ని వదిలిపెట్టే సమస్య లేదు. రేపట్నుంచి మేం పెద్ద ఉద్యమం చేయబో తున్నాం' అంది అమ్మ.

★ ★ ★

కళ్లు మండుతున్నాయి.

రాత్రి ఎప్పుడు నిద్ర పట్టిందో తెలి యదు. ముఖం కడుక్కున్నాను.

అయినా ఇంకా తలనొప్పిగానే వుంది. అమ్మ 'టీ' ఇచ్చింది.

మా ఇంటికి నాలుగయిదు దినపత్రికలు వస్తాయి. వాటన్నింటిలోనూ ఇదే వార్త.

హాసిని ఫొటో వేశారు.

నిన్నటి బాధ చోటులో ఇప్పుడు నాలో

యూనిట్ ఒక్కింటికి Rs. 1000/- లకే

# ఫిక్స్‌డ్ సిరామిక్ దంతాలు అమర్చబడును

**సిరామిక్ దంతాల కొరకు (Per Unit) రూ.4,000/-, రూ.3,000/-, రూ.2,000/- లేదా రూ. 1,500/- చెల్లిస్తున్నారా? అవసరం లేదు కేవలం రూ. 1,000/- లకే అంతర్జాతీయ ప్రమాణాలతో కూడిన ఫిక్స్‌డ్ సిరామెక్ దంతాలు అమర్చబడును.**

**ఇంత తక్కువ ధర అయితే తక్కువ క్వాలిటీ అనే అనుమానం రావటం సహజమే!**

**సాధారణంగా ల్యాబ్ ఛార్జస్ ముంబాయి, ఢిల్లీ వంటి నగరాల్లో సైతం సుమారు రూ. 500/- నుండి రూ. 700/- వరకు వుంటాయి.**




*గత 5 సం॥లుగా విజయవాడ, హైదరాబాద్, విశాఖపట్నం, నెల్లూరు, వరంగల్, ఒంగోలు, తిరుపతి వంటి నగరాలలోని ప్రముఖ దంత వైద్యులెందరికో మేము మా సొంత ల్యాబ్‌లో కేవలం రూ. 600/-లకే (ల్యాబ్ చార్జస్) VITA (జర్మని) సిరామెక్ మెటీరియల్‌తో సిరామిక్ దంతాలను తయారుచేసి అందిస్తున్నాము. ఇప్పుడు నేరుగా పేషెంట్‌కే ఈ బెనిఫిట్ అందించే విధంగా కేవలం రూ. 1000/- లకే అత్యుత్తమ నాణ్యతా ప్రమాణాలతో విజయవాడలోని మా దంత వైద్యశాలలో ఈ అవకాశం కల్పించబడినది.*

**రూ. 1000/-లకే వేరే వారు సైతం అందించవచ్చు! కాని ధరతో పాటు నాణ్యతా ప్రమాణాలను సరిచూసుకోండి:**

- ☞ M.D.S. Prosthodontist (కట్టుడు పళ్ల ప్రత్యేక వైద్యనిపుణులు)చే చికిత్స
- ☞ రబ్బరు మెటీరియల్‌తో కొలతలు, టెంపరరీ దంతాలు అమర్చుట,

# శ్రీ కృష్ణ డెంటల్ కేర్

షణ్ముఖ కాంప్లెక్స్, విజయా టాకీస్ ఎదురుగా, ఏలూరురోడ్, విజయవాడ. ఫోన్: 0866-6645454

ఓ కోపం. తను మా సెక్షన్ కాదు. అయినా మా ఇద్దరికీ పరిచయం వుంది.

'హాసిని' అని ఎందుకు పేరు పెట్టారో గాని ఆ పెదవులమీద చిరునవ్వు చెర గదు. ఆ నవ్వు మనోహరంగా వుంటుంది. తనెప్పుడూ క్యాంటీన్‌కి రావటం వుండదు. ఇంటి నుండి టిఫిన్‌బాక్స్ తెచ్చుకుం టుంది. ఏ చెట్ల దగ్గరో కూర్చుంటుంది. ఏమాత్రం తీరిక దొరికినా లైబ్రరీకి వెళ్తుంది. తనకు పుస్తకాలు తప్ప ఇంకో ప్రపంచం లేదన్నట్లుగా వుంటుంది. మొదట్లో 'పుస్తకాల పురుగు' అని కొందరు హేళన చేసినా పట్టించుకునేది కాదు. చిరునవ్వుతో, 'నన్ను వదిలేయండి' అనేది.

'మాది పేద కుటుంబం. నేను చదువు కోవాలి. ఉద్యోగం చేయాలి. మా ఇంట్లో అన్నీ సమస్యలు. తమ్ముడ్నీ- చెల్లినీ నేను చదివించాలి. మా నాన్న చనిపోయారు. మా అమ్మ ఆశలన్నీ నామీద పెట్టుకుంది. నేను మీ అందరిలా ఎంజాయ్ చేయలేను. నా దృష్టంతా చదువుమీదే' అని చెప్పిందో సారి.

శంకర్ లాంటివాడు హాసిని వెంటబడ టానికి తను పేద అమ్మాయి కావటం కూడా ఓ కారణం అయివుండాలి. ఇలాం టివాళ్లు ఎవరినన్నా బెదిరించాలనుకున్న ప్పుడు అమ్మాయిలకు చెందిన అన్ని వివ రాలూ తెలుసుకుంటారేమో.

'ఈ రోజు కాలేజీకి వెళ్తావా' అన్నారు నాన్న.

'వెళ్తాను' అన్నాను.

నిజానికి కాలేజీకి సెలవు ప్రకటించారు. అయినా అందరూ వచ్చారు. ఆడపిల్లలం దరం ఓచోట చేరిపోయాం. మా అభిప్రా యాలు తెలుసుకోవటానికి పత్రికలవారూ, టీవీ ఛానల్స్‌వారూ వచ్చారు.

'శంకర్‌ని ఉరి తీయాలి' అందో అమ్మాయి.

'అవును' అంటూ అప్రయత్నంగా మేమందరం అరిచాం.

'కేవలం జైలుగోడల మధ్య ఉరితీస్తే సరిపోదు. బహిరంగంగా ఉరి తీయాలి' అంది ఇంకో అమ్మాయి.

ఇంత ఉద్రేకం వున్నా.. నేను కొంత మంది అమ్మాయిల్ని గమనించాను.

వారందరి కళ్లలో భయం వుంది. తాము ఏం మాట్లాడినా శంకర్‌కి వినిపి స్తుందేమోనన్నంతగా భయపడుతున్నారు. ముఖ్యంగా టీవీల్లో కనిపిస్తే గుర్తు పెట్టు కుని శంకరో, వాడి తాలూకు బంధువులో హాని తలపెడతారేమో అన్న అనుమానం వారిది.

ఒకటి మాత్రం నిజం. ఈ దారుణం రాష్ట్రాన్నే కాదు. దేశాన్ని కదిలించింది. ఎక్కడ చూసినా ఇవే చర్చలు. ముందు శంకర్‌ని పట్టుకోవాలి. విచారణ జరిపి కఠినంగా శిక్షించాలి. మళ్లీ ఇలాంటి దారు ణానికి ఇంకెవరూ సాహసం చేయకూ డదు.

ఇంతకూ శంకర్ ఎక్కడున్నాడు?

★ ★ ★

అక్కడ మహిళా సంఘాలవారు సమా వేశమయ్యారు.

అరుణ, సంధ్య, లక్ష్మి, సబిత, ఇంకొం దరు మహిళలు. అయిదారు సంఘాలకు చెందినవారు. అప్పుడప్పుడూ మహిళల సమస్యలమీద పోరాటం జరుగుతున్న ప్పుడు కలుసుకుంటారు. ప్రభుత్వాన్ని నడుపుతున్న పార్టీ మహిళా సంఘంవారు రాలేదు. వాళ్లు విడిగా ఓ ఊరేగింపు చేస్తు న్నారు. ఇప్పుడున్న సంఘాల ప్రతినిధుల మధ్య కూడా ఏదో తెలియని దూరం వుంది. వారందరూ మనసు విప్పి మాట్లా డుకోలేదు.

'మమ్మల్ని వేరు చేస్తున్నది సిద్ధాంతాలా- పార్టీలా- మగవాళ్లా" అనేది వారిలో

కొందర్ని తొలిచే ప్రశ్న.

ఆయా సంఘాలకు తగిన రీతిలోనే కొందరు తీవ్రంగా వుంటారు. ఇంకొంత మంది ఇతర సంఘాలవారిమీద జోకులు వేసుకుంటారు. కొన్ని సంఘాలవారు ఇలాంటి సమయాల్లో మాత్రమే బయటి కొచ్చి పత్రికల్లోనూ, టీవీల్లోనూ ప్రకటన లకి పరిమితం అవుతుంటారని కొందరి అభిప్రాయం. ప్రమాదకరంకాని నిర్బంధం ఎదుర్కొని కార్యక్రమాలు మాత్రమే చేపడ తారని కొందరంటే చులకన కూడా.

'మా అమ్మాయి మొదటిసారి నన్ను తనతోపాటు పడుకోమంది. నాకు భయంగా వుందమ్మా అంది. రాత్రంతా ఉలిక్కిపడుతూనే వుంది. నిజం చెప్పా లంటే నాకూ భయం కలిగింది. ఇలా నరుక్కుపోతుంటే రేపు మన పిల్లలకీ అదే పరిస్థితి వస్తుంది. ఇప్పుడు పెళ్లికాని వారి మీదే ఈ దాడులు చేస్తున్నారు. రేపటి నుంచి పెళ్లయినవారి మీద కూడా తమను ప్రేమించమనీ- లేదంటే నరికేస్తామనే బెది రింపులు రావచ్చు' అంది పద్మ.

'ఆకాశంలో సగం అని మనం పొయెటి క్‌గా చెప్పుకోవచ్చు. ఇప్పుడు మనం ఆకా శంలో సగం కాదు. మూడింట ఒక వంతు మాత్రమే. నేను చెప్పాలనుకుం టోంది ఒకటే. ఇంత దుర్మార్గం నాలుగు రోజుల్లో పాతబడిపోతుంది. నేరస్థుల గురించి ఎవరూ పట్టించుకోరు, ఇంకో హత్య జరిగేదాకా' అంది అరుణ.

'అరుణా - మనమేం చేయాలంటావ్?'

'హంతకుడికి శిక్ష పడాలి. అప్పటిదాకా మనం రాజీ పడకూడదు.'

'అరుణ చెప్పింది బాగానే వుంది. ఇంత వరకూ ఆ శంకర్‌ని పోలీసులు అరెస్ట్ చేయలేదు. వాడు ఎక్కడున్నాడో తెలి యదు. వాడిని రక్షించటానికి కొంతమంది నాయకులు ప్రయత్నాలు చేస్తుండొచ్చు. ఈ పోరాటం ఎంతకాలం చేయగలమో మనం చెప్పలేం. దానికి గడువులు విధిం చుకోవటం సరైంది కాదు' అంది స్వరాజ్యం.

'ఆ మాటకొస్తే మనం మాత్రమే కది లితే చాలదు. తల్లిదండ్రులంతా కదలాలి. హాసిని మీదో, ఆ అమ్మాయి కుటుంబం మీదో జాలి చూపిస్తే చాలదు. ముఖ్యంగా ప్రజల నుండి నిరసన రాకపోతే ప్రభు త్వాలు కదలవు' అంది సంధ్య.

అవును, కోర్టులు కూడా ప్రజల ఉద్వేగా లని అర్థం చేసుకుంటాయి" అంది లక్ష్మి.

'ప్రభుత్వమూ- చట్టమూ ఇవన్నీ మీరు మొదటినుండి పెంచుకున్న భ్రమలు' అనా లనుకుంది అరుణ.

ఎందుకో అనలేదు. ఆ మాట అని

## నరసరాజు చతురోక్తులు



ప్రముఖ సినీ, నాటక రచయిత, కాలమిస్ట్‌గా డి.వి. నరసరాజు సుప రిచితులు. కళారంగం తో ఆయనకు గల అనుబంధం ఇంతా అంతాకాదు.. ఆయన అడపాదడపా పలు సందర్భాలలో ఉటంకించిన సరదా విష యాలు మీకోసం..

### ఆవిడెవరు?

ఓసారి అమెరికాలో సుధాకరరావు అనేవ్యక్తి ఇంట్లో బసచేశారు నరసరాజుగారు. అప్పటికి వారి కుటుంబంతో పెద్దగా పరిచయం లేదు. ఉదయాన్నే బాత్‌రూమ్‌వద్ద ఓ తెల్లదొరసాని కన్పించింది. ఆమె సుధాకరరావు భార్య అను కుని నమస్కరించారు నరసరాజు. ఆమె చిరు నవ్వుతో తలూపింది. తర్వాత డైనింగ్ టేబుల్ వద్ద తనభార్యంటూ ఓ తెలుగావిడ్ని పరి చయం చేశారు సుధాకరరావు. ఆయన ఆశ్చర్య పోతూ తెల్లదొరసాని గురించి ఆరాతీస్తే ఆమె బాత్‌రూమ్ క్లీనర్ అని తెలిసింది.



ఉంటే జరిగిన దారుణం గురించో, హాసిని గురించో చర్చ జరగదు. ఒక్కసారిగా వాతావరణం మారిపోతుంది. సమస్య కంటే సిద్ధాంతం ముందుకొస్తుంది. ఎప్పటి కప్పుడు అనుభవాలు వస్తున్నా ఆ సమయానికి అలా మాట్లాడేయాలనిపిస్తుంది.

ఎందుకిలాంటి అసహనం పెరుగుతోంది? ఎవరు దీనికి కారణం?

అరుణకు అందరి మాటలు వినిపిస్తున్నా.. మనసు లోపలి ఘోష.

చివరికి వారందరూ ఈ పోరాటాన్ని సమన్వయం చేసే బాధ్యతను పద్మమీద పెట్టారు.

★ ★ ★

నేను హాసిని ఇంటికి వెళ్లాను. అప్పటికే పత్రికల వారూ, టీవీలవారూ, పోలీసులు వారిని ప్రశ్నల్తో ముంచెత్తి వెళ్లారు. ఎదిగి వస్తున్న కూతురు ఇలా బలికావటాన్ని ఆ కుటుంబం తట్టుకోలేకపోతోంది. హాసిని ఇప్పుడు ఓ జ్ఞాపకపు శకలం.

'నేను హాసిని స్నేహితురాల్ని' అని చెప్పాను.

'కూర్చోమ్మా' అంది హాసిని తల్లి.

ఓ పక్కన హాసిని చెల్లి ఉంది. ఆ అమ్మాయి కళ్లలో ఇంకా భయం. భయమే. తమ్ముడి కళ్లలో బాధ. చేతకానితనంతో పాటు కసి చోటు చేసుకున్నట్లు నాకనిపించింది.

'ఇలా జరగటం చాలా అన్యాయం. మేమందరం చాలా బాధపడుతున్నాం' అన్నాను.

అప్పటికే ఏడ్చి ఏడ్చి కన్నీళ్లన్నీ కరిగిపోయి ఉంటాయేమో. ఆమె మాట్లాడకుండా తన చిన్నకూతుర్ని చూసింది. తర్వాత నాకేసి తిరిగి 'మనం అనుకుంటాం గానీ ఇదంతా ముందే జరగాలని రాసి ఉంటుంది. దాని బతుకు అలా అవ్వాలనుంది. అయిపోయింది. కన్న కడుపు కాబట్టి నాలుగు రోజులపాటు ఏడ్చుకుంటాం. మెల్లగా అన్నీ మరచిపోతాం' అంది హాసిని తల్లి.

'అంటే మీకు ఆ అమ్మాయిని చంపినవాడిమీద కోపం లేదా?' అన్నాను.

'లేదమ్మా...' అంది.

నేను ఆశ్చర్యంగా చూశాను. ఆమెనే కాదు, హాసిని చెల్లెల్నీ, తమ్ముడ్నీ కూడా. ఇద్దరూ తల దించుకున్నారు.

**'ఇంతకు ముందు ఎవరితోనూ నేను అనలేదమ్మా నా కూతుర్ని చంపిన వాడి మీద నాకు జాలిగా ఉంది.**

'ఇంతకుముందు ఈ మాట ఎవరితోనూ నేను అనలేదమ్మా. నీకు చెబుతున్నాను. నా కూతుర్ని చంపిన వాడిమీద నాకు చాలా జాలిగా ఉంది. వాడి ఆరోగ్యం సరిగ్గా ఉందో లేదో. ఓ ఆడపిల్ల ప్రేమించలేదని చంపాడంటే వాడెంత పిరికివాడు. అసలు వాడికి ప్రేమంటే ఏమీ తెలియదు. నువ్వెప్పుడూ గుర్తుపెట్టుకోమ్మా- పిరికివాళ్లు మాత్రమే ఎదుటి వారి ప్రాణాలు తీస్తారు. ప్రేమించాలన్నా, ఏదన్నా సాధించాలన్నా ముందు ఓపిక కావాలి' అంది.

ఈ మాటలు నాకు మాత్రమే చెప్పిందా! ఇంతకు ముందు ఎవరితోనూ చెప్పలేదా? అంటే పత్రికలవారితోనా? వాళ్లు ఈ మాటలు వింటే వాటినెంత నొక్కి చెబుతారో తెలిసిందే. హాసిని తల్లి ఆ మాట అందంటే అందుకు బలమైన కారణం ఉండే ఉంటుంది.

నేను కొంచెంసేపు కూర్చున్నాక 'వెళ్ళి వస్తాను' అని చెప్పాను.

'జాగ్రత్తగా వెళ్లమ్మా' అంది.

'మా అమ్మ పద్మ. మహిళా సంఘంలో

పనిచేస్తుంది. ఇప్పుడు శంకర్‌కి శిక్ష పడాలని మా అమ్మావాళ్లు ఉద్యమం చేస్తున్నారు. మీకు ఎలాంటి సాయం కావాలన్నా మా ఇంటికి రండి. మా నాన్న లాయర్. చాలా కేసుల్ని డబ్బులు తీసుకోకుండానే వాదిస్తారు.'

ఆమె తలూపింది.

నేను వద్దన్నా వినకుండా వాళ్లబ్బాయిని బజారుదాకా తోడు వెళ్లమని పంపించింది.

మేమిద్దరం నడుస్తున్నాం. తను మౌనంగా ఉన్నాడు.

'నీ పేరు ఏంటి?' అన్నాను.

'సుధీర్'

'ఏం చదువుతున్నావు?'

'టెన్త్ క్లాస్' అన్నాడు.

'నువ్వు కూడా మీ అక్కను చంపటం కర్మనుకుంటున్నావా?'

'లేదండి' అన్నాడు కోపంగా. నేను ఆగిపోయాను.

'అక్కను చంపటం కర్మ కాదు. అది కర్మ అయినా సరే, ఆ చంపినవాడి మీద మా అమ్మ 'జాలిపడుతున్నాను' అనటం నాకు నచ్చలేదు. అలాంటి దుర్మార్గుడి మీద జాలేంటి? వాడికి దయా దాక్షిణ్యం ఉందా. రోడ్డు పక్కన చెట్టుమీద గొడ్డలి వేటు వేయాలన్నా ఆలోచిస్తాం... అనవసరంగా ఈ చెట్టుని నరికేస్తున్నామని. కానీ వాడు నరికింది ఓ ఆడపిల్లని...' కోపంతో మాట్లాడలేకపోయాడు.

ఆ తర్వాత అతన్ని దుఃఖం కమ్మేసింది.

'ఎవర్నండి చంపుతారు- మనకి అన్యాయం చేస్తే, మన ఆస్తుల్ని దోచుకుంటే, మనల్ని అవమానపరిస్తేనో చంపుతారు. మా అక్క అతనికి ఏం అన్యాయం చేసింది? తన చదువు తను చదువుకుంటుంది. ఇంటి దగ్గర తల దించుకుంటే క్లాస్ రూములో తల ఎత్తుతుంది. అలాంటి అక్కను చంపటానికి చేతులెలా వచ్చాయి? 'వాళ్లకు నాన్న లేడు. డబ్బులు లేవు. వీళ్లు నన్నేం చేయలేరు' అనుకున్నాడు. అందుకే చివరికి కసాయివాళ్లు కూడా చేయని విధంగా...'

'సారీ... ఐయామ్ వెరీ సారీ... మిమ్మల్ని చాలా బాధ పెట్టాను. ఇంక ఈ విషయం మరిచిపోదాం.'

అతను కళ్ళు తుడుచుకున్నాడు.

'మీ పేరేమిటో నాకు తెలియదు. ఇది మరచిపోయే విషయం కాదు. ఎవరు గుర్తుంచుకున్నా, గుర్తుంచుకోకపోయినా నేను గుర్తుంచుకుంటాను. వాడికి కూడా బాధ అంటే తెలియాలి. తెలుస్తుంది. తప్పకుండా తెలుస్తుంది' అన్నాడు.

★ ★ ★

నగరమంతా మళ్లీ ఉలిక్కిపడింది.

బెంగుళూరులో శంకర్ దొరికాడు. అది కూడా ఎవరితోనో తగాదాపడితే. వాళ్లు అతన్నికొట్టి పోలీస్‌స్టేషన్‌లో అప్పచెప్పారు. ఇదివరకు శంకర్‌కి మీసాలుండేవి. అవి తీసేశాడు. అలాగే భుజాల మీదదాకా జుట్టు వేలాడేది. గుండు చేయించాడు. బట్టలు మార్చాడు. అతను తెలుగులో మాట్లాడటం- టీవీలో వార్తలను వారు చూడడంతో పోలీసులకు అనుమానం వచ్చింది.

శంకర్ వేలికి తగిలిన గాయం కూడా అతన్ని పట్టించింది. బెంగుళూరు నుంచి అతన్ని తీసుకురావడానికి స్పెషల్ పోలీస్ పార్టీ వెళ్లింది. శంకర్‌ని కోర్టు ముందు హాజరుపరిచే రోజు...

అతన్ని చూడాలనే కుతూహలంతో కొంతమంది వచ్చారు. స్టూడెంట్స్ గుంపులు గుంపులుగా చేరిపోయారు. ఓ పక్కన మహిళలున్నారు. అందరూ నినాదాలు చేస్తున్నారు. చాలామంది విద్యార్థులు ఆగ్రహంతో ఉన్నారు. ఎవరో ఫోన్ చేసి కోర్టు ప్రాంగణంలో 'శంకర్‌ను చంపే







యబోతున్నారు' అని హెచ్చరించారు.

పదులకొద్దీ పోలీసుల్ని మోహరించారు. ఏ క్షణంలో ఏం జరుగుతుందోనన్న ఉత్కంఠ. 'శంకర్‌ను ఉరి తీయాలి' అని యువజన సంఘాల ఘోష. పోలీసులు స్వల్పంగా లాఠీఛార్జి చేశారు.

అక్కడ కనిపించనిది హాసిని కుటుంబ సభ్యులే.

వ్యాన్ ఆగింది.

మళ్లీ ఉద్రిక్తత. దిక్కులు పిక్కటిల్లేలా నినాదాల హోరు. బలవంతాన గుంపుని కంట్రోల్ చేస్తున్నారు.

అప్పుడు దిగాడు శంకర్.

కెమెరాలన్నీ అతనికేసి తిరిగాయి.

కొంతమంది తమని తాము నిగ్రహించుకోలేక బూతులు తిడుతున్నారు.

ఆడపిల్లలు అతని ముఖం మీద పడినట్లు భావించి ఉమ్మేస్తున్నారు.

అతన్ని లోపలకు తీసుకెళ్లేంతవరకూ అత్యంత ఉద్రేకపూరిత వాతావరణం.

లోపల విచారణ జరుగుతున్నంతసేపూ అదే పరిస్థితి.

శంకర్‌కి నెలరోజులపాటు జుడీషియల్ కస్టడీ విధించారు.

శంకర్‌ని మళ్లీ బయటకు తీసుకొచ్చేటప్పుడు అదే ఉద్రిక్తత.

ఈ స్వల్ప సమయంలోనే శంకర్‌తో మాట్లాడటానికి ప్రయత్నం చేశారు జర్నలిస్టులు.

'నువ్వు హత్య చేసినందుకు పశ్చాత్తాప పడుతున్నావా?'

'లేదు... నన్ను కాదంది, అందుకే చంపేయాలనుకున్నాను. చంపేశాను.'

'ఈ నేరానికి ఉరిశిక్ష పడుతుందని తెలియదా?'

'ఉరిశిక్ష పడితే పడనీ' అన్నాడు.

★ ★ ★

మేం కాలేజీకి వెళ్తున్నామే గాని ఇంకా 'హాసిని' హత్య వెంటాడుతూనే ఉంది. ముఖ్యంగా హాసినిని నరికేసిన ప్రాంతం చూసినప్పుడల్లా ఆ క్లాస్ వారికి హాసిని హృదయ విదారకంగా అరిచిన అరుపులు గుర్తుకొస్తున్నాయి.

ఆరోజు గదిలోకి వచ్చిన శంకర్ బాగా తాగి ఉన్నాడు. అతను సరాసరి హాసిని దగ్గరకు వచ్చి అప్పటిదాకా కడుపులో దాచుకున్న మద్దుకత్తి తీశాడు. హాసిని ముఖంలో చావు కళ వచ్చింది.

అతను ఏదో బూతు మాట అని మెడ మీద ఒక్క వేటు వేశాడు.

అతను అలా నరుకుతున్నప్పుడు ఆ కళ్లలో ఎంత కసో...

తమ కుటుంబాల్ని నాశనం చేసిన వారి మీద కూడా అంత కసి ఉండదేమో అంటున్నారు.

ఆ కసి ఆడవాళ్ల మీదా? మానవత్వం మీదా?

ఒక మనిషిని అంత కసికి గురిచేయాల్సిన దారుణం ఏమీ లేనిచోట శంకర్ ప్రవర్తన ఎవరికీ అర్థం కాలేదు.

అతడో సైకో!

అవును సైకోనే. అందుకే పోలీసుల దగ్గరగాని, కోర్టులోగాని అతనే మాత్రం బెదిరిపోయినట్లు కనిపించలేదు. ఆ కళ్లలో ఇంకా కసి.

అతని చేతికి ఆయుధం ఇచ్చి వదిలితే నినాదాలు చేసేవారిని, పత్రికలవారిని-మహిళల్ని ఒక్కమాటలో ఈ ప్రపంచాన్ని ముక్కలుగా నరికి పోగులు పెట్టేవాడిలా కనిపించాడు.

అతన్ని అలాంటి స్థితిలో చూసినవారికి, అతను మాట్లాడే తీరును గమనించినవారికి- అత్యంత సౌమ్యులకు కూడా ఆ క్షణం ఒకటే అనిపించింది.

'వీడు మనిషి స్థితిని దాటిపోయాడు. ఈ మృగాన్ని బతకనీయకూడదు. వీడు బతికితే ఈ సమాజం ఆటవిక దశకు చేరుకున్నట్లే' అని.

ఓ నాలుగైదు రోజులు పత్రికల నిండా శంకర్ గురించే రాశారు. అతను ఎక్కడి వాడు, అతని కుటుంబం ఏమిటి?

# విమానంలో సీటు




జొహాన్స్‌బర్గ్, లండన్‌ల మధ్య ప్రయాణం చేస్తున్న ఓ బ్రిటిష్ ఎయిర్‌వేస్ విమానంలోకి 50 ఏళ్ల వయస్సున్న ఓ తెల్ల మహిళ ప్రవేశించింది. తన పక్కసీటులో ఒక నీగ్రోవ్యక్తి కూర్చుని ఉండడం చూసి ఎయిర్‌హోస్టెస్‌ను పిలిచింది.

'మేడమ్ మీకేం కావాలి? ' హోస్టెస్ అడిగింది.

'నా పక్కన ఈ నీగ్రోను కూర్చోపెట్టారేంటి? ఇటువంటి అలగా జనం పక్కన కూర్చోను. నాకు మరో సీటు ఇవ్వండి' కోపంగా అరిచిందామె.



'దయచేసి ప్రశాంతంగా కూర్చోండి. నేనువెళ్లి ఎక్కడైనా ఖాళీ సీట్లున్నాయేమో చూసొస్తాను' అంటూ వెళ్లిన హోస్టెస్ కొద్దిసేపటి తర్వాత వచ్చి 'మేడమ్ ఎకానమీ క్లాసులోగానీ, బిజినెస్ క్లాసులోగానీ సీట్లు ఖాళీలేవు. ఫస్ట్‌క్లాస్‌లో మాత్రమే ఒక సీటుంది' అంది.

తెల్లమహిళ ఏదో చెప్పబోతున్నా విన్పించుకోకుండా-

'..మేడమ్ మా కంపెనీ రూల్స్ ప్రకారం ఎకానమీ క్లాస్ ప్రయాణికులు ఫస్ట్‌క్లాస్‌లో కూర్చోడానికి వీల్లేదు. అంచేత మా కెప్టెన్ సలహా ప్రకారం చేస్తాను. మీరేమీ అనుకోవద్దు..' అంటూ చెప్పింది. తర్వాత నీగ్రోవైపు తిరిగి, 'అయ్యా.. మీరు దయచేసి బ్యాగ్ తీసుకుని వెళ్లి ఫస్ట్‌క్లాస్‌లో కూర్చోండి' అంది.

జరిగినదంతా చూస్తున్న ఇతర ప్రయాణికులు సీట్లనుంచి లేచి నిలబడి, సంతోషంతో చప్పట్లు కొట్టారు.

తెల్లబోవడం తెల్లమహిళ వంతయింది.

---

వాళ్లు శంకర్ గురించి ఏమనుకుంటున్నారు. వంటి విషయాలు.

శంకర్ బంధువులెవరూ రాలేదు. 'వాడు మా చెయ్యి దాటిపోయాడు' అని శంకర్ అమ్మ చెప్పింది. తండ్రి మాత్రం పత్రికలవారితో మాట్లాడటానికే నిరాకరించాడు.

'మీ అబ్బాయి చేసిన పనిని మీరు సమర్థిస్తున్నారా? ' అని అడిగారు.

'వాడు ఎందుకు ఆ పని చేశాడో తెలియదు. మొదట్నుంచి వాడికి కోపం ఎక్కువ. ఎవర్నీ లెక్కచేయడు. తనని ఏదన్నా అంటే మరచిపోడు. మనసులో పెట్టుకుంటాడు. ఆ అమ్మాయి ఏమందో తెలియదు' అంది వాళ్లమ్మ.

'ఒక వేళ ఏమన్నా అంటే చంపేయడమేనా? '

ఆ మాటకి శంకర్ తల్లి మాట్లాడలేకపోయింది.

'మీ అబ్బాయికి ఉరిశిక్ష పడితే...'

'ఎందుకు నాయనా ఉరిశిక్ష. ఈ పని చేసింది మా అబ్బాయి ఒక్కడేనా... ఎంత మంది లేరు. అందరికీ ఉరిశిక్షలు వేస్తున్నారా... వాడు దుర్మార్గుడు కావచ్చు కానీ మా కొడుకు. కొడుకుని ఉరి తీస్తుంటే నేను చూడలేను. అయినా మాది వెనుకబడిన కులం. అదే పెద్ద కులాలవారి పిల్లలు ఈ పని చేసుంటే ఇంత దాకా వచ్చేదా' అంది.

నాలుగయిదు రోజులు శంకర్‌కి వ్యతిరేకంగా రాసిన ఓ పత్రిక ఆ వేడి చల్లారాక ఓ వార్త రాసింది.

శంకర్‌ని హాసిని బి.సి.కులం వాడని తక్కువ చూపు చూసేదంటున్నారు. అతన్ని కులం పేరుతో అవమానించేదని, ఇది భరించలేక శంకర్ హత్యకు తెగించా

డంటున్నారు.

ఎవరు అనేది... ఈ వార్తలు రాసిన వాళ్లా!

నాదే కులమో నాకు తెలియదు. మా అమ్మ కులం వేరు. మా నాన్న కులం వేరు. మా ఇంట్లో దేవుడ్ని కొలవరు. 'మతం' అనేచోట 'బ్లాంక్'గా వదిలేస్తుంటాను.

హాసినిది ఏ కులమో నాకు తెలియదు.

నాకు తెలిసిందల్లా తను ఆడపిల్ల! ఒక ఆడపిల్లను అనాగరికంగా చంపటాన్ని ప్రశ్నించే సమయంలో ఇలాంటి వార్తలా!

శంకర్ కులం అమ్మాయినే శంకర్ నరికేసి ఉంటే ఈ మాట అనేవారా?

నిజంగా హాసిని శంకర్‌ని కులం పేరుతో అవమానించి వుంటే కేసు పెట్టవచ్చు. బలమైన చట్టాలున్నాయి- అలాంటివారిని శిక్షించడానికి.

జర్నలిస్టులకూ- లాయర్లకూ కాస్త తేడా ఉండాలిగా.

మొదట్లో 'శంకర్' కేసుని ఎవరూ తీసుకోకూడదనుకున్నారు. ఓ నరహంతకుడి తరఫున ఏ న్యాయవాది కూడా వాదించకూడదనుకున్నారు. ఇంతలోనే ఏమైందో తెలియదు. శంకర్ తరఫున వాదించడానికి ఓ లాయర్ ముందుకొచ్చాడు.

★ ★ ★

మా అందరి మధ్య 'కులం' గురించిన చర్చ కూడా నడిచింది. మాలో అన్ని కులాలకు చెందినవారున్నారు. అలాగే కులాంతర వివాహాలు చేసుకున్నవారి పిల్లలున్నారు.

చాలా సీరియస్‌గా చర్చ నడిచిందిఇంటర్ చదివే పిల్లల్లో ఇన్ని ఉద్వేగాలున్నాయా అనిపిస్తుంది బయటివారికి. నిజానికి తమ పిల్లల్తో తల్లిదండ్రులు మాట్లాడిందెక్కడ?

ఈ దేశంలో కులం ఇంకా సజీవంగా ఉంది. సుదీర్ఘకాలంగా వస్తున్న కులవివక్ష వుంది. అంతరాలున్నాయి. వివిధ సందర్భాల్లో కులాల మీద జరిపిన దాడులున్నాయి. ఇప్పటికీ ఆ కేసులు పరిష్కారం కాలేదు. అగ్రవర్ణాల వారి అవినీతి ఉంది. అదే సమయంలో వెనుకబడిన కులాల్లోనూ అది ఉంది. నేరాల విషయంలోనూ అన్ని కులాలున్నాయి.

ఇక్కడే సమాజంలోని ద్వంద్వ ప్రవృత్తి మీద చాలా సీరియస్ చర్చ నడిచింది.

పత్రికలూ- ప్రసార సాధనాలు అగ్రవర్ణాల చేతుల్లో ఉన్నాయి. కాబట్టి అగ్రకులాలవారి అవినీతిని బాగా ఫోకస్ చేయరు.

అదే అణగారిన కులాలవారు చిన్న మొత్తం తీసుకున్నా దాన్ని గోరింతలు, కొండంతలు చేస్తారనేది కొందరి వాదన.

అయితే 'కులం' అన్నది కొన్ని విషయాలకు పరిమితం కావాలి. రిజర్వేషన్లు వుండాలి. చదువుల్లో, ఉద్యోగాల్లో, ఎన్నికల్లో, వాటి శాతం మీదో, రిజర్వేషన్ల మీదో కొంతమందికి అభ్యంతరాలుండొచ్చు కానీ అవినీతి, నేరాల విషయంలో కులాలకు రాయితీలు వుండకూడదు అని మేం అనుకున్నాం.

మేమందరం ఒకే మాటమీద వున్నామని కాదు. కానీ రోజులు గడుస్తున్నకొద్దీ పత్రికల్లో వస్తున్న రకరకాల చర్చలవల్ల 'హాసిని' విషయం మరుగున పడిపోయింది.

కులం-వర్గం-జెండర్‌లాంటివి నేరస్థులకు ఎంత రక్షణగా నిలుస్తాయో అర్థమవుతున్నకొద్దీ నేను నిరాశపడ్డాను.

కులాల మధ్య జరుగుతున్న చర్చలో మేం ఒంటరిగా మిగిలాం. మాలో ఏ కులం రక్తం ఎంత వుంది. రేపు మాకు పుట్టబోయే పిల్లల రక్తాల్లో కులం శాతం ఎంత?

ఓ అయిదుగురి బాధ ఇది.

మొత్తంగా చూసుకున్నప్పుడు మాత్రం డబ్బుదే ఎక్కువ పాత్ర అని మాకనిపించింది. ఒకే కులంలో డబ్బున్నవారు ఏమైనా చేయగలుగుతున్నారు. పేదవాడిని ఏ రాజకీయ ప్రయోజనం లేనిదే ఎవరూ పట్టించుకోరు.

దళితుల్లోనూ అంతే. దళిత ధనవంతులు వేరు. దళిత పేదలు వేరు. వివక్ష అన్ని కులాల్లోనూ వుంది. అన్ని కుటుంబాల్లో వుంది. మగవారిలోనూ- ఆడవారిలో కూడా అణచివేసే స్వభావం వుంది. ఎవరూ దీనికి అతీతులు కాదు. క్రమంగా మేం కూడా హాసినిని మరచిపోయాం. కాలేజీలో మళ్లీ అందరూ సరదాగా తిరుగుతున్నారు. కొత్త సినిమాలు వస్తున్నాయి. పరీక్షలు వస్తున్నాయి. మేం చదువులో పడ్డాం. ఎప్పుడో ఓసారి హాసిని గుర్తొస్తుంది.

వాళ్ల అమ్మ- చెల్లీ తమ్ముడు ఏమయ్యారో తెలియదు. నేను కూడా మళ్లీ వారిని కలవలేదు.




అయిదారు రోజుల సెలవులు. మళ్లీ అమ్మమ్మ దగ్గరకు వెళ్లాలి. అమ్మతో ఆ విషయం చెప్పాను.

'ఏమిటి నీకు అమ్మమ్మంటే అంత ఇష్టమా!' అంది.

'మన ఇంటికి మన బంధువులు ఎవరూ రారు కదమ్మా'

'అంటే మన ఇంటికి వచ్చేవారందరూ మనకి ఏమీ కారా? ' అంది అమ్మ.

'వాళ్లు స్నేహితులు, మన చుట్టాలు కారుగా'

'అనుకోవచ్చుగా' అంది.

'నేను అందరినీ మనవాళ్లే అనుకుంటాను. అమ్మమ్మని కూడా అలాగే అనుకుంటాను. అమ్మమ్మ చాలా సంవత్సరాలు నిన్ను పెంచింది. ఇప్పుడు తను దూరంగా వున్నా నేను ఎందుకుండాలి' అన్నాను.

అమ్మ మాట్లాడలేదు.

'ఇక్కడవుంటే నాకు జీవితంలో ఒక కోణమే తెలుస్తోందమ్మా. ఎప్పుడూ ఒకే తరహా మనుషులొస్తున్నారు. ఇదివరకు మీరు మాట్లాడుకుంటుంటే నాకు కొత్తగా వుండేది. కొత్త విషయాలు తెలిసేవి. ఇప్పుడలా అనిపించటం లేదు. అమ్మమ్మ దగ్గరకు వెళ్లి ఓ నాలుగు రోజులుంటే కొత్త శక్తి వస్తుంది' అన్నాను

అమ్మ ఇంకేం అనలేదు. నాన్నతో ఈ విషయం చెప్పినప్పుడు,

'నాలుగు రోజులు నువ్వు లేకుండా ఎలా? ' అన్నారు.

'అదేంటి నాన్నా.. ఇప్పుడు మాత్రం మనం ఓ ఇంట్లో వుంటున్నాం తప్ప ఎవరి గదులు వారివి. కనీసం ఓ పదినిముషాలైనా మనం మాట్లాడుకోగలుగుతున్నామా!' అన్నాను.

'నీ ఇష్టం చైతూ... త్వరగా వచ్చేయ్' అన్నారు నాన్న చిన్నగా నవ్వి.

నేను వెళ్లేముందు 'అమ్మా ఓ పాట పాడవా... రికార్డ్ చేసుకుంటాను' అన్నాను.

'ఎందుకు? ' అంది.

'ప్రయాణం చేసేటప్పుడు నీ పాట వింటాను. నువ్వు కూడా నాతో వున్నట్లుంటుంది' అన్నాను.

★ ★ ★

# అమెరికన్స్... కొన్ని నిజాలు!




మీకు అమెరికన్స్ గురించి ఎంత తెలుసు?

ఇటీవల 'ఫేక్ట్అమెరికా' అనే ఓ సంస్థ అమెరికన్స్ జీవన విధానం మీద అమెరికాలోని పదహారు నగరాల్లో సర్వే నిర్వహించి, ఇరవైనాలుగు వందలమంది జీవనవిధానాన్ని పరిశీలించాక ఈ కింది విషయాలని వెల్లడి చేసింది.

☆ 21 శాతం మంది నిత్యం పక్క బట్టలు దులిపివేయరు. 5 శాతం మంది అసలెన్నడూ



పక్కని దులపరు.

☆ 40 శాతం మంది ఆడవాళ్లు తమ కాలి చెప్పుని కోపంతో మగవాళ్ళ మీదకి ఓ సారైనా విసిరేసినవారే.

☆ 15 శాతం మంది మగాళ్ళు అండర్ వేర్‌ని ఉపయోగించరు.

☆ సగటు బ్రా సైజు ఇప్పుడు అమెరికాలో 36 సి పదేళ్ళ క్రితం అది 34 బి

☆ 85శాతం మంది ఆడవాళ్ళు కావల్సిన దానికన్నా పెద్ద బ్రాని (పేడెడ్) వాడతారు.

☆ ప్రతీ నలుగురిలో ముగ్గురు తమపర్సుల్లో కింద పెద్దనోట్లు పైన చిన్ననోట్లు (డాలర్స్ నోట్లని) పెట్టుకుంటారు.

☆ 13 శాతంమంది తమ పిల్లల హోంవర్కని తామే చేసి పెడతారు.

☆ 91 శాతం మంది రోజుకోసారైనా అబద్ధం ఆడి తీరతారు.

☆ 27 శాతం మంది రోడ్డు నియమాలని కార్ డ్రైవ్ చేసేటప్పుడు పాటించరు.

☆ 29 శాతం మంది షాపుల్లో చిన్న వస్తువులైనా దొంగతనం చేసినవారే.

☆ థియేటర్లలో తినుబండారాల ఖరీదు బయటి కన్నా ఎక్కువైనందున బయట నుంచి తీసుకురాకూడదన్న నియమాన్ని పక్కనపెట్టి 57 శాతం మంది దొంగతనంగా తెచ్చుకుని తింటారు.

☆ 90 శాతం మంది, ఇతరులకి కీడు చేస్తే దేవుడు తనకి తగిన శాస్తి చేస్తాడన్న విషయాన్ని నమ్ముతారు.

☆ 45 శాతం మంది దయ్యాలని నమ్ముతారు.

☆ 13 శాతం మంది (ఎక్కువగా మగవాళ్ళు) ఓ రాత్రి జైల్లో గడిపిన వారే.

☆ 29 శాతం మంది అమ్మాయిలు వివాహం అయ్యేనాటికింకా కన్యలే.

☆ 35 శాతం మంది నెలలకోసారైనా బీదలకి సహాయం చేసే సంస్థకి చందా ఇస్తారు.

☆ 58.4 శాతం మంది సెలవు కోసం ఆరోజు జబ్బు పడ్డట్లుగా ఆఫీస్‌లో అబద్ధం చెప్తారు.

☆ 50 శాతం మంది పిల్లల్ని కొడతారు. అయితే 2 ఏళ్ళు పైబడ్డ పిల్లల్నే.

☆ 98 శాతం మంది ఆడవాళ్ళు కాస్మోటిక్స్ వాడతారు.



'మీ నాన్న ఏం చేస్తుంటాడు?' అంది అమ్మమ్మ.

'అడ్వొకేట్, క్రిమినల్ లాయర్' అన్నాను.

'ఆ ఒక్కపనేనా. ఇంకేమన్నా చేస్తాడా?'

'మా నాన్న పౌరహక్కుల సంఘంలో పనిచేస్తారు'

'అదేం సంఘం' అంది.

పౌరుల హక్కులకు భంగం కలిగినప్పుడు వారి తరపున పోరాడే సంఘం.

'ఇంతకీ పౌరులంటే ఎవరు?'

'అయ్యబాబోయ్. నేను నాలుగు రోజులు సరదాగా నీతో వుండాలని వచ్చాను. మళ్లీ ఇంటి దగ్గర గోలే అయితే ఎట్లా? పౌరులంటే నువ్వూ-నేనూ-అందరం.'

'అంటే పోలీసులు కూడానా?'

'అమ్మమ్మా నీకు తెలియక అడుగుతున్నావా- తెలిసి అడుగుతున్నావా?' అన్నాను.

'ఈ మధ్య ఎవరో వచ్చారు చైతన్యా, మీ అల్లుడు పోలీసులతో తగాదాలు పడుతుంటాడు అన్నారు. అందుకని అడిగాను'

'అదా... ఎన్‌కౌంటర్లని జరుగుతుంటాయి అమ్మమ్మా... నక్సలైట్లని పట్టుకెళ్లి కాల్చేస్తుంటారు. అది పౌరుల హక్కుల్ని భంగం చేయటం. ఏ మనిషినీ పోలీసులు కాల్చకూడదు. చట్టం ముందు నిలబెట్టాలి. కోర్టులో విచారించి శిక్ష వేశాక అమలు చేయాలి'

'అలాగా' అంది ఆలోచిస్తూ.

'నీకో పాట వినిపించనా'

'ఎవరి పాట. మీ అమ్మ పాటా?'

'భలే కనిపెట్టేశావే'

'ఇంతకుముందు వచ్చినప్పుడు అన్నాను కదా. నువ్వు పాడించావేమో అనుకున్నా. నా కోసమే పాడిందా?'

నాకు అబద్ధం చెప్పటం ఇష్టం లేదు.

'అమ్మమ్మా నువ్వు పాట అడిగిన విషయం అమ్మకి చెప్పలేదు. నేను వింటానని పాడించుకున్నాను' అన్నాను.

'నా కోసమయితే మీ అమ్మ పాడేది కాదా?'

'ఎందుకు పాడదు. అమ్మంటే నీకు కోపం కదా. అందుకే నువ్వంటే అమ్మకు భయం'

'నువ్వేదో ప్లాన్‌లో వున్నావు. ఇలా నాలుగుసార్లు వచ్చి నన్ను మీ ఇంటికి తీసుకువెళ్లాలనుకుంటున్నావు. ముందే చెబుతున్నాను. నేను నీ దగ్గరికి రాను'

'నా దగ్గరికి రావా?'

'అదే మీ ఇంటికి రాను' అంది.

మా ఇంట్లో 'నాది' అనేదేముంది అమ్మమ్మా. నాకు ఓ గది యిచ్చారు. అక్కడే పడుకుంటాను, చదువుకుంటాను. రేపు ఉద్యోగం ఇంకేదన్నా వూర్లో వస్తే అక్కడికి వెళ్లిపోతాను'

'నువ్వు ఉద్యోగం చేస్తావా? మీ అమ్మకిమల్లే నువ్వు కూడా ఏ సంఘంలోనో చేరి పని చేస్తావనుకున్నాను' అంది.

'మా అమ్మ చేసినపనే నేనెందుకు చెయ్యాలి. నువ్వు చేసినట్లు మా అమ్మ చేయలేదు. మా అమ్మ చేసినట్లు నేను చెయ్యను. కాబట్టి నువ్వు మీ అమ్మాయి ఇంటికి రాకపోయినా మీ మనవరాలి ఇంటికి రావచ్చు. అది నీ హక్కు.'

'మాటలు బాగానే నేర్చావు' అంది.

'నువ్వు మా ఇంటికి రావద్దుగాని ఈ పాట విను' అని టేప్‌రికార్డర్ ఆన్ చేశాను.

అమ్మమ్మ కళ్లు మూసుకుని వింది.

'ఎలా వుంది పాట?'

'చిన్నప్పుడు ఈ పాట చాలా బాగా పాడేది. ఇప్పుడు అంత బాగుండలేదు.'

'అమ్మ పాటలు పాడటం మానేసింది' అన్నాను.

★ ★ ★

'అమ్మమ్మా ఈ ఊర్లో ఏ గొడవలూ వుండవా? అందరూ ఒకరితో ఒకరు స్నేహంగా వుంటారా?' అన్నాను.

'గొడవలు లేనిచోటు ఎక్కడా వుండదమ్మా. ఊరంతా బాగున్నా ఎవరో ఒకరుంటారు. అందుకే అన్నారు కడివెడు పాలల్లో ఓ విషపుచుక్క చాలని. మా చిన్నతనంలో పొలాలగట్ల దగ్గర, నీళ్ల దగ్గర గొడవలుండేవి. తలలు పగలగొట్టుకునేవారు.'

'మనుషుల్ని చంపటం చేసేవారా?'

'నాకు తెలిసి మా ఊర్లో అంటే మా అమ్మా- నాన్నల ఊర్లో ఎప్పుడూ అలాంటివి నేను వినలేదు. భూముల తగాదాలు వుండేవి. ఎక్కువగా కోర్టుల చుట్టూ తిరుగుతుండేవారు.'

'ముందు మనుషుల్ని చంపుకోవటం గురించి చెప్పు' అన్నాను.

అమ్మమ్మ నా కళ్లలోకి చూసింది.

'ఏంటమ్మమ్మా అలా చూస్తున్నావు?'

'నువ్వు చిన్నపిల్లవి కదా. ఈ విషయాలన్నీ ఎందుకు అడుగుతున్నావు'

'తెలుసుకుందామని'

'మనుషుల్ని మనుషులు చంపుకోవటాల గురించి తెలుసుకుని ఏంచేస్తావు? అయినా చదువుకుంటున్నావు. నీకు చదువుకి చెందిన విషయాలు తప్పితే వేరే విషయాలు ఎందుకు? మీ అమ్మ ఏం చేస్తోంది. అమ్మని పట్టించుకోకపోతే పోయింది. కూతురు గురించి కూడా పట్టించుకోదా? అంత తీరిక లేకుండా దేశ సేవ చేస్తోందా?' అంది కఠినంగా.

అకస్మాత్తుగా అమ్మమ్మ ఇంత సీరియస్ అయిపోతుందనుకోలేదు. 'మా అమ్మను ఏమీ అనొద్దు. చిన్నప్పటినుంచి నువ్వు నన్ను చూడకపోయినా, మా అమ్మకు తీరిక లేకపోయినా నాకేం లోటు రానివ్వలేదు' అన్నాను.

'ఓహో... మీ అమ్మను అనేసరికి నీకు కోపం వచ్చిందా? నేను కూడా నా కూతుర్ని అంతకంటే గారాబంగానే పెంచాను. ఇంకా మీ అమ్మకి నువ్వు ఒక్కదానివే. నాకు ఇద్దరు పిల్లలు. మా ఇంటి వాళ్లుగాని, మీ తాత ఇంటివాళ్లుగాని నాకేం సహాయం చేయలేదు' అంది కోపంగా.

అమ్మమ్మని అలా చూస్తుంటే చాలా ముద్దుగా అనిపించింది.

కౌగలించుకుని ముద్దు పెట్టుకున్నాను.

'చాల్లే సంబడం... అసలు నిన్ను నేను రమ్మన్నానా. ఎందుకొచ్చావ్? మీ అమ్మే నిన్ను నామీదకు పంపించిందనుకుంటా'.

'నా అమ్మమ్మ దగ్గరికి నేను వస్తాను. అందుకు ఎవరి పర్మిషన్ నాకు అవసరం లేదు. మా అమ్మమ్మ అంటే నాకు ప్రాణం. ఇంతకుముందు నీ గురించి విన్నాను. ఇప్పుడే చూస్తున్నాను. నువ్వు మాత్రం ఇక్కడ వుండి దేశసేవ చేయటం ఎందుకు? నా దగ్గరకు వచ్చి మంచీ, చెడూ అన్నీ చెప్పవచ్చుగా' అన్నాను.

అమ్మమ్మ మాట్లాడలేదు.

'ఇంతకుముందే చెప్పాను. మీ అమ్మాయి ఇంటికి రాకపోతే నా ఇంటికి రమ్మని. మనం వేరేగది చూసుకుందాం. ఇద్దరం కలిసివుందాం' అన్నాను.

'వద్దులే. మీ అమ్మా - కూతుర్లని నేనెందుకు విడదీయాలి? నువ్వెటూ వస్తున్నావుగా.. అది చాలు' అని రాజీకొచ్చింది.

అప్పుడు నేను హాసిని గురించి చెప్పాను.

మా అమ్మమ్మకి ఎవరో ఈ విషయం చెప్పారంట. అయితే మా కాలేజీలోనే జరిగిన విషయం తెలియదు.

హాసిని విషయంలో అమ్మమ్మ చాలా బాధపడింది.

'నువ్వు ఇందుకు అడుగుతున్నావనుకోలేదమ్మా. ఇదేం అన్యాయం ప్రేమించలేదని

నరికేస్తారా? మా కాలంలో ఇలాంటివి వినలేదు. ఇప్పుడు ఏం చేయాలి, ఏం చేయకూడదనే ఆలోచనలేదు. లక్షలూ, కోట్లుగా జనం పుట్టుకొస్తున్నారు. రాను రాను బతకడానికి ఏ దారీ కనిపించడం లేదు. అందుకే ఏదైనా చేసి బతికేస్తున్నారు. మేం అదృష్టవంతులమో దురదృష్టవంతులమో తెలియదు. బతికిన బతుకేదో వుంది. ఇలాంటివన్నీ చూడకుండా వెళ్ళిపోతే అదే అదృష్టం' అంది.

'అందరూ అలా అనుకుంటే ఎలా అమ్మమ్మా?'



'అందరూ ఎందుకనుకుంటారు? మా కాలం మనుషుల్లో కొందరు అనుకుంటారు. అలాగని బలవంతాన చావలేం. అదికూడా మనిషిని చంపటం లాంటిదే. ప్రాణమున్నంత వరకూ బతకాల్సిందే' అంది.

నిజానికి మేం దురదృష్టవంతులం. మాకు అమ్మమ్మల, తాతయ్యల ప్రేమ దొరకటం లేదు. అనుభవాలు దొరకటం లేదు.

అమ్మమ్మ దగ్గర్నుండి వస్తున్నప్పుడు నాకు దుఃఖం వచ్చింది.

అమ్మ అడిగింది. 'మనింటికి వచ్చే వారందరూ మనవాళ్లు కాదా' అని. అమ్మమ్మ కూడా అలానే అనుకోవచ్చు. తన పిల్లల్ని లోకంలో చూసుకోవచ్చు. కానీ ఎంత చూసుకున్నా వాళ్లు స్వంతం కాదు.

"స్వంతం" అనే భావన ఎంత గొప్పది!

మొదటిసారి నాకు అలా అనిపించింది.

అమ్మమ్మ కూడా 'మళ్లీ ఎప్పుడొస్తావే' అని పసిబిడ్డలా అడిగింది. చాలా జాగ్రత్తలు చెప్పింది. మగ పిల్లల విషయంలో ఎలా వుండాలో చెప్పింది. 'ఎవరన్నా నిన్ను ప్రేమిస్తున్నాను అని వెంటబడుతుంటే ముందే ఇంట్లో మీ అమ్మా-నాన్నలకు చెప్పేయ్. అప్పుడే వాళ్లు ఆ అబ్బాయికి గట్టిగా చెబుతారు' అంది.

★ ★ ★

పద్మ, అరుణ, సంధ్య, లక్ష్మి అందరూ సమావేశం అయ్యారు. వారందరి కళ్లలో ఆనందం కనిపిస్తోంది. శంకర్‌కి ఉరిశిక్ష విధించారు!

హాసిని విషయంలో ఉద్యమాలు చేసిన వారందరికీ ఈ తీర్పు తృప్తి కలిగించింది. ఆ సందర్భంగా మళ్లీ అందరూ 'ఇప్పుడేం చేయాలి' అనే విషయం మీద చర్చించుకోవటానికి కలిశారు.

'ఇప్పుడు కూడా వాడిలో పశ్చాత్తాపం కనిపించలేదు. ముఖ్యంగా 'ఉరి' శిక్ష విధించారనే బాధగాని, తనని ఉరితీస్తారనే భయంగాని, వాడిలో కన్పించలేదు' అంది అరుణ.

'వాడి ధైర్యం ఏమిటో? '

'హైకోర్టుకు అప్పీల్ చేసుకోవచ్చునన్నారు. అక్కడ కొన్ని సంవత్సరాలు పట్టొచ్చు. ఆ తర్వాత సుప్రీం కోర్టుకి వెళ్లవచ్చు' అంది లక్ష్మి.

'ఇప్పుడు మనం ఆలోచించాల్సిందొకటే ఈ కేసు విషయంలో సాధ్యమైనంత తొందరగా జడ్జిమెంట్ రావాలి. ఉరి శిక్షను ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా అమలు చేయాలి' అంది పద్మ.

'నువ్వు చెప్పేది బాగానేవుంది. ఇవన్నీ మనం ఎవరికి చెప్పాలి? '

'ప్రభుత్వానికి'

'ప్రభుత్వం ఏం చేస్తుంది? చట్టం తన పని తాను చేసుకుపోతుందని మంత్రులు, ముఖ్యమంత్రులు ప్రకటించారు. ప్రభుత్వాలు కోర్టు తీర్పుల్ని ప్రభావితం చేయలేవు కదా!'

'కనీసం ప్రభుత్వం నుండి ఓ విజ్ఞాపన అందించవచ్చు'

'అవునూ, మన దేశంలో ఉరి శిక్షను చివరిసారి అమలు చేసిందెప్పుడు? ' అంది లక్ష్మి.

'క్లియర్‌గా తెలియదు ఎందుకడుగుతాన్నారు? ' అంది అరుణ

'నాకెందుకో శంకర్ నిర్దోషిగా బయటకు వస్తాడనిపిస్తోంది.'

'నిర్దోషిగానా..? ఉరిశిక్ష విధించాక కూడానా? '

'ఎంతమంది బయటకు రావటం లేదు. హైకోర్టు అది యావజ్జీవ శిక్షగా మార్చవచ్చు. అలా తీర్పురాదనే గ్యారంటీ వుందా? '

ఎవరూ మాట్లాడలేకపోయారు.

'ఇప్పటినుంచి ఈ కేసు ఇంకో మలుపు తిరుగుతుంది' అంది లక్ష్మి.




పద్మ ఇంటికి వచ్చేటప్పటికి గోపాల్ ఎవరితోనో మాట్లాడుతున్నాడు.

'పద్మా, ఇలా రా' అన్నాడు.

'చెప్పండి' అంది అతని దగ్గరకు వెళ్ళి.

'ఇప్పుడే సమాచారం అందింది. నల్లమల అడవుల్లో ఓ నాయకుడ్ని అదుపులోకి తీసుకున్నారంట. అయితే పోలీసులు మాత్రం తమకేమీ తెలియదంటున్నారు. బహుశా ఒకటి రెండు రోజుల్లో ఎన్‌కౌంటర్ జరగవచ్చు' అన్నాడు.

'ఎవరా నాయకుడు? ' అంది పద్మ.

'దళ కమాండర్ రమణ అలియాస్ సత్తెన్న.'

'ఇప్పుడేం చేయబోతున్నారు? '.

'ముందు ప్రెస్‌మీట్ ఏర్పాటు చేస్తున్నాం. హోం మినిస్టర్‌కి, సి.ఎమ్‌కి విజ్ఞాపన పత్రాలు ఇవ్వబోతున్నాం. అలాగే గవర్నర్‌ని కూడా కలుసుకుంటాం' అన్నాడు.

'అవును పద్మగారూ. ఏం జరిగినా ఇరవైనాలుగు గంటలలోపే జరగాలి. లేకపోతే రమణ ఎన్‌కౌంటర్ అయితీరతాడు' అన్నాడు జగన్. అతను కూడా పౌరహక్కుల సంఘంలో సభ్యుడు.

'ఈ రోజు శంకర్‌కి ఉరిశిక్ష వేశారు' అంది అప్రయత్నంగా పద్మ.

'చూశాను. ఈ విషయంలో కూడా మేం చర్చలు జరపాలనుకుంటున్నాం. నేను వచ్చేటప్పటికి ఎంత టైమవుతుందో తెలియదు. నువ్వూ- చైతూ భోంచేయండి' అని గోపాల్ వెళ్ళిపోయాడు.

పద్మ చైతన్య గదికి వెళ్ళింది.

అప్పుడు ఏదో రాసుకుంటోంది చైతన్య. అమ్మని చూడగానే రాయటం ఆపింది.

'నోట్స్ రాసుకుంటున్నావా? '

'కాదమ్మా డైరీ రాస్తున్నాను. శంకర్‌కి ఉరిశిక్ష వేశారు కదా!'

'మీ కాలేజ్‌లో పిల్లలు ఏమనుకుంటున్నారు చైతూ...'

'అందరూ హ్యాపీగా వున్నారమ్మా... హాసిని ఆత్మ శాంతిస్తుందనుకొంటున్నారు.'

'ఆత్మకి శాంతా!' అప్రయత్నంగా అంది పద్మ.

'అవునమ్మా... నీకు ఆత్మల మీద నమ్మకం లేకపోవచ్చు. మా స్టూడెంట్స్‌లో కూడా ఆత్మల మీద నమ్మకం లేనివారున్నారు. అందరూ అనుకున్నదొకటే- శంకర్ నేరానికి తగిన శిక్ష పడిందని'

'ఇంకా విశేషాలున్నాయా? '

'ఇంతకంటే విశేషాలేమీ లేవమ్మా' అంది చైతన్య.

'మీ నాన్న బయటకు వెళ్ళారు. నువ్వు చదువుకో. ఆకలయినప్పుడు రా. ఇద్దరం భోంచేద్దాం'

'నాన్న భోంచేయరా? ' అన్నాను.

'ఆయన భోజనానికి రాకపోవచ్చు' అని పద్మ వెళ్ళిపోయింది.



మరుసటిరోజు ఉదయం ఎవరో మాట్లాడుతున్నారు- గోపాల్‌తో. పద్మ అక్కడకి వెళ్ళింది. అంతకుముందు తను ఎప్పుడూ

# అమెరికాలో మనవాళ్ళిలా ఉంటారు

**అ**మెరికాకి ప్రపంచంలోని అన్ని దేశాల నించి మనుషులు వెళ్ళి, స్థిరపడి ఆ దేశపు పౌరసత్వం తీసుకుంటున్న నేపథ్యంలో ఓ సంస్థ ఏ దేశానికి చెందిన వారు అమెరికాలో ఎలా ప్రవర్తిస్తారన్న విషయం మీద చేసిందీ పరిశోధన.




బంగ్లాదేశ్, శ్రీలంక, పాకిస్థాన్, భారత దేశాల నుంచి అమెరికా వచ్చినవారు ఈ విధంగా ప్రవర్తిస్తారని ఆ సర్వేలో తేలింది. ఈ విషయం ఇంటర్నెట్ ద్వారా సర్క్యులేట్ అయ్యే అనేక ఇ-మేగ్‌లలో చోటు చేసుకున్నాయి.

☆ వీరు తినేదాంట్లో ఉల్లిపాయలు, వెల్లుల్లి, టమోటోలు అధికంగా వాడతారు.

☆ అల్యూమినియం ఫాయిల్, గిఫ్ట్‌రేపర్లు, గిఫ్ట్‌బాక్స్‌లని డస్ట్‌బిన్‌లో వేయకుండా తిరిగి వాడుతుంటారు.

☆ పార్టీకి అర గంట, గంటలేటుగా వచ్చి, అది సాధారణం అన్నట్లుగా అందుకు క్షమాపణ చెప్పరు.

☆ పోస్టల్ ముద్రపడని కవర్ల మీద స్టాంపులని జాగ్రత్తగా చింపి మళ్ళీ ఉపయోగిస్తారు.

☆ పిల్లల పేర్లకి సంబంధం లేని ముద్దుపేర్లతో పిలుస్తారు.

☆ ఇంకొకరి ఇంటినుంచి వెళ్ళేప్పుడు గడప దగ్గర నిలబడి అరగంట మాట్లాడతారు.

☆ ప్రయాణంలో తినడానికి ఇంట్లోచేసిన ఆహార పదార్థాలని వెంట తీసుకెళ్తారు.

☆ హోటల్లో బిల్ నేను చెల్లిస్తానంటే, కాదు నేనని వాదులాడు కుంటారు.

☆ వంట వండేప్పుడు మెషరింగ్ కప్స్ (కొలిచి) వాడరు. ఉజ్జాయింపుగా వేసి చేస్తారు.

☆ రాత్రి పదకొండు తర్వాతే దూరప్రాంతాలకు ఫోన్‌కాల్స్ (అమెరికన్ ఐఎస్‌డి) చేస్తారు.

☆ క్యూలో నిల్చోవడం అమెరికాకి వచ్చాకే నేర్చుకుంటారు.

☆ తనకన్నా పెద్దవాళ్ళని 'అంకుల్' లేదా 'ఆంటీ' అని పిలుస్తారు.

☆ స్వదేశానికి ఫోన్‌లో మాట్లాడేప్పుడు గట్టిగా అరిచి మాట్లాడతారు. (నెమ్మదిగా మాట్లాడినా వినపడేలా ఫోన్ సౌకర్యాలు పెరిగాయి.)

☆ స్టీల్‌తో చేసిన గ్లాసులని మంచినీళ్ళ కోసం వాడతారు.

☆ ముందు ఫోన్‌చేసి చెప్పకుండా బంధు మిత్రుల ఇళ్ళకి వెళ్తారు.



☆ పిల్లలని క్రమశిక్షణలో పెట్టడానికి సరిగ్గా శిక్షించరు.

☆ చైనా నుంచి వచ్చిన వారైతే బార్బర్ షాపుకి వెళ్లరు. ఎంత ధనవంతులైనా ఒకరి జుట్టు మరొకరు కట్ చేసుకుంటారు.

## అభిమానులకు నచ్చదు

ఎన్టీఆర్ సూపర్‌డూపర్ హిట్ 'రాముడు-భీముడు'ను తమిళంలోకి ఎంజీఆర్‌తో తీశారు. అందులో ఓ దృశ్యంలో ఆకతాయి భీముడు హోటల్లో టిఫిన్‌చేసి బిల్లు ఎగ్గొట్టి పోతాడు. మరికొన్ని క్షణాల్లో అమాయకుడైన రాముడొచ్చి అదే సీట్లో కూర్చుంటాడు. వాడేవీడనుకుని హోటల్‌వాళ్లు ఇతనిదగ్గర డబ్బుపిండుతారు. ఆ సీను తీసేటప్పుడు ఎంజీఆర్ 'నోనో.. బిల్లెగ్గొట్టి నేనువెళ్తే నా అభిమానులు ఒప్పుకోరు. సీను మార్చిరాయండి' అన్నారు. కథలో భీముడిది ఆకతాయి వ్యవహారం.. రాముడిది అమాయకత్వం అని ఎంతచెప్పినా వినిపించుకోలేదు. దాంతో నరసరాజు 'అలా రాయడం నావల్ల కాదు.. సరే తమిళం కదా మీకు నచ్చినట్లు రాయించుకోండి' అని బయటకు వచ్చేశారు.




చూడని ఓ యువకుడున్నాడు.

'పద్మా... ఇతను సుధీర్. హాసిని వాళ్ల బ్రదరంట'

'నమస్కారం' అన్నాడు సుధీర్ చేతులు జోడించి.

'కూర్చో బాబు, టీ తాగుతావా? ' అంది పద్మ.

'వద్దండి. నేను చైతన్యగారిని కలవటానికి వచ్చాను'

'పిలుస్తాను' అంది పద్మ.

చైతన్య అక్కడికి వచ్చింది. 'మీరా..? ' అంది ఆశ్చర్యంగా.

తర్వాత, 'సారీ- మీ ఇంటికి రావాలనుకున్నాను. కుదరలేదు'

'మీరు వచ్చినా ఉపయోగం లేదు. మేం మా ఊరు వెళ్లిపోయాం' అన్నాడు సుధీర్.

'మీరు చదువు ఆపేశారా...'

'లేదు. ఇక్కడ వుంటే చదువు సరిగ్గా సాగదని అమ్మ అంది. చెల్లిని స్కూల్ మాన్పించింది.'

'ఎందుకని? '

'ఏమో నాకు తెలియదు. ఇంకో శంకర్ చెల్లిని నరికేయకుండా కాపాడుకుందామనేమో' అన్నాడు.

చైతన్య అమ్మకేసి చూసింది. గోపాల్ మౌనంగా వింటున్నాడు.

'మీ చెల్లిని చదువు మాన్పించటం ఏమిటి బాబూ... ఇంట్లో వున్నంత మాత్రాన ఇలాంటివి జరగవన్న గ్యారంటీ ఏముంది. అలా అయితే ఇక నుండి ఏ ఆడపిల్ల మరో మగవాడి కంట పడకుండా నాలుగు గోడల మధ్యే వుండాలి' అంది పద్మ.

'మీరనేది నిజమే. కానీ అమ్మ అలా అనుకుంది. చెల్లి కూడా తను చదవనని చెప్పింది. నేను ప్రైవేటుగా చదివి పరీక్షలు రాయాలనుకున్నాను. అక్క కేసులో అతనికి ఉరిశిక్ష వేశారని తెలిసింది. అందుకే ఓసారి చైతన్యగారిని చూసి వెళ్దామని వచ్చాను' అన్నాడు.

'ఇప్పుడు మీకెలా అనిపిస్తోంది' అంది చైతన్య.

'నాకయితే తీర్పు సంతోషం కలిగించింది. అతను బతకకూడదు. అలాంటివారికి బతికే హక్కు వుండకూడదు. నాకు తెలిసింది అదొక్కటే. ఈ ప్రపంచంలో ఎవరూ ఇంకొకరి ప్రాణాలు తీయకూడదు' అన్నాడు. గోపాల్ సుధీర్ ముఖంలోని భావాల్ని పరిశీలిస్తున్నాడు.

'అక్క చనిపోయాక చాలామంది మా ఇంటికి వచ్చారు. అందులో మీరు మాత్రమే గుర్తున్నారు. మీ నాన్నగారు లాయరని చెప్పారు. ఏదైనా అవసరం వుంటే కలవమని చెప్పారు. తీర్పు రావటంతోనే అంతా అయిపోదని నాకు

# కుక్కకు స్వాగతం

నిరంజన్ ఒక వ్యాపారి. ఒకసారి అతిపెద్ద హోటల్‌లో బస చేసేందుకు, ఆ హోటల్ యజమానికి ఇలా జాబురాశాడు- 'నేను మీ హోటల్లో రూమ్ తీసుకుంటాను. నాతోపాటు నాకెంతో ఇష్టమైన కుక్క కూడా ఉంటుంది. దాన్ని నేను చక్కగా పెంచాను. మంచిగా






ప్రవర్తిస్తుంది. నాతో ఆ కుక్క కూడా ఉండడానికి మీరు పర్మిషన్ ఇవ్వగలరా?'

అందుకు హోటల్ యజమాని జవాబిలా రాశాడు-

'నేనీహోటల్‌ను పాతికేళ్లుగా నడుపుతున్నాను. ఇంతవరకూ ఇక్కడ ఏ కుక్కా తువ్వాళ్లు, దుప్పట్లు, వెండి సామాగ్రి, గోడలకున్న అందమైన బొమ్మలు దొంగిలించలేదు. అర్ధరాత్రిపూట ఏ కుక్కా హోటల్లో తాగి తందనాలాడుతూ గొడవచేసి, నా చేత బైటకు గెంటించుకోలేదు. ఇక్కడ దిగిన కుక్కేదీ హోటల్‌బిల్ ఎగ్గొట్టి పరారు కాలేదు. మీ కుక్కకు నా స్వాగతం! ఆ కుక్క బాధ్యత వహించగలిగితే, మీరు కూడా తనతో పాటు వచ్చి హోటల్ గదిలో ఉండవచ్చు'

తెలుసు. అయినా కూడా కింది కోర్టులో న్యాయం జరిగింది. ప్రస్తుతానికి అది చాలు. నేను వెళ్తాను' అన్నాడు.

'కొంచెం ఆవేశంలోనే వున్నాడు' సుధీర్ వెళ్లాక అన్నాడు గోపాల్.

'తన అక్కను నిర్దాక్షిణ్యంగా చంపేస్తే కోపం లేకుండా ఎలా వుంటుంది నాన్నా?' అంది చైతన్య.

'కోపం అన్ని సమస్యలకూ పరిష్కారమా చైతూ?' అన్నాడు గోపాల్.

'ఏమో నాన్నా, నాకు తెలియదు' అంది చైతన్య.



మా నాన్న సుధీర్‌ని చూసి ఆవేశంలో వున్నాడని అన్నారు. కోపంతోనే అన్ని సమస్యలు పరిష్కారం కావు అన్నట్లు మాట్లాడారు. ఇది సుధీర్‌కి మాత్రమే వర్తిస్తుందా?

మా నాన్న అనేక సందర్భాల్లో కోపం తెచ్చుకోవటం నేను చూశాను. ముఖ్యంగా పోలీసుల మీద. అలాగే నాయకులమీద. ఎన్‌కౌంటర్స్ జరిగినప్పుడు ఆయన ఓ పదిరోజుల దాకా చాలా డిస్టర్బ్‌గా వుంటారు. ఎవరిమీదో తెలియని కోపంతో వుంటారు. అలాంటి సమయంలో ఆయన్ని పలకరించాలన్నా భయం కలుగుతుంది.

నా వరకు నాకు అలాంటివి జరిగినప్పుడు బాధ కలుగుతుంది.

అడవుల్లో తిరుగుతూ తమని తాము కాపాడుకుంటూ ఉద్యమం చేయటం అంత సులభం కాదు.

వీళ్లందరూ ఈ ఉద్యమాలు తమ కోసం చేయటంలేదు. తమ కుటుంబాల కోసం చేయటంలేదు. వాళ్లు ఎక్కడ పుట్టినా, దేశంలోని పీడిత ప్రజలందరి కోసం పని చేస్తున్నారు. అలాంటివారిని పిట్టల్లా కాల్చే

యటం ఎవరికైనా బాధను కలిగించాలి.

మా నాన్న అలాంటివారిని 'స్వంత' మనుషులనుకుంటాడు. సుధీర్ కూడా తన స్వంత 'అక్క'కు అన్యాయం జరిగిందనే ఆవేశంలో వున్నాడు.

మనం 'స్వంతం' అనుకున్నప్పుడు- అయినప్పుడు మాత్రమే ఇలాంటివన్నీ వస్తాయి. 'స్వంత' ఆస్తిలేని సమాజంలోనే అన్ని సమస్యలూ పరిష్కారం అవుతాయని మా ఇంటికివచ్చే చాలామంది అంకుల్స్ అంటారు. అలాగే అమ్మతో పనిచేసే ఆంటీలు కూడా.

ఆస్తి విషయం వదిలేస్తే 'స్వంత' అనే పదాన్ని సొంతం తీసేయకూడదేమో.

నేను ఎక్కువగా నిరాశపడింది హాసిని చెల్లెలు చదువు మానేయటం గురించి. ఓసారి వాళ్ళ ఊరు వెళ్తాను. ఆ అమ్మాయిని తిరిగి చదివించేలా హాసిని వాళ్ల అమ్మగారిని ఒప్పించాలి.




గోపాల్ బట్టలు సర్దుకుంటున్నాడు.

పద్మ అతడి పక్కనే వుంది. వారి మధ్య నిశ్శబ్దం. శ్రీకాకుళం ప్రాంతంలో పెద్ద ఎన్‌కౌంటర్ జరిగింది. పోలీసులు కూడా గాయపడ్డారని వార్తలు. ఇదంతా బూటకపు ఎన్‌కౌంటరని ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంఘం ప్రకటించింది.

నిజ నిర్ధారణ కోసం ఓ కమిటీగా ఏర్పడ్డారు. అందులో గోపాల్ ఒకడు. మొత్తం విచారణ పూర్తికావడానికి పది రోజులు పట్టవచ్చు. అంతగా అయితే మధ్యలో వచ్చి తిరిగి వెళ్లాలనుకున్నారు.

సూట్‌కేస్ మూశాడు గోపాల్, పద్మకేసి చూస్తూ.

'చైతూ నీతో మాట్లాడిందా?'

'ఏ విషయం?' అంది పద్మ.

'తను హాసిని వాళ్ల ఊరు వెళ్తానంటోంది'

'నాకింకా చెప్పలేదే'

'ముందు నాకు చెప్పింది. నీతో కూడా చెబుతుందనుకుంటాను'

'మీరేమన్నారు?'

'ఏమనాలో తెలియలేదు. అయినా హాసిని చనిపోయిన రోజు అంత భయపడింది. ఇప్పుడు మాత్రం వాళ్ల ఊరు వెళ్తానంటోంది. అదట్లా వుంచి తను చదువుతోందా లేదా అనే నా అనుమానం. మనిద్దరం ఎవరి పనుల్లో వారుంటున్నాం. చైతూని గురించి పట్టించుకోవటంలేదు.'

'ఆ విషయమే చెప్పాల్సింది గోపాల్. తనకు ఇప్పుడు చదువు ముఖ్యం. మిగతా విషయాలు తర్వాత అని'

'నేను చెప్పలేకపోయాను. నువ్వే చెప్పు'

'నువ్వు ఎందుకు చెప్పలేకపోయావు. ఆ కారణం చెప్పు' అంది పద్మ.

'ప్రత్యేకంగా కారణమంటూ లేదు. తను హర్ట్ అవుతుందేమోనని'

'నేను చెబితే హర్ట్ కాదా?'

గోపాల్ మాట్లాడలేకపోయాడు.

'సర్లే. ఈ విషయం వదిలేద్దాం'

'వదిలేయటం సరైంది కాదు. మనం చేసే ఉద్యమాల వల్ల కూడా ఎవరో ఒకరు హర్ట్ అవుతారు. అలాగని ఉద్యమాలు చేయటం మానేస్తామా? చైతూ బాధపడినా మనం చెప్పాలనుకున్నది చెప్పాలి. హాసిని విషయంలో తను బాగా ఇన్వాల్వ్ అయింది. ఇదివరకట్లా చదవటం లేదు.

అంతేకాదు ఇప్పటికి రెండుసార్లు అమ్మమ్మ దగ్గరకు వెళ్లింది'

'మనమే పంపించాం కదా? '

'మనమే పంపాం. కానీ తను అక్కడకు వెళ్లిన ప్రతిసారీ ఏదో మార్పు కనిపిస్తోంది గోపాల్. మనం చిన్నప్పట్నుంచి తన వయసుకి మించిన భావాల్ని రుద్దామేమో అనిపిస్తోంది. రీడింగ్‌ని ఓ అలవాటుగా చేయాలనుకున్నాం. మనం ఇంటి దగ్గర లేకపోవటంతో పుస్తకాలే స్నేహితుల య్యాయి. మన దగ్గరుండే పుస్తకాలు వేరు కదా'

'అవును. మనం చైతూకి స్వేచ్ఛ నిస్తున్నాం. ఈ విషయంలో బయటివా రికి, మనకి తేడా వుండాలిగా'

'స్వేచ్ఛ అంటే దానికి పరిమితులు వుండొద్దా? ' అంది పద్మ.

గోపాల్ వెంటనే జవాబు చెప్పలేకపో యాడు.

ముందు అతనికి చైతన్య చేసిన తప్పే మిటో అర్థం కాలేదు.

హాసిని వాళ్లను చూసివస్తానంది. హాసిని తోటి విద్యార్థిని. అది అభ్యంతర మైతే, 'నువ్వు కూడా నీ వృత్తిని వదులు కొని బయటకు ఎందుకు వెళ్తున్నావు' అనొచ్చు

ఎంతోమంది యువతీ యువకుల్ని ఉద్యమాల్లోకి రమ్మని ఆహ్వానిస్తుంటారు.

అలాంటిది చైతన్య ఉద్యమంలోకి వస్తే మంచిదేగా!

రకరకాల ఆలోచనల్తో గోపాల్ వున్నాడు.

'నువ్వు బయలుదేరాలన్నావ్. ఆలస్యం అవుతోందా' అంది పద్మ.

'ఫర్వాలేదు'

'ఇప్పటికిప్పుడు ఈ సమస్య పరిష్కారం కాదు గోపాల్. అంతగా అయితే ఈసారికి తనని వెళ్లి రానిద్దాం. నువ్వు వచ్చాక మనం చైతూతో మాట్లాడదాం' అంది పద్మ.

'అలాగే. ఏమైనా చైతూని ఒంటరిగా పంపించటం నాకు ఇష్టం లేదు'

'భయపడుతున్నావా? ' అంది పద్మ.

'ఎందుకు భయం? ' అంటూ వచ్చింది చైతన్య.

'నీ గురించే మాట్లాడుకుంటున్నాం. నువ్వు హాసిని వాళ్ల ఊరు వెళ్తానంటు న్నావ్. ఒక్కదానివే వెళ్లటం నాన్నకిష్టం లేదు.'

'మీరే చెప్పారుగా. భయపడుతూ కూర్చుంటే మనం ఏ పనీ చేయలేమని, ఇంతకుముందు కొంతమంది పౌరహక్కుల నాయకుల్ని పోలీసులు చంపేశారని మీరం టారు. మీరు కూడా సంఘం నుండి బయ టకు రండి' అంది చైతన్య.

ఇద్దరూ మాట్లాడలేకపోయారు.

'అదే నేను మగపిల్లవాడినయితే నా గురించి ఇంత బాధపడేవారా? ' అని కూడా అంది చైతన్య.

పద్మకయితే ఏదో పుస్తకంలో ఏదో పాత్ర మాట్లాడుతున్నట్లుంది.

చైతన్య అలా అడగటం చూస్తుంటే కోపం వస్తోంది కానీ, తను తప్పేమీ అడ గటంలేదు.

సగటు అమ్మా-నాన్నల్లా మీరిద్దరూ ఆలోచిస్తున్నారు అని చైతన్య వారికి చెబు తున్నట్లుంది.

ఎప్పుడో మాట్లాడుదామని వాయిదా వేసుకుందామనుకున్నవారల్లా అప్పుడే మాట్లాడారు. ముందు పద్మ చెప్పింది.

'చైతూ... మేం చదువులు పూర్తి అయ్యాక ప్రజల కోసం పని చేస్తున్నాం. నువ్వు కూడా చదువు పూర్తి అయ్యాక నీ ఇష్టమైన రంగం ఎన్నుకో' అంది.

'నేను ఇష్టమైన రంగం ఎన్నుకోవటానికీ చదువుకీ సంబంధం ఏమిటి? అసలు ఈ

చదువులు గుమస్తాలను తయారుచేసేవని మీరూ... మీ మిత్రులూ ఉపన్యాసాలు చెబుతుంటారు కదా?'

'అది కాదమ్మా... భవిష్యత్‌లో నీకు డిగ్రీ ఉపయోగపడుతుంది' అన్నాడు గోపాల్.

'నాన్నగారూ - మీరు చేసే పనిమీద మీకు నమ్మకం వుందా?' సూటిగా అడిగింది.

'అదేంటి చైతూ.. వితండవాదం చేస్తావు' అంది పద్మ.

'నాది వితండవాదమో - ఇంకో వాదమో నాకు తెలియదమ్మా. మీరు ఓ సంఘంలో పనిచేస్తున్నారు. అంటే ఆ సంఘం నుంచి ఎప్పుడైనా బయటకు వచ్చేయాలనుకుంటున్నారా- వస్తామనుకుంటున్నారా. అలాంటప్పుడే కదా ఇంకో పని గురించి ఆలోచన వచ్చేది. నాన్నగారు లాయర్ అయ్యాక ప్రజాసేవ చేయాలనుకున్నారా లేక ప్రజాసేవ చేయటానికి లాయర్ అయ్యారా' అంది చైతూ.

గోపాల్ వాచ్ చూసుకున్నాడు.

చిన్నపిల్లల ప్రశ్నలు మొదట్లో ముద్దుగా వుంటాయి. సూటిగా జవాబు చెప్పలేనప్పుడు కోపం తెప్పిస్తాయి.

'చైతూ... ఎవరు ఎలా ఉద్యమాల్లోకి వచ్చారనేది పక్కన పెట్టు. మనం మధ్య తరగతి వాళ్లం. మనకు ఆర్థిక సమస్యలున్నాయి. అందుకే మనం ఎలా బతకాలి అని నిర్ణయించుకోవాలి. మనం ఇంకొకరికి సమస్య కాకూడదు. అందుకని నిన్ను చదువు విషయం చూసుకోమంటున్నాం' అంది పద్మ.

'ఇప్పుడు మీ ఉద్యమాల్లో పూర్తికాలం పనిచేసేవాళ్లు ఎలా బతుకున్నారు?' అంది చైతు రెట్టిస్తూ.

'వారికిచ్చే జీతాలమీద'



'అలా వాళ్లు బతకగలిగినప్పుడు నేనూ బతుకుతాను' అంది.

పద్మ- గోపాల్ ఒకరి ముఖం ఇంకొకరు

చూసుకున్నారు.

'ఇదంతా తెలుసుకోవటం కోసం మాట్లాడాను, నా తెలివితేటల్ని మీ ముందు చూపించటానికి కాదు. నేను చదువుని నిర్లక్ష్యం చేయటంలేదు' అని వెళ్లిపోయింది చైతన్య.

★ ★ ★

మావి రెండు ప్రయాణాలు.

నాన్నదీ... నాదీ.

ఇద్దరం చెరో పక్కకు వెళ్తున్నాం. అమ్మ ప్రస్తుతానికి ఇంటి దగ్గరే ఉండొచ్చు. తనదీ ఇంకో పక్కకి ప్రయాణమే.

నేను మాట్లాడిన తీరు అమ్మా-నాన్నల్ని బాధ పెట్టి ఉండొచ్చు. అమ్మమ్మ వచ్చేటప్పుడు 'జాగ్రత్త' అని చెప్పింది. అమ్మా-నాన్నలూ అంతే. ఆడపిల్లలు ఒంటరిగా ప్రయాణం చేసే పరిస్థితి ఇంకా లేదనీ- ఇప్పట్లో రాగలదనే భ్రమ కూడా నాకు లేదు. కానీ కొన్ని కొన్ని పుస్తకాలు చదువుతున్నప్పుడు నాకే అర్థం అవుతోంది. వీళ్లందరూ 'నమ్మి' రాస్తున్నదాని కంటే సంచలనం కలిగించటానికి రాస్తున్నారని.

ఒక్క రాతలేనా- మాటలూ అంతే.

ఇక్కడ ఎవరికీ- దేనికీ అదుపు లేదు. ఎవరిష్టం వారిది.

వేయి భావాలు వికసించే పద్ధతి ఇది కాదు.



నేను రాయాలనుకుంటున్న పుస్తకం ఇలా కాదు.

నేను నిజాయితీగా ఉండటానికి ప్రయత్నం చేస్తాను.

నా తప్పుల్ని ఎవరు ఎత్తి చూపించినా నన్ను నేను సరిచేసుకుంటాను.

హాసిని విషయంలో మేం ఓ పక్కన యుద్ధం చేస్తున్నాంకదా అని మా అమ్మ అనుకోవచ్చు. శంకర్‌కి ఉరి శిక్ష పడింది. ఆ తర్వాత ఇంకా రకరకాల సమస్యలు ముందుకొస్తున్నాయి. అయితే 'హాసిని'కి న్యాయం జరగాలంటే శంకర్‌కు శిక్షపడటం ఎంత ముఖ్యమో, ఆమె చెల్లెలు చదువుకోవటం కూడా అంతే ముఖ్యం.

నన్ను చూడగానే గుర్తుపట్టింది హాసిని తల్లి. ఆమె కూతురు కూడా ఇంట్లోనే వుంది. సుధీర్ ఇంట్లో లేడు.

'ఈ మధ్య సుధీర్ వచ్చాడమ్మా' అన్నాను.

'వచ్చాడా... నాతో చెప్పలేదే' అంది.

'మీరు మీ చిన్నమ్మాయి చదువు మాన్పించారని తెలిసింది. 'హాసిని' నాతో ఓసారి చెప్పింది. నేను చదువుకొని ఉద్యోగం చేసి తమ్ముడ్నీ, చెల్లెల్నీ చదివించాలని, తనని చంపినవాడికి ఉరి శిక్ష పడితే ఆమె ఆత్మ శాంతిస్తుందో లేదోగాని చెల్లెలు చదువుకోకుండా వుంటే మాత్రం తప్పకుండా బాధపడుతుంది' అన్నాను.

'నిజమే, కానీ నాకంటే తనే భయపడిందమ్మా. తను చదవనంటేనే చదువు మాన్పించాను' అంది.

'మీ అమ్మాయి పేరేంటి? '

'లయ'

'నేను లయతో మాట్లాడతాను' అన్నాను.

లయ దగ్గరకు వెళ్లాను. 'మనం పెరట్లో మాట్లాడుకుందాం' అంది.

'మీ ఊరు చూడాలని వుంది లయా'

'నేను బయటకు రాను' అంది.

'దగ్గర్లో మీ బంధువులు లేరా? '

'లేరు. తెలిసినవారున్నారు'

'కనీసం ఆ ఇంటికయినా రావచ్చుగా, మీ అక్క స్నేహితురాలి కోసం' అన్నాను. ఏమనుకొందో లయ నాతో బయలుదేరింది.

'లయా... మీ అక్కయ్య నా కళ్లలో ఇంకా మెదులుతూనే వుంది. మేమందరం రకరకాల కబుర్లు చెప్పుకునేవాళ్లం. తను మాత్రం ఒక్క క్షణం కూడా వేస్ట్ చేసేది కాదు. అలాంటిది నువ్వు చదవననటం బాగుండలేదు.'

'అక్క చదువుకోవాలనుకుంది కాబట్టే చంపేశారుగా' అంది లయ.

'అదేమిటి... ఎవరు చెప్పారు? '

'అక్క ఇంటి దగ్గర వుంటే వాడు చూడడు. ఎప్పుడన్నా చూసినా రోజూ వెంటపడడు. కత్తుల్తో నరకడు' అంది అటూ ఇటూ చూస్తూ.

'ఎందుకలా చూస్తున్నావ్? '

'ఎవరన్నా మగవాళ్లు చూస్తున్నారేమోనని భయం.'

'మగవాళ్లంటే అంత భయపడిపోయావా!'

'అవును'

'పెళ్లి చేసుకోవా? '

'చేసుకోను' అంది లయ.

ఆ కళ్లు నిస్తేజంగా వున్నాయి. తను అక్క గురించి వినటమేగాని ఆ దాడిని ప్రత్యక్షంగా చూసివుంటే పిచ్చిదయి వుండేదేమోననిపించింది.

దగ్గరగా వున్న ఇంటికి తీసుకెళ్లింది.

'రామ్మా' అన్నారాయన లయని. నాకేసి కొత్తగా చూస్తూ, 'ఈ అమ్మాయెవరూ' అన్నారు.

'నా పేరు చైతన్య. హాసిని స్నేహితురాలిని' అన్నాను.

'అలాగా కూర్చోండమ్మా' అన్నారు. అరుగు మీద కూర్చున్నాం.

'మొత్తంమీద లయని ఇంటి దగ్గర నుండి బయటకు తీసుకొచ్చావు. సంతోషంగా వుంది' అన్నారాయన.

'మనం మనల్ని కాపాడుకోవాలి. అందుకే కొన్ని విద్యలు నేర్చుకోవాలి. అప్పటికి కూడా ప్రమాదం వుందంటే మీ అమ్మగారు చెప్పినట్లు చావు ఎలా రాసిపెట్టి వుంటే అలా జరుగుతుంది' అన్నాను ఆ ఇంటినుండి వచ్చేటప్పుడు.

లయ కళ్లు మెరిశాయి.

మొత్తంమీద కన్విన్స్ అయింది.

ఆడపిల్ల ఆడపిల్లగా ఉండకూడదు. అంటే ఏడు పరుపులకింద మల్లె పువ్వు తొడిమ ఉన్నా నిద్ర పట్టని రాజ కుమార్తెలు కాదు ఇప్పుడు కావాల్సింది. నడుముకి బిడ్డను కట్టుకుని యుద్ధరంగంలోకి దూకిన ఝాన్సీరాణులు కావాలి.

'లయ చదువుకుంటానంటే ఏదో రకంగా చదివించుకుంటానమ్మా' అంది వాళ్లమ్మ.

'మీరు మళ్లీ మన ఊరు వచ్చేయండి. మీకు డబ్బులు అవసరమయితే మొహమాటం లేకుండా నన్ను అడగండి' అంది చైతన్య.

ఆమె తలూపింది.

హాసినివాళ్ల దగ్గరనుండి నేను అమ్మమ్మ దగ్గరకు వెళ్ళిపోయాను. నేను చేసిన పని గురించి చెప్పాను.

'మంచి పని చేశావు మనవరాలా' అంది అమ్మమ్మ.

★ ★ ★

హైకోర్టు కూడా శంకర్‌కి ఉరి శిక్షను ఖరారు చేసింది.

అప్పుడు మొదలయింది చర్చ శంకర్‌కి క్షమాభిక్ష పెట్టాలని, శంకర్ చేసింది నేరమే కావచ్చు అయితే శంకర్‌ని ఉరి తీయటం అంటే అది చట్ట బద్ధంగా చేస్తున్న హత్య కాదా అనటం మొదలుపెట్టారు. పత్రికల్లో ఈ అంశం మీద మేధావులు వ్యాసాలు రాస్తున్నారు.

అప్పుడే మహిళా సంఘాలు సమావేశం అయ్యాయి.

'మనం ఎందుకు ఉద్యమం చేస్తున్నామో తెలియదు. ఏ ఆడపిల్ల మీదయినా దాడి జరిగిన కొత్తలో, నేరస్థులకు శిక్షలు పడాలని ఊరేగింపులు చేస్తున్నాం.. ప్రకటనలిస్తున్నాం. మనం అన్ని రకాల మార్గాల్ని ఉపయోగించుకుంటున్నాం. ఇలాంటి కేసులో శిక్ష పడినప్పుడు మనమే ఆ శిక్షను రద్దు చేయమంటున్నాం. ఇదంతా చూస్తే ప్రజల్లో నమ్మకం ఎలా కలుగుతుంది. మనది ద్వంద్వ ప్రవృత్తి అనుకోరా' అని లలిత అనటంతో చర్చ మొదలయ్యింది.

**'శంకర్ ఈ దారుణం చేశాడంటే దాని వెనకాల ఎన్ని ప్రభావాలున్నాయి. నేటి సినిమాలూ ఈ దారుణానికి కారణం. వాటి గురించి కూడా మాట్లాడాలి'**

'ఒక నేరం జరగటానికి కారణం వ్యక్తిది మాత్రమేనా? వ్యవస్థది కాదా? '

'శంకర్ ఈ దారుణం చేశాడంటే దాని వెనకాల ఎన్ని ప్రభావాలున్నాయి. ఈ మధ్యకాలంలో వస్తున్న సినిమాలు ఈ దారుణానికి కారణం. వాటి గురించి కూడా మాట్లాడాలి'

'సినిమాలనో- టీవీలనో మనం ఇక్కడ సమీక్షించటం లేదు.'

'సినిమాల్లో మంచి లేదా, చెడు మాత్రమే ఉందా? '

'అదే కొలబద్ధ అయితే ఏ సాహిత్యం, సినిమా ఉండదు. ఒకే విషయం అందరి మీద ఒకే ప్రభావం చూపదు.'





## పాపాత్ములకే

విశ్వనాథ సత్యనారాయణ గురించి అందరికీ తెలిసిందే కదా? ఓసారిబెజవాడలో కిళ్లీకొట్టు వద్ద నిలబడి దారేపోతున్న నరసరాజును కేకేసి పిల్చారు. కాసేపు మాట్లాడుకున్నాక 'ఏమయ్యా మీ సినిమావాళ్లు మాస్ మాస్ అంటారే! ఎవరువాళ్లు? నాకెక్కడా కన్పించరే?' అన్నారు విశ్వనాథ.

'వాళ్లు మాలాంటి పాపాత్ములకేతప్ప పుణ్యాత్ములకు కనబడరు మాస్టారూ!' అన్నారట నరసరాజు నవ్వుతూ.




'ప్రతి రచనా- ప్రతి సినిమా ఆ మాట కొస్తే ప్రతి మాటా కూడా పాజిటివ్‌గానో నెగెటివ్‌గానో ప్రభావం చూపిస్తుంది. లలిత అన్నట్లు ఇది వ్యక్తిగతం. జీన్స్‌లోనే అరాచకం ఉన్నప్పుడు ఏం చేస్తాం? అప్పటిదాకా ఎంతో ప్రేమగా పెంచుకునే కుక్కపిల్లకి పిచ్చి ఎక్కితే దాన్ని ఇంకా ఇంట్లో ఉంచుకుంటామా? ఇంట్లోనే కాదు ఈ లోకంలోనే ఉంచరు. అది తనతో పాటు అందరినీ తీసుకుపోతుంది కాబట్టి'.

సో, టాలరెన్స్‌కి కూడా కొన్ని లిమిట్స్ ఉన్నాయి. శంకర్ లాంటి వారి విషయంలో ప్రజలు చాలా ఆగ్రహంగా ఉన్నారు. అతనికి శిక్ష పడాలి.'

'లలితగారూ ఉరిశిక్ష ప్రధాన ఉద్దేశం ఏమిటి?'

'దారుణమైన నేరాలు చేసిన వారిని శిక్షించటం.'

'నేను అలా అనుకోను. అలాంటి శిక్షలు ఎందుకు వేస్తారంటే ఇతరులు భయపడతారని. నేరం చేయాలనుకునే వారికి అదో హెచ్చరికగా ఉంటుందని.'

'ఆ ఉద్దేశం ఉంటే ఉండొచ్చు. కానీ ఉరిశిక్షని రద్దు చేసిన దేశాల్లోకంటే ఉరి శిక్షను అమలు చేస్తున్న దేశాల్లోనే ఎక్కువ హత్యలు జరుగుతున్నాయని మేధావులు చెబుతున్నారు. అలాంటప్పుడు ఈ హెచ్చరికలు పని చేస్తాయా? అసలు నేరం చేయాలనుకునేవాడు శిక్షల గురించి ఆలోచించడం.'

'కిరాయికి మర్డర్లు చేసే వారికి తెలియదా మనిషిని చంపితే ఉరిశిక్ష పడుతుందని వాళ్ళు అన్నింటికీ తెగించే ఆ పని చేస్తున్నారు' అంది లలిత.

పద్మ మాట్లాడటం లేదు.

అందర్నీ వింటోంది ప్రశాంతంగా.

ఆమెను ఆలోచింప చేస్తున్న ప్రశ్న ఒకటే- ఉద్యమాలు చేసి శిక్ష పడాలనేది మనమే... ఆ శిక్షను రద్దు చేయాలనేది మనమేనా?

చాలా సమయాల్లో ఇలాంటి విచిత్రమైన పరిస్థితి ఏర్పడుతుంది. ఏది ఏమైనా ఈ విషయం గురించి గోపాల్‌తో మాట్లాడాలి అనుకుంది.

ఈ విషయంలో అక్కడ సీరియస్ చర్చ జరిగింది.

శంకర్‌కి ఉరిశిక్ష పడాలనేవారు... వద్దనేవారు రెండు వర్గాలుగా చీలిపోయారు.

పద్మ మాత్రం సందేహంలోనే వుంది

ఉరిశిక్ష రద్దు కావాలా? వద్దా?

★ ★ ★

గోపాల్ పద్మని చూశాడు. తను చెప్పిందంతా విన్నాక కొద్దిసేపు ఆలోచించాడు. 'నేరమూ-శిక్షా' అనేవి సమాజాన్ని అత్యంత తీవ్రంగా ప్రభావితం చేసే అంశాలు.

'స్వంత' ఆస్తి లేకముందు నేరాలు ఏ రకంగా వుండేవో తెలియదు. అప్పుడు ఉత్పత్తే తక్కువ. అదనపు ఉత్పత్తి లేదు. ఉన్నది చాలనప్పుడు బలవంతులు బలహీనుల మీద దాడి చేస్తారు. ఈ పోరాటంలో బలయ్యేది ఎప్పుడూ బలహీనులే.

నేరానికి మూలం ఆర్థికమే. దాని తర్వాత కామం. ఈ రెండింటి చుట్టూ ప్రధానంగా నేరాలు జరుగుతుంటాయి. మధ్య యుగాల్లో నేరం చేసినవారిని బహిరంగంగా ఉరి తీసేవారు. కొన్నిచోట్ల రాళ్లతో కొట్టి చంపేవారు. కాళ్లూ, చేతులూ తీసేసేవారు. అవి అమలు చేసే తీరు శిక్షల మీదే జుగుప్స కలిగించేటట్లు చేసేది. అప్పటిదాకా నేరస్థుడి మీద వున్న కోపమంతా కరిగిపోయి ఆ చోటులో కరుణ చోటు చేసుకునేది.

వీటన్నింటికి మించి తమకు ఇష్టం లేని వారిని నిర్మూలించటానికి 'శిక్ష'ను ఆయుధం చేసుకోవటం. ఓ వ్యక్తి నేరం చేశాడా, లేదా అనేది విచారించి నిజం నిగ్గు తేల్చటం వుండేది కాదు. అందుకే ప్రజాస్వామ్యం వచ్చింది. అదెంత బూటకమైనా ఇక్కడ కొన్ని అవకాశాలున్నాయి. మొత్తంగా నేర చరిత్రను పరిశీలిస్తే అదో మహాసముద్రం.

కాలాన్నిబట్టి ప్రజల అభిప్రాయాలు మారుతూ వస్తున్నాయి. అయితే ఏ కాలంలోనూ, ఏ విషయంలోనూ ఏకాభిప్రాయం అంటూ లేదు. కానీ ఓ చర్చ మాత్రం తప్పనిసరి అవుతోంది

'ఉరిశిక్షని మేము సమర్థించం పద్మా' అన్నాడు గోపాల్.

'అన్ని ఉరిశిక్షలూ ఒకటి కాదుగా' అంది.

'ప్రాణం మాత్రం ఒకటేగా'

'అంటే శంకర్ విషయంలో మీరు ఉరిశిక్షకు వ్యతిరేకంగా ఫైట్ చేయబోతున్నారా?'

'ఒక్క శంకర్ అనే కాదు...'

'నేను అడుగుతున్నది మాత్రం శంకర్ గురించే'

'పద్మా, నువ్వు శంకర్ గురించే అడగవచ్చు. ఇలాంటి కేసులు నాలుగు పెండింగ్‌లో వున్నాయి. అవన్నీ రకరకాల దశల్లో వున్నాయి. వాటన్నింటిని రద్దు చేయాలనేది మా స్టాండ్. శంకర్ కేసు అయిదవది'

'కానీ శంకర్ కేసులో మీరు ఉరిశిక్షను వ్యతిరేకించకుండా వుండటం మంచిది' అంది పద్మ.

'పద్మా అది మా సంఘం తీసుకున్న నిర్ణయం'

'ఉరిశిక్ష కూడా అంతే. ఈ నిర్ణయాన్ని కోర్టులు ప్రకటించినా, చాలామంది ప్రజలు ఆమోదించారు. అందుకే దానిని వ్యతిరేకించొద్దు'

'చాలామంది ఒప్పుకున్నారని మనం సమర్థిస్తామా?'

'ఇప్పుడేగా చెప్పావు. ఇది మా సంఘం నిర్ణయమని. మీ సంఘంలో కూడా అందరూ ఒప్పుకున్నారని నేను అనుకోవటంలేదు. మెజారిటీ నిర్ణయాన్ని మీరు అమలు చేస్తున్నారు. ఏ సంఘమైనా అన్నీ ఒప్పులే చేస్తుందనేం లేదు. మనం సమస్యను చూడాలి. అవసరమైతే సంఘం నుంచి బయటకు రావాలి'

'పద్మా' అన్నాడు గోపాల్ షాక్‌తో.

'అవును గోపాల్. ఇదేం చిన్న సమస్య కాదు. మహిళల బతుకులకు సంబంధించింది. మాకు ఈ ప్రపంచంలో బతికే హక్కు వుందో లేదో తేల్చుకోవలసిన

సమయం వచ్చింది. ఆడవాళ్లకు ఇష్టాలుండవా. తను ఎవర్ని ప్రేమించాలో, ఎవర్ని ప్రేమించకూడదో నిర్ణయం తీసుకునే హక్కు లేదా! అసలు ఏ న్యాయం ప్రకారం ఆడవాళ్ల మెడలమీద కత్తులు పెడుతున్నారు. ఆ శంకర్ ఎవడు? ఇంకో మగాడెవడు- నన్నే ప్రేమించు అని నిర్బంధం చేయటానికి. అలాంటివాడికి క్షమాభిక్ష ఏమిటి? నేను అంగీకరించలేను'

'అంటే నీ భావాలు నా మీద రుద్దుతున్నావా' అన్నాడు గోపాల్.

'అలా అనిపిస్తోందా గోపాల్. నువ్వూ మగవాడిలా ఆలోచిస్తున్నావా? నీకూ ఓ కూతురుందని మరచిపోతున్నావా? రక్తపు మడుగులో పడున్న హాసిని నీకు గుర్తు రావటం లేదా? ఓ కుటుంబం ధ్వంసం అయింది. ఈ హత్యవలన ఆ కుటుంబమే కాదు కొన్ని వేల కుటుంబాల మీద ఆ ప్రభావం పడింది. ముఖ్యంగా ఆడపిల్లల మీద. ఇప్పుడిప్పుడే తమ పిల్లలకు స్వేచ్ఛ ఇద్దామనుకుంటున్న తల్లిదండ్రులు కూడా ఈ దెబ్బతో తమ పిల్లలకు ఆంక్షలు విధించారు...'

గోపాల్ మాట్లాడలేకపోయాడు.

'ఎక్కడిదాకానో ఎందుకు, మనం చైతూని ఒంటరిగా పంపించటానికి భయపడ్డాం. మొన్న చైతూ మనల్ని ప్రశ్నలు అడుగుతుంటే ఉక్కిరి బిక్కిరయ్యాం తప్ప తనకి సరైన సమాధానం చెప్పలేకపోయాం. అందుకే చెబుతున్నాను. మనం రాజకీయ పార్టీలకు చెందిన వాళ్లం కాకపోవచ్చు. మనకు ఓట్లతో అవసరం లేకపోవచ్చు. కానీ ప్రజల గురించి పట్టించుకోవాలి.'

'నేను శిక్ష వద్దనటం లేదు. ఉరిశిక్ష బదులు యావజ్జీవ కారాగార శిక్షగా మార్చమని అడుగుతా. అది కూడా కఠిన కరాగార శిక్ష. చంపేస్తే ఏమవుతుంది. ఒక్కసారితో అయిపోతుంది. అదే బతికుంటే ఆ తప్పు వెంటాడుతుంది. క్షణ క్షణం మనసుని కాల్చేస్తుంది.'

'అని నువ్వనుకుంటే సరిపోతుందా?'

'సరిపోదు, శంకర్ అనుకోవాలి. అలా అనుకోవటానికే ఈ ప్రయత్నం. అవసరమయితే నేను హాసిని వాళ్ల కుటుంబ సభ్యులతో మాట్లాడతాను' అన్నాడు గోపాల్.

'ఏం మాట్లాడతారు?'

'శంకర్‌ని క్షమించమని. శంకర్‌కి క్షమాభిక్ష పెడితే తమకు ఎలాంటి అభ్యంతరం వుండదని.'

'గోపాల్, వాళ్లు 'శంకర్' చేసిన గాయం నుండి కోలుకుంటున్నారు. మళ్లీ దాన్ని పుండు చేయడం మంచిది కాదు. వాళ్లనడిగితే ఏం చెబుతారు తమ పిల్లని చదువు మాన్పించిన నిస్సహాయులు. ఉరిశిక్షపడినా, రద్దయినా మాట్లాడరు.'

'ఇప్పుడేమంటావ్?'

'ఈ విషయంలో మనం హాసిని పక్కన నిలబడదాం.'

'సారీ, నేను మానవత్వం పక్కన నిలబడతాను' అన్నాడు గోపాల్.

'మంచిది. నేను మాత్రం 'శంకర్'ని ఉరి కంబం ఎక్కించేంతవరకూ ఈ పోరాటాన్ని విడిచి పెట్టను' అని ఇంట్లోకి వెళ్లిపోయింది.

గోపాల్ పద్మకేసి చూస్తుండిపోయాడు.

★ ★ ★

'సుధీర్' మా కాలేజీ దగ్గర నన్ను కలిశాడు.

'హైదరాబాద్ వచ్చేశారా' అన్నాను.

'రాలేదు' అన్నాడు.

'లయ స్కూల్‌కి వెళ్లటంలేదా?' అన్నాను నిరాశగా.

'ఇంటి దగ్గరే వుండి చదువుకుంటోంది'

కత

చతుర కత

# అది సంగతి

"మీ అమ్మాయికి పెళ్లి చేశావటగా- ఏ ఊరి చ్చావేంటి?" అడిగాను చాన్నాళ్ల తర్వాత కలిసిన పాత మిత్రుడు అనంతరామయ్యని.
"నీకూ వాళ్లు తెలుసు- కొమ్మనవారు. నెల్లూరు..." చెప్పాడు అనంతరామయ్య.
"అల్లుడేం చేస్తుంటాడు?"
"సైక్రియాట్రిస్ట్‌గా ప్రాక్టీస్ చేస్తూ రెండు చేతులా సంపాదిస్తున్నాడు. ఎప్పుడు చూసిన బిజీగానే వుంటాడు. ఊపిరి పీల్చుకోడానికి కూడా తీరుబడి ఉండదు పాపం.." గర్వంగా అన్నాడు అనంతరామయ్య.
నాకతని మాటలు చాలా విడ్డూరంగా అనిపించాయ్- వేరే డాక్టర్లయితే అనుకోవచ్చు కానీ మెంటల్ డాక్టర్ (సైకియాట్రిస్ట్ అని నా అర్థం -డాక్టర్‌కి మెంటలని కాదు) మరీ అంత బిజీగా ఎందుకుంటాడు? మరీ విచిత్రం కాకపోతే అయినా నూటికో కోటికో ఒక్కరికే కదా పిచ్చెక్కి తైతక్కలాడేది. అదే అన్నాను సైక్కూడా.
"అంటే... నేను లేనిపోని గొప్పలు చెబుతున్నాననా నీ ఉద్దేశం? మాఅల్లుడుగారి క్లినిక్- వేదయపాళెం అయ్యప్పగుడి ప్రక్కనే... కావాలంటే నాతో రా... చూస్తే నీకే అర్థమవుతుంది'' కొంచెం కినుకగా అన్నాడు అనంతరామయ్య.
"ఊరికే అన్నాలేరా... ఎందుకంత సీరియస్? అలాగే కానీ లక్షణంగా ఉంటే మనకింక కావలసిందేముంది" అన్నాను నవ్వుతూ.
"అలాకాదు, నీకు నమ్మకం కుదరాలి..." అని అంటూనే ఆటోని పిలిచాడు అనంతరామయ్య.
అయిదారు నిముషాల్లో మేమక్కడికి చేరుకున్నాం.
నేల ఈనిందా అన్నట్టుగా అక్కడున్న జనాన్ని చూసి నాకు మతి పోయింది. బాప్‌రే బాప్. ఇంతమందికి పిచ్చా? అనుకున్నాను.



విచిత్రం ఏంటంటే- అక్కడున్న జనాలందరూ మొగుడూ, పెళ్లాలే- జంటలు జంటలుగా నిలబడున్నారు.
ఎందుకిలా జంటలు జంటలుగా వచ్చారు?
వీళ్లందరికి ఏ రకమైన మెంటలు? చూడ్డానికి బాగానే వున్నారే. అలంకారాలు కూడా చేసుకుని ట్రిమ్‌గా వున్నారు. ఆలోచిస్తుండగా ఓ అయిదారుగురు భర్తలు తమ భార్యల్ని ఈడ్చుకొస్తూ కన్పించారు. అంటే... పేషంట్ల సంఖ్య పెరిగిపోతూ ఉందన్న మాట.
అంతలో నా దృష్టి అక్కడ స్తంభానికి వేళ్లాడుతున్న బోర్డ్ మీద పడింది.
అంతే...
గబగబ అనంతరామయ్యకి చెప్పి నేను మా ఇంటివైపు వెళ్లే ఆటో ఎక్కేశాను. నా భార్యను కూడా అక్కడికి తీసుకొచ్చి చికిత్స చేయించడానికి!
అవును మరి... అక్కడున్న బోర్డుమీద ఇలా ఉంది.
'ఇచ్చట మీ భార్య యొక్క చీరలపిచ్చి తగ్గించబడును'

**– కె. లక్ష్మీకాంతమ్మ**

అన్నాడు.

కొంతలో కొంతవరకు నయం. నేను హాసిని వాళ్ల ఇంటికి వెళ్లినందుకు ఆ మాత్రం ఫలితం వుందన్నమాట.

'ఏదన్నా పనిమీద వచ్చావా సుధీర్?'

'నిన్ను కలుద్దామనే వచ్చానక్కా' అన్నాడు.

'ఇంటికి వెళ్దామా...'

'వద్దు'

'అదేంటి?' అన్నాను అర్థంకాక.

'నేను మా ఊరు వెళ్లిపోతాను. నీతో మాట్లాడాలక్కా'

తనకి మా ఇంటికి రావటం ఇష్టంలేదని అర్థమయింది.

ఇద్దరం ఓ చెట్టు దగ్గరకు వెళ్లి కూర్చున్నాం.

'చెప్పు సుధీర్'

'శంకర్‌కి ఉరిశిక్ష వద్దని మీ నాన్నగారు ఉద్యమం మొదలు పెట్టారని విన్నాను' అన్నాడు ముక్తసరిగా.

నేను వెంటనే మాట్లాడలేకపోయాను.

'రేపు శంకర్ వచ్చి నా చెల్లెల్ని కూడా నరికేస్తే పరిస్థితి ఏమిటి?'

'అలా జరగదు సుధీర్'

'జరగదని నువ్వు గ్యారంటీ ఇస్తావా అక్కా' అన్నాడు.

ఏం జవాబు చెప్పగలను. భవిష్యత్తు గురించి చెప్పటానికి నేను జ్యోతిష్యురాలిని కాదు.

'ఈ విషయం విన్నాక నాకు చాలా బాధ కలిగింది. నువ్వెవరో తెలియకపోతే నాకింత బాధ వుండేది కాదు. మా నాన్న లాయర్, ఏదన్నా సహాయం కావాలంటే అడగమన్నావు. ఇదేనా మీరు మాకు చేసే సహాయం?' అన్నాడు సూటిగా.

నాలో తప్పు చేసిన భావం కలిగింది.

'ఈ ప్రపంచం ఇంతే. ఎప్పుడయినా అమాయకులే ప్రాణాలు పోగొట్టుకుంటారు. ఎప్పుడు మతాల మధ్య చిచ్చు రగిలినా బలయ్యేది పూటకు గతిలేనివారే. వారికి దేవుడంటే నమ్మకం వుంటుంది. మా కష్టాలు తీర్చమని ఏ మతానికి చెందిన పేదలయినా మొక్కుకుంటారు. బహుశా భగవంతుడు ఈ రకంగా వాళ్ళ మొక్కుల్ని తీరుస్తాడేమో' అన్నాడు.

'సుధీర్ మా నాన్నలాంటి వాళ్లు ఓ ప్రయత్నం చేయవచ్చు. అంతమాత్రాన శంకర్‌కి ఉరిశిక్ష రద్దుచేయాలనేం లేదుగా' అన్నాను.

సుధీర్ నా కళ్లలోకి చూశాడు.

'అక్కా నేను తప్పు చేసినా, నువ్వు తప్పు చేసినా ఫలితం అనుభవించాలి. నాకు ఇంతవరకే తెలుసు. అయినా శంకర్ నా అక్కను ఎందుకు చంపాడు. దేశం కోసం చంపాడా, పొరపాటున చంపాడా? అలాంటిదయితే నేను అర్థం చేసుకుంటాను. కానీ ఏ తప్పు చేయని అక్కకి ఇంత అన్యాయం జరిగింది. అది మీ నాన్నగారి దృష్టికి రాదా!'

మాటలు కరువయ్యాయి.

'మీ నాన్న సంగతి వదిలేయ్. నువ్వు కూడా శంకర్‌కి ఉరిశిక్ష వద్దనుకుంటున్నావా అక్కా?'

'లేదు సుధీర్' అన్నాను.

అతని కళ్లలో కాస్త సంతృప్తి కనిపించింది.

'అక్కను చంపేసిన మొదటి రోజుల్లోనే కాస్త సానుభూతి. తర్వాత కొంతమంది ఏమంటున్నారో తెలుసా? వాళ్లిద్దరి మధ్యా ఏమీ జరగకపోతే వాడు ఇంతకు తెగించడు. ఈ కాలం పిల్లలు అలా తయారయ్యారు. చిన్న వయసులోనే ప్రేమలంటూ మొదలు పెడుతున్నారు. వాడు ఆ అమ్మాయినే ఎందుకు చంపాడు? కాలేజీలో ఎంతమంది అమ్మాయిలు లేరు' అన్నారు.



'మొదటిసారి నాకు జుగుప్స కలిగింది. ఇలాకూడ ఆలోచిస్తారా! రోడ్డుమీద వెళ్తుంటే ప్రమాదం జరుగుతుంది. వాళ్లకే ఎందుకు జరుగుతుందంటే సమాధానం వుంటుందా? మా అక్క అలాంటి తప్పులు ఎప్పుడూ చేయలేదు. చేయదు కూడా. ఒకటి మాత్రం నిజం. ఈ సమాజంలో నేరస్థుడికే గౌరవం ఎక్కువ. వాళ్లకే భయపడతారు. వాళ్లకే రాయితీలు ఇస్తారు. అందుకేనేమో ఎందరో యువకులు నేరాలు చేయటానికి తయారవుతున్నారు' అని వెళ్లిపోయాడు.

★ ★ ★

మా అమ్మమ్మ నుండి నాకు ఫోన్ వచ్చింది, తను హైదరాబాద్ వస్తున్నానని అందులోని ముఖ్య విషయం. ఈ సంగతి మా అమ్మకి చెప్పవద్దని. తను వాళ్ల స్నేహితురాలి ఇంట్లో ఓ పదిరోజులు వుంటుందంట. ఆ అడ్రస్ చెప్పింది. 'వీలుంటే ఓ సారి రా' అంది.




## గుంటూరు మిరపకాయ

మద్రాస్ లయోలా కాలేజీలో ప్రవేశం కోసం నరసరాజు వెళ్లినప్పుడు అక్కడి ప్రిన్సిపాల్ మర్ఫీ. ఆయన ఐరిషీయుడు. నరసరాజు గుంటూరు నుంచి వచ్చాడనేసరికి ఆయన ఉలిక్కిపడ్డాడు. కారణం ఆ కిందటేడాదే గుంటూరు నుంచి వచ్చిన మాకినేని బసవపున్నయ్య, మోటూరి హనుమంతరావు లాంటి విద్యార్థులు సమ్మె చేసి సంచలనం సృష్టించారు.

'నాతో ఇబ్బందులుండవు నేను గుంటూరు హిందూ కాలేజి స్టుడెంట్‌ను' అనిచెప్పి చేరిపోయారు నరసరాజు. కానీ మరుసటి ఏడాదే జవహర్‌లాల్ అరెస్టుకు నిరసనగా సమ్మె తప్పలేదు. మర్ఫీ నరసరాజును పిల్చి కాలేజీలో చేరేటప్పుడు నువ్వన్న మాట తప్పావు అన్నారు. దానికి నరసరాజు 'మేం బ్రిటిషర్లకు వ్యతిరేకంగానే తప్ప కాలేజీకి వ్యతిరేకంగా సమ్మె చేయలేదు. మీ ఐరిషులూ బ్రిటీషర్లకి వ్యతిరేకంగా పోరాడి స్వాతంత్ర్యం తెచ్చుకున్నవాళ్లే. మా నేత అరెస్టుకు వ్యతిరేకంగా సమ్మెచేయడంలో తప్పేముంది?' అని వాదించడంతో ఆయన మరేం మాట్లాడలేదు.

'వీలుండటమేమిటి... ఈ పదిరోజులు నీ దగ్గరే వుంటాను' అన్నాను.

'అయితే రావద్దు' అంది నిర్మొహమాటంగా.

'సర్లే. ఉండనులే' అన్నాను, లేకపోతే హైదరాబాద్ రావటం మానేస్తుందని. నాకు చాలా సంతోషం కలిగింది. సుధీర్ వచ్చి వెళ్లిన వెంటనే ఈ ఫోన్. నాకు కాస్త రిలీఫ్ అమ్మమ్మతో వుంటే.

అమ్మమ్మ ఇన్ని రోజులుగా ఎక్కడికీ రాలేదు. కొత్తలో బంధువుల ఇళ్లలో పెళ్లిళ్లు జరిగినప్పుడు వెళ్లేది. ఆ తర్వాత మానేసింది. పిల్లలతో మాట్లాడదు. వాళ్లు తప్పులు చేసి వుండవచ్చు. అంతమాత్రాన ఇంత కఠినంగా వుండాలా అంటే అంతే. అదే అమ్మమ్మ పాముని చంపటానికి కూడా ఇష్టపడదు.

మనుషులు ఎప్పటికయినా అర్థమవుతారా?

అమ్మమ్మ వచ్చాక వెళ్లి కలుసుకున్నాను. వాళ్ల ఫ్రెండ్‌ని పరిచయం చేసింది. ముఖం నిండా ముడతలు. నాకెందుకో మదర్ థెరిస్సాలా అనిపించింది. నన్ను దగ్గరకు తీసుకుని నా వెంట్రుకలు సరిచేస్తూ 'ఇలా చెవులమీద వెంట్రుకలు వేసుకుంటే మాటలు ఎలా వినబడతాయిరా?' అంది.

'అది ఫ్యాషన్' అంది అమ్మమ్మ.

'నిజమా' అంది చిరునవ్వుతో. ఆమె పేరు వరూథిని అంట. అప్పట్లో ఆ పేరు ఎంత బాగుండేదో ఆమెకి. ఇప్పుడు 'వరూథిని' అనుకుంటే ముందు నవ్వు వచ్చింది. మెల్లగా ఆమె ముఖంలోకి చూస్తుంటే ఓ దేవతని చూస్తున్న ఫీలింగ్.

ఎంత తెలుపో? వయసులో ఎంత అందంగా వుండేదో అనిపించింది.

ఆమె ముఖంలో ఏదో వింత ఆకర్షణ. చిరునవ్వు ఎప్పటికీ చెరిగిపోదేమో అనిపించింది.

'మీ అమ్మ ఇక్కడ వుందని నాకు తెలియదు. నేను కూడా ఇక్కడికి వచ్చి అయిదు సంవత్సరాలే. ఎట్లావుంది మీ అమ్మ?'

'బాగానే వుంది అమ్మమ్మ' అన్నాను.

'మీ అమ్మ పేరేంటి?'

'పద్మ'

'మీ అమ్మని కూడా చూడాలనుకున్నాను. దేవి ఒప్పు కోలేదు. సరే నిన్నన్నా చూశాను. ఇంటర్ చదువుతున్నావంట కదా' అన్నారామె.

తలూపాను.

'మీ నాన్నగారేం చేస్తారు?'

'లాయర్. అదిగాక పీపుల్స్‌రైట్స్ ఆర్గనైజేషన్‌లో పని చేస్తారు'

'వెరీగుడ్. ఆయన పేరు?'

'గోపాల్... అసలు పేరు గోపాలకృష్ణ' అంది.

★ ★ ★

ఆ రోజు 'శంకర్' విషయంలో చర్చ జరిగిన దగ్గర్నుండి పద్మ- గోపాల్ ముభావంగా వుంటున్నారు. అవసరమైన మేరకు మాట్లాడుకుంటున్నారు.

గోపాల్‌లో అదే ఆలోచన.

శంకర్ నిజంగానే దారుణం చేశాడు.

అయితే అతన్ని చంపేయాలా? పద్మ ఎందుకు పట్టుబడుతోంది?

మనుషులు ఎప్పుడూ ఒకేలా ఎందుకుంటారు? మారతారు. మారటానికే శిక్షల్ని ప్రవేశపెట్టారు. ఒకప్పటి విధానాలు ఇప్పుడు లేవు. జైళ్లు సంస్కరణలకి గురవుతున్నాయి. ఖైదీల విషయంలో సమాజం అనేక కోణాలనుండి ఆలోచిస్తోంది.

ఉరిశిక్ష బదులు యావజ్జీవ కారాగారం విధిస్తే అది శిక్ష కాదా!

అప్పుడు కన్నవారికి, రక్తసంబంధీకులకి, సభ్యసమాజానికి దూరంగా బతకాలి. అది మాత్రం మనిషిని ఎంత బాధిస్తుంది.

'కంటికి కన్ను, పంటికి పన్ను అంటే ఎలా?' అనుకున్నాడు.

పద్మ ఆలోచనలు ఇందుకు భిన్నంగా సాగుతున్నాయి.

ఏది ఏమైనా వాళ్లు ఒకే ఇంట్లో వుంటున్నా దూరం పెరిగిపోతున్న భావం ఇద్దరిలో కలిగింది.




నేను అమ్మమ్మను కలవటానికి వెళ్లాను. అప్పుడు ఇద్దరూ తోటలో కుర్చీలు వేయించుకుని మాటలు చెప్పుకుంటున్నారు.

'కుర్చీ తెచ్చుకో అమ్మాయి' అన్నారు.

నేను వెళ్లి తెచ్చుకున్నాను.

'నువ్వేంటమ్మాయ్? డాక్టర్ అవ్వాలనుకుంటున్నావా?'

'లేదు' అన్నాను.

'ఏం చేయాలనుకుంటున్నావు?'

'నేను సైకాలజీ అంటే ఇష్టపడతాను. భవిష్యత్‌లో నేను రచయిత్రిని అవ్వాలనుకుంటున్నాను.'

'చూడు వరూ... ఎప్పుడన్నా సరదాగా రాసుకోవటం వేరు. అంతేగాని ఇరవైనాలుగు గంటలూ రాయటానికి ఏముంటుంది? మనం రోజూ అన్నం వండుకుంటాం. కూరలు చేస్తాం. చైతన్య కూడా అలాగే కథలు రాస్తుందేమో' అంది అమ్మమ్మ.

'దేవీ... అలా నిరుత్సాహపరచకు. సైకాలజీ చేయాలనుకుంటోంది. కౌన్సిలింగ్ సెంటర్ పెడుతుందేమో. అయినా రచనని వృత్తిగా చేసుకున్నవాళ్లు చాలామంది వున్నారోయ్. ఇప్పుడు ఇంగ్లిష్‌లో రాస్తున్న ఇండియన్ రైటర్స్‌కి కూడా డిమాండ్ వుంది.'

నా కళ్లు ఆనందంతో పెద్దవయ్యాయి.

'నేను కూడా ఇంగ్లిష్‌లోనే రాస్తాను అమ్మమ్మా' అన్నాను.

'చాలా మంచిదిరా. నవల రాయటం కంటే ముందు ప్రమోట్ చేసే ఏజెన్సీలు దొరకాలి. చాలా ప్రముఖ ప్రచురణ సంస్థ లున్నాయి. అయితే నువ్వు 'నాస్టాల్జియా' రాస్తావా? అంది.

'మీకు అంత అద్భుతమైన జ్ఞాపకాలు న్నాయి అమ్మమ్మా. మా జనరేషన్‌కి అసలు బాల్యం ఎక్కడుంది? ' అన్నాను.

సమకాలీన సమస్యల మీద రాస్తే ఒక్కోసారి రిపోర్టింగ్‌లా వుంటుంది. ఎంత వాస్తవ విషయం రాసినా కాస్త కల్పన వుండాలి. అఫ్‌కోర్స్ ఒక్కోసారి జీవితం కల్పనకంటే ఎక్కువ మోతాదులో వుంటుంది. ఇలా జరుగుతుందా అనిపి స్తుంది. నువ్వు వరల్డ్ క్లాసిక్స్ చూస్తే అన్ని రచనలు ఆయా కాలాల్లో రాసినవి కాదు. రూట్స్ రాసింది ఇప్పుడు. కానీ కథాకాలం ఇప్పటిది కాదు. అయినా కూడా ఆ పుస్తకం ఎంత సంచలనం కలి గించిందో తెలుసుగా'

నేను తలూపాను.

'గతం గురించి తెలుసుకోవాలి. అలాగే భవిష్యత్‌ని వూహించిన క్లాసిక్స్ చాలా వున్నాయి. నువ్వు క్రాఫ్ట్‌ని డెవలప్ చేసుకో వటం అవసరం'

'మీరేమన్నా రాశారా'

తను నవ్వేశారు. ఎందుకలా నవ్వారో నాకు అర్థం కాలేదు.

ముగ్గురం ఇంట్లోకి వెళ్లాం. ఇప్పటివ రకూ మా ఇంట్లోవున్న పుస్తకాలు వేరు. ఈ అమ్మమ్మ దగ్గరున్న పుస్తక ప్రపంచం వేరు.

చాలా పురాతనమయిన పుస్తకాల నుండి ఇప్పటివరకూ వస్తున్న ఆంగ్ల పుస్త కాల వరకు ఎన్నో ఉన్నాయి.

'చదవటం నాకు పిచ్చిరా చైతూ' అందామె.

★ ★ ★

అమ్మమ్మా- నేనూ ఆటోలో బయలు దేరాం.

ఓసారి హైదరాబాద్ నగరాన్ని చూపిం చాలనుకున్నాను. అమ్మమ్మ అంగీకరిం చింది.

మేం చార్‌మినార్ దగ్గరికి వెళ్లాం.

అంతకుముందు సినిమాల్లోనూ, ఫొటో ల్లోనూ చూసి వుంటుంది.

అలా నిలబడి చూస్తుండిపోయింది.

'అంత బాగుందా అమ్మమ్మా' అన్నాను.

'దీనిమీద నుండే కదా ముగ్గురమ్మా యిలు దూకి చచ్చిపోయారు' అంది.

అది చాలా సంవత్సరాల క్రితం సంగతి. ఆ మాటకొస్తే చార్‌మీనార్ మీదనుండి ఎంతమంది దూకి చనిపోయారో చార్‌మి నార్‌కే తెలియాలి. నాలుగు శతాబ్దాల చరి త్రలో ఎన్నెన్ని విషాదాలో!

'అదెప్పుడో కదా'

'ఎప్పుడయితే ఏంటమ్మా, చావుని అంత త్వరగా మరిచిపోలేం. సహజంగా వయస యిపోయి చనిపోతే వేరు. ఇలాంటివాటిని చూసినప్పుడు అలాంటివారే గుర్తొస్తారు' అంది.

మేం నడుస్తున్నప్పుడు చెప్పింది.

'ఇప్పుడు మీ అమ్మకి, మీ మావయ్యకి డబ్బులకి లోటు లేకపోవచ్చు. ఒకప్పుడు మీ అమ్మ పెళ్ళి చేయగలనా, మీ మావ య్యకు మంచి ఉద్యోగం వస్తుందా అని భయపడే దాన్ని'

'ఇప్పుడు నీకు ఏ భయాలూ లేవా? '

'ఉన్నాయి'

'ఏమిటా భయాలు? ఎందుకు నువ్వు భయపడాలి? '

'నీ గురించే నా భయం. నీ స్నేహితు

# గబ్బిలంగారి మకరందపానం

'వాడో గబ్బిలాయి' అని కొందరు ఇతరులను ఆటపట్టిస్తుంటారు. నిశాచరులుగా పాడుబడిన మండపాల్లోనో, గుళ్లుగోపురాల్లోనో దాగి కీటకాలతో కడుపునింపుకునే గబ్బిలాలంటే మనకు చిన్నచూపు. అయితే 'గబ్బిలాల యందు ఘన గబ్బిలాలు వేరయా!' అన్న రీతిలో ఇక్కడున్న కరేబియన్ గబ్బిలం.. అడవుల్లో రోజుకొకటి చొప్పున దాదాపు నెలరోజులు, రాత్రిళ్లు మాత్రమే వికసించే ఓ రకమైన అడవి పూల మకరందాన్ని తాగి 'బ్రేవ్' మంటుందిట. తన ఆకలి తీర్చుకోవడమే కాదు, మొక్కల్లో పరపరాగ సంపర్కానికీ తోడ్పడుతుందట. దీని అక్కలాంటి మరికొన్ని గబ్బిలాలైతే ఎంచక్కా సుష్టుగా పళ్లనూ ఆరగిస్తాయి మరి!



రాలిని ఎవరో చంపేశారన్న దగ్గర్నుండి నాకు భయం పట్టుకొంది చైతన్యా' అంది దిగులుగా. ఎప్పటికప్పుడు హాసిని నా కళ్ల ముందుకొస్తూనే వుంది.

'అమ్మమ్మా... నువ్వు అలాంటి భయాలేం పెట్టుకోవద్దు. నేను చాలా జాగ్రత్తగా వుంటాను. నాకు ఏ సమస్య వచ్చినా అమ్మకి, నాన్నకి చెప్పుకొంటాను. ఇప్పుడు నువ్వున్నావు. నీకు చెబుతాను' అన్నాను.

★ ★ ★

'చైతూ... నువ్వు ఈ మధ్య ఆలస్యంగా వస్తున్నావ్ ఎక్కడికి వెళ్తున్నావ్?' అంది పద్మ.

'నేను మా ఫ్రెండ్ ఇంటికి వెళ్తున్నాను.'

'ఏ ఫ్రెండ్ ఇంటికి?' అంది పద్మ.

చైతన్య అమ్మ కళ్లలోకి చూస్తూ అంది 'నువ్వు నన్ను అనుమానిస్తున్నావా?'

'అనుమానం కాదు... తెలుసుకొవటానికి అడుగుతున్నాను.'

'వరూధిని అనే ఫ్రెండ్ ఇంటికి'

'వరూధినా!'

'ఏమిటంత ఆశ్చర్య పోతున్నావ్? వరూధిని నీకు తెలుసా?'

'తెలియదు. ఆ పేరు ఎక్కడో విన్నట్లుంది.'

'వరూధిని ప్రవరాఖ్యుల గురించి నువ్వు కూడా చదువుకొనుంటావు కదమ్మా?'

'అవున్లే, నీచదువు ఎలా వుంది?'

'బాగానే చదువుతున్నాను'

'హాసిని గురించి మీ కాలేజీలో ఏమనుకుంటున్నారు?' అంది.

చైతన్య కొంచెంసేపు అలా నిలబడింది. వెంటనే చెప్పగలిగే స్థితి కాదు. ఫ్రెండ్స్‌కి ఎప్పుడన్నా గుర్తొస్తుంది. ఆ శంకర్‌కి శిక్ష పడినపుడు రెండు రోజులు మాట్లాడుకొన్నారు. మళ్లీ ఎవరి చదువులు వారివి.

'మరిచిపోయారా?' అంది.

చైతన్య తలూపింది.

'ప్రభుత్వం అప్పట్లో ఎక్స్‌గ్రేషియా ఇస్తానని ప్రకటించింది. ఇంతవరకు అది విడుదల కాలేదు. మేం చాలా ప్రయత్నాలు చేస్తున్నాం'

'ఎంత ఇస్తామన్నారమ్మా'

'లక్ష రూపాయలు'

'మీరు ఓ పదివేలు ఖర్చు పెడితే పని అయ్యేదేమో' అంది చైతన్య.

'లంచం ఇవ్వాలా? అది కూడా అన్యాయంగా చంపేసిన ఓ అమ్మాయికి వచ్చే డబ్బుల్లో కూడా లంచమా?' అంది పద్మ.

'లేకపోతే ఇలానే వుంటుంది. లంచం ఇప్పుడు చట్టబద్ధం అయినట్లే లెక్క. పిల్లలకు పెట్టే అన్నంలో, తుఫానొచ్చినప్పుడు చచ్చిపోయేవారికి కిచ్చేడబ్బుల్లో అన్నీ కోల్పోయిన వారికిచ్చే సహాయంలో లంచాలు తింటున్నప్పుడు హాసిని విషయంలో సిగ్గు పడతారా? కలెక్టర్ ఆఫీసులో గుమ్మంలో నిలబడే బంట్రోతు నుంచి మొదలవుతుందమ్మా... మనం అన్యాయం జరిగిందని ఉత్తరం ఇవ్వటానికి కూడా డబ్బులు ఇవ్వందే స్టాంపు వెయ్యరని మా ఫ్రెండ్ చెప్పింది.'

'అప్పుడు కంప్లయింట్ చేయవచ్చుగా. అంతగా అయితే ఏ టీవీ ఛానల్ వారికో చెప్పొచ్చు'

'అప్పుడు దొరికేది చిన్న చేపలే. మనుషులు మారాలి. ఎదుటివారి రక్తం తాగుతున్నామని అనుకోనంతకాలం మనం ఏమీ చెయ్యలేం' అంది చైతన్య.

'సరే. నువ్వు వెళ్లి చదువుకో' అంది.

చైతన్య తన గదికి వెళ్తున్నదల్లా ఆగి వెనక్కి తిరిగింది.

'హాసిని గురించి మీ మహిళా సంఘాల వారు ఏమనుకుంటున్నారు?' అంది.

పద్మ తలూపింది జవాబు చెప్పకుండా.

కత

చతుర కత

# అనుకొన్నదొకటి

కేశవరావుకు తనపేరు రేడియోలో వినపడాలని, తనకంఠం తాను వినాలని ఉబలాటంగా ఉండేది. అలా జరగాలంటే తనలో ఏదో టాలెంటు ఉండాలి కదా! పాడదాం అంటే సంగీతం రాదు. ఏదైనా వాయిద్యం వినిపిద్దామంటే నేర్చుకునేది ఎప్పుడు? తనకి ఛాన్సు వచ్చేది ఎప్పుడు? ఇక ఈ జన్మకి తనపేరు రేడియోలో రావడం కల్ల అని రూఢీ పరుచుకున్నాడు. అయినా ఒక మూల ఆశ మిణుకుమిణుకు అంటున్నది. తనకి తెలిసిన కొందరు మిత్రులు రేడియోలో నాటకంవేస్తూ ఉంటే తనకి ఒక చిన్నపాత్ర ఇవ్వమని వెంటపడ్డాడు. వీడిగోల భరించలేక రెండు నిమిషాల పాత్ర ఇచ్చారు. తీరా రికార్డింగు టైంలో ప్రొడ్యూసర్ ఇతని కంఠం ఆ పాత్రకి తగదు తీసేయండి అన్నారు. దేవుడు వరం ఇచ్చినా పూజారి వరం ఇవ్వని తంతుగా మారింది. కేశవరావుకి కొద్దిగా రచనా నైపుణ్యం ఉంది. పత్రికలకి ఉత్తరాలు, జోక్‌లు వగైరా పంపుతూ ఉంటాడు. పిల్లల కథలు, మినీ కథలు కూడా రాస్తాడు. కనీసం ఈ నైపుణ్యాన్ని అయినా ఎందుకు ఉపయోగించుకోకూడదనే ఆలోచనలో పడ్డాడు. పొద్దున ఆరు గంటలకే భావన అనే కార్యక్రమం వస్తుంది. అందులో ధార్మిక విషయాల గురించి అయిదు నిమిషాలు చెప్పాలి. కేశవరావుకి ఇది నచ్చింది. ఓ పది పుస్తకాలు చూసి 'సత్యము విలువ' గురించి అయిదు నిమిషాలు స్పీచ్ రాశాడు. అది తీసుకొని సంబంధిత అధికారికి రేడియో స్టేషన్లో చూపించాడు. ఆయన ఏ లోకాన ఉన్నాడో ప్రసారం చేయటానికి ఒప్పుకున్నాడు. కేశవరావుకి ఎవరెస్టు ఎక్కినంత ఆనందం కలిగింది. కాంట్రాక్టు ఫారం ఇచ్చారు. రికార్డింగు డేటు, ప్రసారం డేట్లు దాంట్లో రాసి ఉన్నాయి. మిత్రులందరికీ ఆ ఫారం చూపించాడు. తన ఉపన్యాసం తప్పక వినాలని అభ్యర్థించాడు. రికార్డింగు అయిపోయింది. ప్రసార తేదీకి ఎదురుచూస్తున్నాడు. ఇంతలో బుర్రలోలైటు వెలిగింది. పదిమంది మెచ్చుకుంటున్నట్టు ఉత్తరాలు రాస్తే మళ్ళీ చాన్సు ఇస్తారుట. చాలామంది తమ ఉత్తరాలు రాసి పోస్టులో వేస్తారుట. తను మాత్రం ఆ పని ఎందుకు చేయరాదు. తక్షణం పోస్టాఫీసుకు వెళ్ళి యాభై కార్డులు కొనుక్కొచ్చాడు. ఒకే దస్తూరి ఉంటే గుర్తుపడ్తారని ఇంటి వాళ్లందరితో తన ఉపన్యాసం బాగుందని రాయించాడు. అవన్ని మిత్రులకి పంచి తన ఉపన్యాసం అయిన తెల్లారి సంతకాలు చేసి పోస్టులో వేయమన్నాడు. ఆ రోజు రానే వచ్చింది. అయిదు గంటలకే లేచి రేడియో



దగ్గర పెట్టుకు కూచున్నాడు. 'అనివార్య కారణాల వల్ల కేశవరావుగారి భావన వినిపించలేకపోతున్నాం. త్వరలోనే ప్రసారం చేస్తాం' అని అనౌన్సరు చెప్పేసరికి కేశవరావు గాలి తీసిన బెలూన్ అయిపోయాడు. ఎవరో ఒకరిద్దరు తప్ప మిగతావాళ్ళు ఎవరూ ఆ ప్రకటన వినలేదు. మర్నాడు కేశవరావు చెప్పినట్టు అందరూ ఉత్తరాలు పోస్టు చేశారు. నాలుగు రోజుల తరువాత కేశవరావు మెల్లగా రేడియో స్టేషనుకువెళ్ళి సంబంధిత అధికారిని తన ప్రసంగం ఎప్పుడు ప్రసారం చేస్తారని అడిగాడు. అందుకు ఆయన 'ప్రసారం చేశాం కదయ్యా' ఇదిగో నిన్ను మెచ్చుకుంటూ రాసిన ఉత్తరాలు అని ఉత్తరాల కట్ట ముందర పడేశాడు. కేశవరావు ముఖాన నెత్తురు చుక్క లేదు. తేలుకుట్టిన దొంగ మాదిరి బయటపడ్డాడు. అనుకున్నదొకటి అయినదొకటి అని మళ్ళీ రేడియో జోలికి పోలేదు.

–కె. రామారావు

'హాసిని వాళ్ల కుటుంబ సభ్యులు ఎక్స్ గ్రేషియా తీసుకుంటారో లేదో కనుక్కోండమ్మా. మీరు ఇంత యుద్ధం చేసి తీసుకున్నా వాళ్లు వద్దనవచ్చు' అంది చైతన్య.

పద్మ ముఖంలో రంగులు మారాయి.

★ ★ ★

పద్మ హాసిని వాళ్ల ఇంటిని వెతుక్కుంటూ వెళ్లింది.

'మీరూ...' అంది హాసిని తల్లి.

'నా పేరు పద్మ. మహిళా సంఘంలో పని చేస్తుంటాను. హాసిని హత్య విషయంలో మహిళా సంఘాల తరఫున మేం పోరాటం చేశాం' అంది. ఆమె 'పద్మను చూశానా' అని గుర్తు తెచ్చుకొనటానికి ప్రయత్నం చేస్తూ, 'రండి, కూర్చోండి' అంటూ లోపలికి ఆహ్వానించింది. మంచి నీళ్లు తెచ్చి యిచ్చింది.

తాగి గ్లాసు అందిస్తూ 'థ్యాంక్స్' అంది.

'టీ పెడతాను'

'ఇప్పుడేం వద్దండి' అని ఇంటికేసి చూసింది. ఆ తర్వాత 'పిల్లలు లేరా?' అంది.

'బాబు బయటకు వెళ్లాడు. చిన్నమ్మాయి మా బంధువుల ఇంటికి వెళ్లింది' అందామె. ఆమె ముఖంకేసి చూసింది. ఎలాంటి ఉద్వేగాలు లేకుండా ప్రశాంతంగా కనిపించింది. ఓ పక్కన హాసిని ఫొటో వుంది బ్లాక్ అండ్ వైట్‌లో. అది కూడా పది సంవత్సరాలప్పుడు తీసిందయి వుంటుందనిపించింది.

అప్రయత్నంగా లేచి వెళ్లింది పద్మ. ఫొటోకి దండవేసి వుంది. ఫొటో ముందు పూలు ఉన్నాయి. హాసినిని

చూస్తుంటే పాత సినిమాల్లో హీరోయిన్లు గుర్తుకొచ్చారు. నర్గీస్, మీనాకుమారి, సావిత్రిలా వుంది.



ఆ కళ్ళలో నిర్మలత్వం, కాస్త బెరుకు ఇవన్నీ కలగలిసిన ఓ సౌందర్యం వుంది. హాసిని అప్పుడే విచ్చుకున్న మల్లెపువ్వులా వుంది. ఆ ఫోటో ముందుంచిన తాజా పూలు హాసినిలో తమనుతాము చూసు కుంటున్నట్లు అనిపించింది.

పద్మ కళ్లలో నీళ్ల తిరిగాయి

ఎందుకో చైతన్య గుర్తొచ్చింది. హాసిని బతికివుంటే ఎంత బాగుండేది అనిపించింది. ఆమె ఫోటో నుండి అనంతమైన విశ్వంలోకి ప్రయాణం చేస్తున్నట్లు అనిపించింది.

ఎక్కడి నుండో ఓ ఆర్తనాదం, ఓ రక్తపు వెల్లువ. ఆ తర్వాత పెను ఘోష.. ఎందరెందరో స్త్రీల ఆర్తనాదాలు.

అలా కొంచెం సేపు నిలబడి పోయింది.



పద్మ కళ్ళను కొంగుతో అద్దుకొంది. వెనక్కి తిరిగివచ్చి చెక్క కుర్చీలో కూర్చుంది. పూలు తలలో పెట్టుకోవాల్సిన ఓ ఆడపిల్ల ఫొటో ముందు పూలు వుంచాల్సిన దుస్థితి రావటం, ఆ కుటుంబపు విషాదం మాత్రమే కాదు.

ఆలోచనల్లోకి జారిపోయిన పద్మను ఎలా పలకరించాలో హాసిని తల్లికి తెలియటం లేదు. అప్పుడే 'అమ్మా' అంటూ లోపలికి వచ్చింది లయ.

పద్మ ఆ పిలుపుతో ఈ లోకంలో పడింది. పద్మను చూసి ఆగిపోయింది లయ. 'మా చిన్నమ్మాయి లయ' అని పరిచయం చేసింది.

'నమస్కారమండి' అంది లయ.

'నువ్వు వెళ్లి చదువుకోమ్మా' అని లయను పంపించింది.

'మీరు చైతన్య అమ్మ కదా' అందామె గుర్తొచ్చి. అవునని పద్మ తలూపింది.

'వంట చేస్తాను' అంది ఆమె.

'వంట విషయం తర్వాత. నేను మీతో ఓ విషయం మాట్లాడాలని వచ్చాను' అంది పద్మ.

'చెప్పండి'

'హాసిని కుటుంబానికి ఎక్స్‌గ్రేషియా ఇవ్వాలని మేము ప్రభుత్వంతో పోరాడుతున్నాం' అంటుండగానే...

'అదెందుకమ్మా' అందామె.

'హాసిని మీ కుటుంబానికి ఆధారం. ఆమె మరణం వల్ల మీ కుటుంబం అన్ని రకాలుగా నష్టపోయింది. ఆ నష్టమంతా పూడ్చటం ఎవరికీ సాధ్యం కాదు. కనీసం ఎక్స్‌గ్రేషియా వస్తే మీ పిల్లల చదువులకి ఉపయోగపడుతుంది కదా'

అప్పుడొచ్చాయి హాసిని తల్లికి కన్నీళ్లు. పద్మ మనసంతా బాధతో కుంచించుకుపోయింది.

'మిమ్మల్ని బాధపెడితే...' అని ఆగింది పద్మ.

ఆమె కన్నీళ్లు తుడుచుకుని....

'మీరు మాకు మంచి చేయటానికే చూస్తున్నారు. మీరు బాధ పెట్టటం ఏమిటమ్మా! అయితే నా కూతురు ఆత్మహత్య చేసుకోలేదు. ఆత్మహత్యలు చేసుకుంటున్న రైతులున్నారు. చేనేత కార్మికులుంటున్నారు. ఇంకా ఎందరెందరో పేదలున్నారు. వారికి ఇవ్వాల్సిన ఎక్స్‌గ్రేషియా మాకెందుకమ్మా' అంది గాద్గదికంగా.

**'హాసిని పేరు మీద డబ్బులు తీసుకుంటే, అతను మడ్డు కత్తితో నా బిడ్డను హత్య చేసినట్లు కాదు. మేం చేసినట్ల వుంతుంది'**

మళ్లీ తనే - 'హాసిని పేరు మీద డబ్బులు తీసుకుంటే, అతను మడ్డు కత్తితో నా బిడ్డను హత్య చేసినట్లు కాదు. మేం చేసినట్లవుంతుంది'

'మీరు అలా అనకండి. మీ ఆర్థిక పరిస్థితి అంతంత మాత్రంగా వుంది. అయినా ప్రభుత్వం యిచ్చేది ప్రజల డబ్బు. ఎందరెందరో ప్రజల డబ్బుని తినేస్తున్నారు. మీరు అలా చేయటం లేదు. నిజంగానే మీ కుటుంబానికి అన్యాయం జరిగింది.'

'నేను కూడా అదే అంటున్నానమ్మా. అది ప్రజల డబ్బు. మా అమ్మాయి చదువుకుంటుందంటే ఎంతో కొంత ప్రజల డబ్బుని వినియోగించుకున్నట్లే. మేం పిల్లల్ని కన్నది చదివించుకోవటానికి. వాళ్ల కాళ్లమీద వాళ్లు నిలబడటానికి. మీరు మా గురించి ఆలోచిస్తున్నారు. నేను కాదనను. నా బిడ్డ ప్రాణాలు నాకు కావాలి. ఎవరైనా తెచ్చి ఇవ్వగలరా? అందుకే మీరు దయచేసి అలాంటి ప్రయత్నం చేయకండి. ఆ డబ్బులు మాకొద్దు. మా మానాన మేం బతుకుతున్నాం' అంది హాసిని తల్లి.

పద్మ మాట్లాడలేకపోయింది.




'అమ్మా చైతూ' అంటూ గదిలోకి వచ్చాడు గోపాల్.

'ఏంటి నాన్నా'

'అమ్మ ఎక్కడికి వెళ్ళింది' అన్నాడు.

'ఊరెళ్తానని చెప్పింది. మీకు చెప్ప లేదా? ' అంది.

'నాకు తెలియదు. తనకి అర్జెంట్ పని వుండుంటుందిలే' అన్నాడు.

'అయినా మీకు చెప్పవచ్చు. సెల్‌ఫోన్ వుందిగా'.

'వెంటనే వచ్చేయొచ్చనుకునుంటుంది. నువ్వు ఫోం చేశావా? ' అన్నాడు.

'లేదు నాన్నా'

'మనిద్దరం ఫోం చేద్దామా? ' అన్నాడు. తలూపింది. ఫోం చేస్తున్నప్పుడు అడిగింది 'నాన్నగారు ఈ మధ్య సినిమాల్లో జంతువుల్ని హింసించితే ఊరుకోం' అంటున్నారు. ఆ సినిమాల్ని సెన్సార్ చేయమంటున్నారు. జంతువులు మన జీవితంలో భాగం కదా. వాటిని కథల్లో చూపించాల్సిన అవసరం వచ్చినప్పుడు ఏం చేయాలి? '

'ఇప్పుడు గ్రాఫిక్స్ వచ్చాయి కదా. వాటిని ఉపయోగించుకోవచ్చు' అన్నాడు మామూలుగా.

'అందరూ గ్రాఫిక్స్ చేయించగలరా నాన్నా. కొన్ని లక్షల రూపాయలు కావాలి. చిన్న చిన్న సినిమాలు తీసేవారికి అది కుదురుతుందా? అసలు మన పిల్లల కథలన్నీ పక్షుల ద్వారా, జంతువుల ద్వారా చెప్పించేవే. ఇలాంటివన్నీ ఎందుకొస్తున్నాయి' అంది చైతన్య.

'మనుషులయితే నటిస్తారు. జంతువులకి కష్టం. వాటిని హింస పెట్టి నటించేలా చేయటం మంచిదికాదని కొన్ని సంఘాలవారి అభ్యంతరం'.

'అంటే మనుషుల్ని హింసించ వచ్చా? ' అంది.

గోపాల్ కూతురు కళ్లలోకి చూశాడు.

'అవును నాన్నా. సినిమాల్లో ఫైటింగ్ దృశ్యాలు తీస్తున్నప్పుడు ప్రమాదంలో చాలామంది చచ్చిపోతారు. మరి అలాంటివి ఎందుకు ఒప్పుకుంటున్నారు. మనిషి ప్రాణాలు తప్ప ఇంకేదయినా గొప్పదా? చివరికి రాళ్లను బద్ధలు కొడతామన్నా.. కొన్ని సంఘాల వారు ఒప్పుకోవడం లేదు. బండరాళ్లపాటి విలువ చేయదా మనిషి? ' అంది.

గోపాల్‌కి నవ్వొచ్చింది.

'ఎందుకు నాన్నా నవ్వుతారు? ఇది నవ్వాల్సిన విషయమా!' అంది కాస్త కోపంగా.

'నేను వ్యంగ్యంగా నవ్వలేదమ్మా. మనుషులకి నోరుంది. పక్షులకీ, జంతువులకీ నోరులేదు. అలాగే చెట్లకీ, రాళ్లకీ కూడా. అందుకే వాటి తరపున కొంత మంది పోరాడుతుంటారు'.

'నేను అనేది కూడా అదే. నిజానికి నోరు లేనిది సామాన్య జనానికి. పశువుల్తో మనకు అనుబంధం వుంటుంది. వాటి గురించి ఓ మంచి సినిమా తీయాలనుకున్నప్పుడు వాటికి ట్రైయినింగ్ ఇప్పించి నటింపచేస్తాడు. నేర పరిశోధనకి కుక్కల్ని ఉపయోగించుకుంటున్నారు. అది





కూడా హింసే కదా.'

'హింసే...'

'ఇలాంటి వాటిని మీరెందుకు వ్యతిరేకించరు'

'చైతూ... ఏ మనిషయినా ప్రపంచంలోని అన్ని అన్యాయాల మీద యుద్ధం చేయటం కష్టం. అందుకే రకరకాల సంఘాలు. ప్రకృతి సిద్ధంగా ఏర్పడ్డ రాక్స్ని ధ్వంసం చేసుకుంటూపోతే ఎకలాజికల్ బ్యాలన్స్ దెబ్బతింటుందని వాళ్ల అభిప్రాయం. అయినా జంతువులతో నటింపచేయవద్దంటే అది పొరపాటని ఇంకో ఉద్యమం చేయటమే. జీవితంలో అన్ని రకాల పోరాటాలుంటాయి'

'డబ్బున్న వాళ్లు రాళ్లని మింగేస్తారు. రత్నాల్నీ మింగేస్తారు. వాళ్లనేమీ చేయలేరు. చివరికి ఇదంతా సామాన్యుడ్ని యిబ్బంది పెట్టటానికే. గ్రాఫిక్స్ కంపెనీలవారిని, పెద్ద నిర్మాతల్ని, హీరోల్ని బాగుచేయటానికి ఇలాంటివి ఉపయోగపడుతున్నాయి. నా పాయింట్ ఒకటే. మనిషి ప్రాణాలూ - ప్రయోజనాలూ విలువయినవా? కావా?'

గోపాల్ కొంతసేపు ఆలోచించాక అన్నాడు.

'విలువైనవే. మనిషితో పాటు ప్రకృతిలోని ప్రతీదీ విలువైందే. ఓ డ్యామ్ కట్టాలనుకున్నప్పుడు ఊర్లు పోతాయి. జ్ఞాపకాలు పోతాయి. అడవులు పోతాయి. అందాలు పోతాయి. అక్కడ మనం చూడాల్సింది వాటివల్ల మనుషులు ఎంత నష్టపోతున్నారని. జనానికి ఎక్కువ మేలు జరిగేటప్పుడు ఇవన్నీ పోయినా తప్పదు. భరించాలి. అల్టిమేట్‌గా మానవుడే ప్రధానం' అన్నాడు.

చైతన్య ఇంక మాట్లాడలేదు.

★ ★ ★

లయా, పద్మ వున్నారు ఆ గదిలో

పద్మ అక్కడే భోం చేసింది. సుధీర్ వచ్చాక మాట్లాడి వెళ్లాలని అనుకొంది.

'మీ అక్క విషయంలో ప్రభుత్వం ఎక్స్‌గ్రేషియా ఇస్తామని ప్రకటించింది. దాని మీద నీ అభిప్రాయం ఏమిటి?' అంది.

ఒక్కసారిగా ఆ అమ్మాయి ముఖంలో అసంతృప్తి- అసహనం కనిపించి మాయం అయ్యాయి.

'ఈ దేశంలో మంత్రులే ఎక్స్‌గ్రేషియా కోసం రైతులు ఆత్మహత్య చేసుకుంటున్నారని అన్నప్పుడు రేపు మమ్మల్ని ఏమంటారు. మాకు కావలసింది డబ్బులు కాదు, న్యాయం. మీకు చేతయితే అక్కకు జరిగిన అన్యాయానికి న్యాయం జరిగేలా చూడండి. అక్కను చంపేశాక దానిమీద వచ్చే డబ్బుతో నేను చదువుకోవటమో, పెళ్లి చేసుకోవటమో చేస్తే అంతకంటే హీనమైన పని ఇంకోటి వుండదు. మేం బతకలేకపోతే ఇంత విషం మింగి చస్తాం తప్ప, ఆ నీచమైన డబ్బు మాకు అవసరం లేదు' అంది లయ.

సాయంకాలనికి సుధీర్ వచ్చాడు. పద్మను చూడగానే అతని ముఖంలో అప్రసన్నత కనిపించింది.

సుధీర్‌తో ఎక్స్‌గ్రేషియా విషయం చెప్పింది.

'ఆంటీ... నేను చాలా రోజుల క్రితం జరిగిన విషయం చెబుతాను- ఊరేగింపు చేస్తున్న రైతుల మీద పోలీసుకాల్పులు జరిగాయి. అప్పుడు ఇద్దరు రైతులు చచ్చిపోయారు. అప్పుడు ప్రభుత్వం నష్ట పరిహారం ఇస్తానంది. అప్పుడా రైతు భార్య ఏమందో మీకు గుర్తుందా...' అని ఆగాడు.

పద్మలో మళ్లీ అదే ఆశ్చర్యం

'నా భర్తని కాల్చి చంపిన వాడ్ని మీరు కాల్చి చంపండి. వాడి కుటుంబానికి నేనిస్తాను ఎక్స్‌గ్రేషియా'.

నిశ్శబ్దం.

# క్రూరజంతువుల డాక్టర్

వెటర్నరీ డాక్టర్ అనగానే సాధారణంగా కుక్కలు, పిల్లులు, గేదెలు లాంటి సాధు జంతువులకి చికిత్స చేస్తూంటాడు. కాని, అమెరికాలోని డాక్టర్ మైఖేల్ గ్లీసన్ మాత్రం వీటి జోలికి పోకుండా కేవలం క్రూర జంతువులకే చికిత్స చేయడం తన వృత్తి నియమంగా పెట్టుకున్నాడు.






పులి, సింహం, కొండ చిలువ, త్రాచు పాము లాంటి ప్రాణాంతకమైన జీవులని పెంచుకునే మోజు అమెరికాలో చాలా మందికుంది. వీటి పెంపకం మీద అమెరికాలోని చాలా రాష్ట్రాల్లో ఎలాంటి నియంత్రణ లేకపోవడం ఇందుకు కారణం. అయితే అలాంటి జంతువులకి చికిత్స చేయడంలో అనుభవం గడిస్తే అది తన వృత్తికి ఉపకరిస్తుందని డాక్టర్ మైఖేల్ ఈ మార్గం ఎన్నుకున్నాడు. అమెరికా అంతా తిరుగుతూ ఇతను పెంపుడు క్రూర జంతువులకి చికిత్స చేస్తూంటాడు.

★ ★ ★

నేను 'వరూధిని' గారింటికి వెళ్లాను. అమ్మమ్మ ఇంటికి వెళ్లి పోతానంటోంది.

'ఏరా చైతూ... హాసిని నీ ఫ్రెండ్ అంటకదా' అందామె ఆకస్మాత్తుగా.

'హాసిని మీకు తెలుసా అమ్మమ్మా?'

'వ్యక్తిగతంగా తెలియదు. పత్రికల ద్వారానే తెలుసు' అని చెప్పింది.

'అవునమ్మమ్మా వాళ్ల ఇంటికి వెళ్లాను. హాసిని అమ్మా, తమ్ముడు, చెల్లెలు కూడా నాకు తెలుసు' అన్నాను.

'హాసినిని చంపిన అబ్బాయికి ఉరిశిక్ష వేశారు కదా... అదేంటోనమ్మా ప్రపంచదేశాల్లో మరణశిక్షలు తగ్గుతుంటే భారతదేశంలో ఈ సంఖ్య పెరుగుతోంది. నీకు ధనుంజయ ఛటర్జీ గుర్తున్నాడు కదమ్మా' అంది.

'అతనెవరు వరూ' అంది అమ్మమ్మ.

'పధ్నాలుగు సంవత్సరాల పిల్లను దారుణంగా రేప్ చేసి చంపేశాడు. అతనికి ఉరిశిక్ష వేశారు. ఎప్పటికప్పుడు ఆ శిక్ష అమలవుతుందా లేదా అని అతను ఆందోళన పడుతున్నాడు'

'ఇంకా అది అమలు కాలేదా?' అంది అమ్మమ్మ.

'లేదు. రాష్ట్రపతికి క్షమాభిక్ష కోసం విన్నవించారు. ఏం జరుగుతుందో చూడాలి' అంది వరూధిని అమ్మమ్మ.

అమ్మమ్మ వెంటనే మాట్లాడలేకపోయింది.

'ఎందుకింత ఆలస్యం... త్వరగా నిర్ణయం తీసుకుంటే బాగుంటుంది' అన్నాను.

'భారతదేశం లాంటి పెద్ద దేశంలో అదంత సులభం కాదమ్మా. ఒక్క మరణ శిక్షలే కాదు, ఏ కేసు పరిష్కారం కావాలన్నా చాలా సమయం తీసుకొంటుంది'

'మనుషులు ఇంత రాక్షసంగా తయార



వుతున్నారేంటి వరూ' అంది అమ్మమ్మ.

'ఏం చెప్పమంటావు? చాలా కారణాలున్నాయి. మూడు వందల మందికి పైగా మరణశిక్షలు అమలు చేయాల్సి వుంది' అంది ఆమె.

నేను ఉలిక్కి పడ్డాను.

'మనం ఆలోచిస్తూ పోతే మనసుకి బాధ తప్పితే ఏమీ మిగలదు. చనిపోయిన వారి గురించి ఆలోచించాలా... చనిపోబోతున్న వారి గురించి ఆలోచించాలా దేవీ'

'నేనేం చెప్పను వరూ... ఏదో ఓ మూల బతుకుతున్నాను. ఎప్పుడన్నా ఇలాంటివి వింటుంటాను. ఏమైనా మన దాకా వస్తేగాని తెలియదంటారు. చిన్న చిన్న వాటినే మనం తట్టుకోలేం. వీటినేం భరించగలం' అంది అమ్మమ్మ.

'దేవీ... నువ్వు కూడా మారాల్రా' అంది ప్రేమగా.

అమ్మమ్మ మాట్లాడలేదు.

'పద్మ మీదగాని, నీ కొడుకు మీదగాని అంత పట్టుదల అవసరమా? ఆలోచించు' అంది. అమ్మమ్మ వరూధినిగారిని ఏమీ అనలేదు తల ఊపిందంతే.

'చైతన్య నువ్వు నవల రాయాలనుకుంటున్నావు కదా. మనందరం ఉరిశిక్ష పడినవారి గురించి ఆలోచిస్తుంటాం. ఉరి తీసే 'తలారి' మానసిక పరిస్థితి ఎలా వుంటుందంటావ్? ' అన్నారామె అకస్మాత్తుగా.

నేను ఎప్పుడూ ఆలోచించలేదు. ఆ విషయమే చెప్పాను.

'నా దగ్గర కొన్ని ఫిలింస్ వున్నాయి. ఇంకా ఈ నేరాలకు సంబంధించిన మెటీరియల్ చాలా వుంది. నీకు తీరిక దొరికినప్పుడు రా... అవన్నీ ఇస్తాను. ఏది ఏమైనా నీకు చదువు ముఖ్యం. నువ్వు బాగా చదువుకొంటే ఇలాంటివన్నీ ఇంకా బాగా అర్థం చేసుకోవచ్చు. నువ్వు డిగ్రీలో నీకు ఇష్టమైన సబ్జెక్టే తీసుకో' అంది.

'అలాగే అమ్మమ్మా' అన్నాను.

'మీ అమ్మమ్మ లేదని రాకుండా మానకు. నీకు ఎప్పుడు తీరిక దొరికినా వస్తుండు' అంది.

అమ్మమ్మను నేనే బస్‌స్టేషన్‌కు తీసుకు వెళ్లాను.



గదిలోకి వచ్చిన పద్మను చూసి, 'ఊరెళ్లా వంటకదా, మహిళా సంఘం పని మీదా' అన్నాడు గోపాల్.

'కాదు నేను హాసిని వాళ్ల కుటుంబాన్ని చూడటానికి వెళ్లాను' అంది.

'అలాగా...' అన్నాడు.

'అప్పట్లో ప్రభుత్వం ఎక్స్‌గ్రేషియా ఇస్తానంది. ఆ ఫైల్ ఇంతవరకు కదల్లేదు'

'బ్యూరోక్రసీ కదా. అలానే వుంటుంది.'

'వాళ్లు మాత్రం మాకు ఎలాంటి సహాయం అవసరం లేదన్నారు' అంది.

'వద్దన్నారా? ' ఆశ్చర్యంగా అన్నాడు.

'వద్దన్నారు. వద్దనటానికి తగ్గ ఆర్థిక పరిస్థితేం కాదు. కానీ అభిమానం ఉన్న మనుషులు. వాళ్లకు న్యాయం కావాలి'

'అంటే శంకర్‌ని ఉరి తియ్యాలి. అంతే కదా'

'గోపాల్... అంతే కదా అని తేలిగ్గా తీసేయకు. నువ్వు మాట్లాడే తీరు అదేదో మన చేతుల్లో వున్నట్లుంది. శంకర్‌ని ఉరి తీస్తారో, తియ్యరో వాళ్లకు తెలియదు. తమ బిడ్డ ఓ దుర్మార్గుడి చేతిలో చచ్చిపోయింది. అందుకు ప్రభుత్వం గానీ, సమాజం గానీ, ఏం సమాధానం చెబుతుందనేది వారి ప్రశ్న' అంది పద్మ.

'ఈ విషయం మీద మనకు ఘర్షణ అవసరమా? ' అన్నాడు.

'అంటే... మీ ఉద్దేశం ఏమిటి? '

'అది కాదు పద్మా! నువ్వు నీ పద్ధతిలో

పోరాడుతున్నావు. మేం మా పద్ధతిలో ముందుకు వెళ్తున్నాం. నీది ఓ రకంగా చిన్న పరిధి. వ్యక్తులకు మాత్రం పరిమితం అవుతున్నావు. మేం చాలా దూర దృష్టితో ఉన్నాం' అన్నాడు.

'వ్యక్తులకు పరిమితం అయ్యానా... 'వ్యక్తిగతం' అంటూ వుంటుందా. అందులోనూ రాజకీయం వుంది. ఎంతయినా నువ్వు మగాడివికదా. అలాగే మాట్లాడతావు' అంది పద్మ.

'పద్మ ఇక్కడ జెండర్ సమస్యని తీసుకొస్తున్నావా? అర్థం వుందా మాట్లాడటానికి' అన్నాడు.

'నీకు అర్థం లేదేమో, నాకుంది. నీకు అంటే.. మీ మగాళ్లకు యిబ్బంది కలగనంతవరకు ఆడవాళ్లు ఏం మాట్లాడినా, ఏం రాసినా సమర్థిస్తారు. అభ్యుదయ వాదులూ, విప్లవవాదులూ అని పేరు రావాలి కదా. ఇప్పటివరకూ ఎంతమంది ఆడవాళ్లను ఉరి తీశారో చెప్పగలవా?' అంది.

ఊహించని ఈ ప్రశ్నకు గోపాల్ బిత్తరపోయాడు.

'ఈ ఉరిశిక్ష కేసులన్నీ మగవాళ్లవే. ఎక్కువ భాగం స్త్రీలమీద జరిపిన దాడులే. వీటిలో దారుణంగా చనిపోయింది ఆడవాళ్లే. ఓ రాజీవ్‌గాంధీ కేసులో 'నళిని' వుంది. ఇంకొన్ని కేసుల్లో ముగ్గురు నలుగురుండవచ్చు. మిగతా వారంతా మగవాళ్లేగా' అంది ఉద్వేగంగా.

గోపాల్ పద్మకేసి సీరియస్‌గా చూస్తున్నాడు.

'ఏంటలా చూస్తావు? హాసిని విషయంలో కులం రాలేదా... అప్పుడు నువ్వు మాట్లాడావా? ఇది తప్పన్నావా? ఇంకా నయం. హాసిని, శంకర్‌లది వేరే మతం కాదు. వేరే ప్రాంతాలు కావు. కాబట్టి సరిపోయింది. లేకపోతే అవి కూడా ముందు

కొచ్చేవి. ఈ దేశంలో ఏ పని చేసినా, ఎంత దుర్మార్గం చేసినా శిక్షలు పడవనే అభిప్రాయం ఉంది. అందుకే ప్రతిరోజూ, ప్రతి నిమిషం ఆడవాళ్లని శారీరకంగానో, మానసికంగానో మగవాళ్లు హింసిస్తు న్నారు' అంది.

'దానికి ఇంత రాద్ధాంతం ఎందుకు. ఎవరి పద్ధతుల్లో వాళ్లు ముందుకు వెళ్దాం'

'అలా వెళ్లాలంటే మనం కలిసి ఉండటం కుదరదు' అంది.

'పద్మా' అన్నాడు ఆశ్చర్యంగా.

'అవును గోపాల్. ఇది ఒక్క హాసిని సమస్య అయితే నేను పట్టించుకునే దాన్ని కాదు. ఇది ఆడవాళ్ల సమస్య. ఇదే చిట్ట చివరిదైతే శంకర్‌ని నేనూ క్షమించమని అడిగేదాన్ని. ఇది మొదటిది కాదు. ఆఖరిది కాదు. ఇలా నరుక్కుంటూ పోయే వారినందరినీ క్షమిస్తూ పోతే మమ్మల్ని వెక్కిరించినట్లుగా భావిస్తాం. నన్ను చూడ గానే సుధీర్ కళ్లలో ఎలాంటి భావం కని పించిందో నాకు గుర్తొస్తున్నకొద్దీ గిల్టీగా ఉంది'.

'నువ్వేం నేరం చేశావని నీకంత గిల్టీ ఫీలింగ్ వుండాలి' అన్నాడు గోపాల్.

'నేరం మన కుటుంబం చేస్తోంది కాబట్టి'

'అంటే నేను చేస్తున్నాననేగా'

'నువ్వు చేస్తున్నావో లేదో నాకు తెలి యదు. అది నేరమా కాదా? అనేది కాదు చర్చ. శంకర్ విషయంలో నువ్వు చేసేది తప్పు'

'అంటే నన్ను సంఘం నుంచి బయటకు రమ్మంటావ్.'

'నువ్వు బయటకు వస్తావో. సంఘం లోనే ఉండి యుద్ధం చేస్తావో నాకు తెలి యదు. నేను శంకర్‌కి శిక్ష పడాలని కోరు కుంటున్నాను. నువ్వు రద్దు కావాలంటు న్నావు. అందుకే మనం విడిగా ఉండి ఈ యుద్ధం చేద్దాం. అది సరైంది కూడా' అంది.

'నన్ను ఎమోషనల్ బ్లాక్ మెయిల్ చేస్తున్నావా?'

'నువ్వు అలా అనుకుంటే నేను చేయగ లిగిందేం లేదు. మన ఇద్దరి మధ్య ఉన్నది చిన్న వైరుధ్యం కాదు. అందుకే నేను దూరంగా ఉంటాను'.

'చైతూ నేం చేస్తావు?'

'నేను చేయటం ఏమిటి? అదేం చిన్న పిల్లకాదు. ఏం చేయాలో తను నిర్ణయిం చుకుంటుంది' అంది పద్మ.

★ ★ ★

మొదట నేను ఇది నమ్మలేదు.

అమ్మా-నాన్నలు ఇద్దరూ సీరియస్‌గా మాట్లాడుకుంటున్నారు. అప్పుడు నేను బయటకు వచ్చాను. వారి గొడవేమిటో విందామా, వద్దా అని కొంచెం సేపు వూగి సలాడాను. అయినా నాకు ఇదేం కొత్త విషయం కాదు. అప్పుడప్పుడు వాళ్లిద్దరూ అలా సీరియస్‌గా వాదించుకోవటం మామూలే. ఆ తర్వాత కలిసిపోతుం టారు.

ఈసారి అలా జరగలేదు.

'చైతూ.. నేను ఓ ఇల్లు చూసుకుంటు న్నాను' అంది అమ్మ

'నువ్వు ఇల్లు చూసుకోవటం ఏమిటి? నాన్నకూ-నీకూ ఏమైనా గొడవ జరి గిందా?'

'అవును, హాసిని విషయంలో మేం ఇద్దరం ఒకరితోఒకరం విభేదిస్తున్నాం. అందుకే మేం కలిసి ఉండటంలో అర్థం లేదనిపించింది. నేను విడిగా వుంటాను' అంది.

'నిజంగానా' అన్నాను.

'నేను నీకు అబద్ధం చెబుతానా?'

'నాన్న ఏమన్నారు?'

'ఏమీ అనలేదు. ఈ విషయంలో

## మంచి 'రాకాసి'

ఈ చిత్రం ఏదో గ్రహాంతరవాసిలా ఉందా? అదేంకాదు.. సాలమండర్ జాతికి చెందిన ఉభయచరం. ఇది మెక్సికోలో కనిపిస్తుంది. దీని ప్రత్యేకతేమంటే- జీవితాంతం ఇలాగే పూర్తిగా ఎదగని దశలోనే ఉంటుంది. లార్వాదశలోనే ఈ జీవులు ప్రత్యుత్పత్తిని కూడా జరుపుతాయంటే మీరు నమ్మక తప్పదు. ఈ జీవిని అక్కడి వారు అక్సొలాట్ అని పిలుస్తారు. అంటే నీటి రాకాసి అని అర్థం. పేరుకే రాకాసిగాని, ఇది ఎవరికీ ఏ హానీ చేయదు.





ఎవరం రాజీ పడదలుచుకోలేదు. నేను నీకు ఈ విషయం చెప్పాలి. నువ్వు అమ్మ దగ్గరుంటావో, నాన్న దగ్గరుంటావో నిర్ణయించుకో. ఎవరి దగ్గరున్నా ఫర్వాలేదు. నీ చదువు విషయంలో గాని, భవిష్యత్ విషయంలో గాని ఎలాంటి ఆందోళన పడాల్సిన అవసరం లేదు. ఇప్పటికిప్పుడు చెప్పమని నేను అనను' అంది.

'నేను ఆలోచించుకుంటాను'

'మంచిది చైతూ' అంది అమ్మ.

తను ఇల్లు చూసుకునే పనిలో ఉండిపోయింది.

ఇంత త్వరగా ఇలాంటి మార్పు వస్తుందనుకోలేదు.

నాన్న నన్ను టాంక్‌బండ్ మీదికి తీసుకు వెళ్లారు.

'అమ్మ నీతో మాట్లాడిందా?' అన్నారు.

'మాట్లాడింది నాన్నా' అన్నాను.

'మీ అమ్మ ఈ విషయాన్ని వ్యక్తిగతంగా తీసుకుందో, సిద్ధాంత పరంగా తీసుకుందో నాకు తెలియదమ్మా. నేనయితే 'శంకర్'కి యావజ్జీవ కారాగారశిక్ష చాలని అనుకుంటున్నాను. ఓ మనిషిని చట్టం ద్వారా చంపటం అనేది నా దృష్టిలో దారుణమే. అలా అని హాసిని మీద నాకు సానుభూతి లేదనుకోవద్దు. ఆ అమ్మాయికి చాలా అన్యాయం జరిగింది. అయితే అదే పని మనం చేయవచ్చా...'

'నాన్నా' అన్నాను.

'చెప్పమ్మా...'

'శంకర్‌కి ఉరిశిక్ష విధిస్తే, దాన్ని అమలు చేస్తే నిమిషం లోపు చనిపోతాడు. కానీ 'హాసిని' ఎంతసేపు నరకయాతన అనుభవించిందో మీకు తెలుసా. కనీసం ఆ శంకర్ వూహించగలడా? మనకు చిన్న దెబ్బ తగిలితేనే వెంటనే రియాక్ట్ అవుతాం. అలాంటిది ఎంత క్రూరత్వం! హాసినినీ-శంకర్‌ని ఒకే రకంగా చూడొద్దు. ఈ హత్య ఆవేశంతో చేసింది కాదు. అంతా ప్లాన్ ప్రకారం చేశాడు. అయినా వాళ్ల ఇంట్లోనే అతని మీద సానుభూతి లేదు. మీకెందుకు నాన్నా.. శంకర్ కోసం అమ్మను వదులుకుంటారా?' అన్నాను.

'చైతూ' అని నా కళ్లలోకి చూశారు.

'మీ అమ్మదీ, నాదీ ఓ కులం కాదు. నిజానికి నాది వెనుకబడిన కులం. మీ అమ్మది అగ్రకులం. తాను ఆ అహంకారంతో మాట్లాడిందని నేను అంటున్నానా...?'

నాకు జలదరింపు కలిగింది - ఆ మాటలకి.

'నాన్నా - మీరిద్దరి గురించి అలా ఉంచండి. ఒకప్పుడు మా కాలేజీలో ఇలాంటి చర్చ వచ్చినపుడు మేం కొందరం ఒంటరిగా మిగిలిపోయాం. ఇప్పుడు నాదే కులం నాన్నా?'

'నేను చెప్పేది సాంతం వినమ్మా...'

'నేను కులం గురించి మాట్లాడటం లేదంటారు... కానీ మీలో అలాంటి ఆలోచన వచ్చింది కాబట్టి అన్నారు. కులం పేరు పెట్టి చిన్నకులాల వారిని తిట్టేవారిని, అవమానించేవారిని చూస్తే నాకు ఎంత ఆగ్రహం కలుగుతుందో, కొంతమంది తమ స్వార్థం కోసం కులాన్ని వాడుకోవటం చూస్తే అంతే జాలి కలుగుతుంది. నిజానికి ఏ కులానికి ఎవరు మేలు చేశారు. ఈ విషయాన్ని అదే కులంలోని నిరుపేదలు చెప్పాలి. నేను చూస్తున్నా.. చాలామంది ఆయా కులాల అధికారానికి, డబ్బుకీ లొంగిపోతున్నారు' అన్నాను.

'నా మాట వినరా.... మీ అమ్మ నాలో ఓ మగవాడ్ని చూస్తోంది తప్ప, నేను మానవత్వం కోసం ఆలోచిస్తున్నట్లు ఫీల్ కావటం లేదు'.

## సమయ స్ఫూర్తి

నిన్నటి నిజం

ఆ రోజు రక్షాబంధన్ పండుగ. స్వాతంత్ర్య సమరయోధుడు చంద్రశేఖర్ అజాద్‌కోసం బ్రిటిష్ ప్రభుత్వం గాలిస్తోంది. ఆ రోజున ఆయన అల్హాబాద్‌లోని ఒక మిత్రుని ఇంట రహస్యంగా బస చేశాడు. పోలీసులకు అక్కడ అజాద్ ఉన్నట్లు ఆచూకీ అందింది. వెంటనే ఒక ఇన్‌స్పెక్టర్ పోలీసులతో వెళ్ళి ఆ ఇంటిని చుట్టుముట్టాడు. అజాద్ స్నేహితుని భార్య శ్రీదేవి తెలివైనది. మెరుపువేగంతో ఒక పథకం వేసింది!

ఒక లడ్డూల గంప అజాద్‌కు అందించి "ఆజాద్! మీరు నా వెనక దీన్ని నౌకర్లా తీసుకురండి!" అంటూ ఆమె అతని తలకు ఒక తుండుగుడ్డను తలాపాగాలా చుట్టింది.

ఇద్దరూ కలిసి బయటకు వచ్చాక "త్వరగా నడువు- మనం చుట్టాల ఇంటికి వెళ్ళడం ఆలస్యం అవుతుంది. లడ్డూలన్నీ వాళ్ళకు పంచి పెట్టాలి!" అంటూ హడావుడి చేసింది.

ఆమెను అనుసరిస్తూ, ఎంతో వినయంగా ఒక సేవకునివలే నడవసాగాడు అజాద్ లడ్డూల గంపతో. ఇన్‌స్పెక్టర్ వారి దారికి అడ్డంగా నిలిచాడు.

"సమయానికి వచ్చావు, అన్నయ్యా!" అని ఎంతో సంతోషంతో అంటూ శ్రీదేవి ఇన్‌స్పెక్టర్ నోట్లో, గంపలోని ఓ లడ్డూ తీసి అతని చేతికి ఓ రాఖీ కట్టింది.

"అన్నయ్యా! దయచేసి ఈ లడ్డూ తిను. నేనింకా చాలామంది బంధువుల ఇళ్లకు వెళ్ళాలి- వస్తా!" అంటూ ఎంతో హడావుడిగా అక్కణ్ణుంచి వెళ్ళింది. ఆమె వెనక అజాద్ కూడా వెళ్ళాడు నౌకరులా నటిస్తూ.

వాళ్ళిద్దరూ కలిసి ఇన్‌స్పెక్టర్‌ను ఓ తెలివితక్కువ దద్దమ్మను చేశారు. తర్వాత అతను పోలీసులతో కలిసి ఇంట్లోకి వెళ్ళాడు- అక్కడ అజాద్ ఉన్నాడనీ, అతను తమకు చిక్కిపోతాడనే హుషారుతో. లోపల వారు ఎంత వెతికినా అజాద్ కనపడకపోయేసరికి ఇన్‌స్పెక్టర్ తెల్లమొహం వేశాడు.

'ఇప్పుడేమంటారు నాన్నా?'

'నేను చెప్పేదొకటి. నాకు పద్మంటే ప్రాణం. మేం కలిసి బతకాలనుకున్నప్పుడు మా ముందున్నది ప్రజల కోసం పనిచేయాలనే ఆశయం. ఇప్పుడు నాతో కలిసి వుండటం సాధ్యం కాదని మీ అమ్మ అనుకుంటోంది. మేం ఇద్దరమే అయితే ఎవరి బతుకు వారు బతికే వాళ్లం. మా మధ్య నువ్వున్నావు కదా' అన్నారు.

'కలిసి ఉందామనుకున్న మీరు మీ పెళ్లిని ఎందుకు చట్టబద్ధం చేసుకున్నారు' అన్నాను. ఆయన వెంటనే జవాబు చెప్పలేదు.

'నా కోసమా...'

'అప్పుడు అలా వుండాలనుకున్నాం. తర్వాత చట్టబద్ధం చేసుకోవాలనుకున్నాం' అన్నారాయన.

'ఎప్పుడయినా మీరు విడిపోతాం అనుకున్నారా?'

'అనుకోలేదు' అన్నారు.

'అమ్మ నాతో వుంటావో - మీ నాన్నగారితో వుంటావో. నువ్వే నిర్ణయించుకో' అంది. 'నా చదువుకి తన సహకారం అందిస్తానంది. మీరు కూడా అదేమాట చెప్పబోతున్నారా?' అన్నాను.

నాన్న తలదించుకున్నారు.

'నేను అమ్మకి చెప్పిందే మీకూ చెబుతున్నాను. నేను ఆలోచించుకోవాలి. అప్పుడే చెప్పగలను' అన్నాను.

★ ★ ★

'ఏమిటి చైతూ.. నువ్వు చెప్పేది నిజమేనా!' అంది మా అమ్మమ్మ

'అవును. అమ్మ ఇల్లు కూడా చూసింది. ఇంకా తను అక్కడకు మారటమే మిగిలింది.'

'అప్పుడే అయిపోయిందన్నమాట'.

## ఆడదిక్కు.. మగదిక్కు

అలనాటి రంగస్థల ఉద్దండ పిండాలైన స్థానం నరసింహారావు, మాధవపెద్ది వెంకట్రామయ్యల మధ్య గొడవల్ని గురించి రసవత్తరంగా చెప్పడం నరసరాజుకే సాధ్యం. ఆడ పాత్రలకు పేరుపడ్డ స్థానంతో విభేదాల కారణంగా మాధవపెద్ది చిన్ననటులతో ఓ బృందాన్ని ఏర్పాటు చేసుకుని నాటకాలు వేస్తుంటే స్థానం కూడా మరో బృందంతో నాటకాలు వేస్తున్నారట. దీనిపై నరసరాజు మాధవపెద్దిని అడిగితే 'ఏం చేయమంటారు? వాడికి మగదిక్కులేదు.. నాకు ఆడదిక్కులేదు మరి' అన్నాడట.




'నిన్నేం చేయదలుచుకున్నారు... ఆ విషయం తేల్చారా? ' అంది సీరియస్‌గా

'అది నన్నే తేల్చుకోమన్నారు. ఎవరి దగ్గరున్నా వారికి ఇష్టమేనంట'.

'అలాగా... ఇంత భాగ్యం చూడటానికా నన్ను మీ ఇంటికి రమ్మన్నావు. అసలు నువ్వే తేల్చుకోవటం ఏమిటే? అంత ముందుచూపున్నవారు పిల్లల్ని కనకూడదు. దానికి సిగ్గుండాలి.. అమ్మని బాధ పెట్టటంతో ఆగలేదు. ఇప్పుడు కూతుర్ని కూడా వదలటం లేదు'.

'అమ్మమ్మా నువ్వు కాస్త కోపం తగ్గించుకుంటావా? ' అన్నాను.

ఆమె తలపక్కకు తిప్పుకొంది. బహుశా కన్నీళ్లు కనపడకుండానేమో.

'ప్లీజ్ అమ్మమ్మా.... అమ్మా-నాన్నలు విడిపోవాలనుకుంటున్నది వాళ్ల స్వంత విషయాలకు కాదు. అయినా వాళ్లేం విడాకులు తీసుకోవటం లేదు. విడిగా వుంటారు. ఈ పట్టుదలలు తగ్గితే రేపు వాళ్లు కలవొచ్చు'.

'నువ్వు అన్నీ తెలిసిదానిలా మాట్లాడకు. ఇంతకీ నువ్వేం అనుకుంటున్నావో చెప్పు' అంది.

'ఆ విషయం కనుక్కుంటానికే వచ్చాను'

'అంటే నేనేం చెబితే అది చేస్తావా' అంది అమ్మమ్మ కాస్త కోపంగానే

కొంచెంసేపు ఆలోచించి ఏమనుకుందో 'నువ్వు వరూని కలిశావా? అంది.

'లేదు' అన్నాను.

'నువ్వు మీ అమ్మ దగ్గరుంటావో -నాన్న దగ్గరుంటావో నీ ఇష్టం. నేను చెప్పదలుచుకుందొకటే. నేనింకా బతికే వున్నాను. నన్ను రమ్మంటే నీ దగ్గరకొచ్చి వుంటాను. నీ చదువుకి కూడా వాళ్లని డబ్బులు అడగాల్సిన అవసరం లేదు. నాకున్నది నేను కట్టుకుపోను. ఉన్న ఇల్లూ - పొలం అమ్మి నిన్ను చదివించుకుంటాను' అంది దృఢంగా.

★ ★ ★

పద్మ, గోపాల్ మధ్య అభిప్రాయభేదాలు వచ్చాయని మిత్రుల సర్కిల్‌లో తెలిసింది సూచాయగా. కొంతమంది వారంతట వారు చెబుతారని అనుకున్నారు.

పద్మకు ఇల్లు దొరికింది. ఆ విషయం గోపాల్‌కు చెప్పింది.

'నేను వెళ్లిపోతున్నాను' అంది.

'నేను వద్దంటే ఆగవని తెలుసు. నీకు ఈ ఇంట్లో ఏ వస్తువులు కావాలన్నా తీసుకువెళ్లు పద్మా' అన్నాడు.

'నాకేం అవసరం లేదు' అంది.

'అదేంటి.. ఇవన్నీ నేను కొన్నవి కాదు. ఇందులో నీ శ్రమా వుంది. మన అభిప్రా యభేదాల్ని అంతవరకే వుంచుకుందాం. మనం శత్రువులం కాదు' అన్నాడు గోపాల్.

పద్మ ఏమనుకుందో, 'నేను రెండు గదుల ఇల్లు తీసుకున్నాను. ఎక్కువ సామాన్లు అవసరం లేదు. నాకు అవసర మైనవి నేను తీసుకువెళ్తాను. థ్యాంక్స్' అంది.

'థాంక్స్ చెప్పాల్సిన అవసరం లేదు. అది నీ హక్కు' అన్నాడు గోపాల్. ఇద్దరి మధ్య మాటలు లేవు.

అదే సమయంలో చైతన్య వరూధిని దగ్గరుంది.

ఆమె చైతన్య చెప్పినదంతా మౌనంగా వింది. తర్వాత నిట్టూర్చింది.

కొంతసేపు కళ్లు మూసుకుంది.

'నువ్వేం చేద్దామనుకుంటున్నావమ్మా' అనడిగింది.

'నేను ఇద్దరి దగ్గరా వుండాలనుకుంటున్నాను అమ్మమ్మా. ఈ సంవత్సరం నా పరీక్షలు అయిపోతాయి. ఆ తర్వాత నేను ఈ నగరంలో ఉండాలనుకోవటం లేదు. ఇంకెక్కడికన్నా వెళ్లి చదువుకుంటాను' అంది చైతన్య.

'మంచిదే. ఇక్కడ వుంటే నీ చదువు దెబ్బతింటుంది. ఎంత వద్దనుకున్నా ఎవరో ఒకరు మీ అమ్మా-నాన్నల్ని నీకు గుర్తు చేస్తుంటారు. అలానే చెయ్యమ్మా' అందామె.

★ ★ ★

చైతన్య ఇంటికి వచ్చేటప్పటికి పద్మ ఎదురు చూస్తోంది.

'ఎక్కడికి వెళ్లావు చైతూ?' అంది పద్మ.

'నా స్నేహితురాలి దగ్గరికి' ముభావంగా అంది.

'అదే, ఏ స్నేహితురాలని అడుగుతున్నాను'

'అదంతా అవసరమా?'

పద్మ మాట్లాడలేకపోయింది.

'నువ్వు ఈ ఇంటినుంచి వెళ్లిపోతున్నావ్. రేపటినుంచి నేను ఏం చేసేది, ఏం తినేది, ఏం చదివేది నీకు తెలియదు. నన్ను ఈ ప్రశ్నలు అడిగే అవకాశం నీకు రాదు. అలాంటప్పుడు తెలుసుకోవటం వలన నీకు సంతోషం కలుగుతుందా?'

'చైతూ- నాకు అర్థమైంది'

'ఏమర్థమయిందమ్మా?'

'నువ్వు మీ నాన్నగారితో వుండబోతున్నానవని. నేను ముందే చెప్పాను, నువ్వు ఏ నిర్ణయం తీసుకున్నా నేను బాధపడనని. నేను ఈ ఇంటినుంచి సంతోషంగా బయటకు వెళ్లటంలేదు. ఓ గొప్పకారణం కోసం వెళ్తున్నాను. ఆడవాళ్ల గౌరవం కోసం వెళ్తున్నాను. మనకు జీవించే హక్కు వుందని రుజువు చేయటానికి, పదిమందిలో చైతన్యం రావటానికి వెళ్తున్నాను. నీకు అది అర్థమయితే చాలు'

**'నువ్వు ఈ ఇంటినుంచి వెళ్లిపోతున్నావ్. రేపటినుంచి నేను ఏం చేసేది, ఏం తినేది, ఏం చదివేది నీకు తెలియదు.'**

చైతన్య చిరునవ్వుతో అమ్మకేసి చూసి 'చాలా సంతోషం. నువ్వు ఎందుకు వెళ్తున్నావో నాకు తెలుసు. అందుకే చెప్పాను నామీద అభిమానం పెంచుకుంటే ఈ పనులన్నీ చేయలేవు. నువ్వు ఈ ఇంటినుండి ఎందుకు వెళ్తున్నావో అందుకే కట్టుబడి వుండాలంటే నాన్నతోనే కాదు నాతోనూ తెంచుకోవలసినవి వున్నాయి.'

పద్మ నిర్ఘాంతపోయింది. చైతూ తను వూహించిన స్థాయికంటే ఎత్తున ఉంది.

తల్లులకెప్పుడూ పిల్లలు చిన్నవారిగానో,

అమాయకులుగానో కనిపిస్తారు కాబోలను కుంది.

'సరే, మనందరం కలిసి భోంచేద్దాం'

'లాస్ట్ సప్పరా!'

'అలానే అనుకో'

'పది నిమిషాల్లో వస్తాను' అని చైతన్య వెళ్లింది.

ఆ తర్వాత అందరూ డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చున్నారు. ఎవరూ మాట్లాడ కుండా తింటున్నారు.

'నాన్నా' అంది చైతన్య.

'ఏంటమ్మా?'

'ప్రేమంటే ఏమిటి?' అంది.

పద్మ తలవంచుకుని భోంచేస్తోందల్లా తలపైకెత్తింది.

గోపాల్ అప్రయత్నంగా పద్మకేసి చూశాడు.

'నువ్వయినా చెప్పొచ్చమ్మా' అంది.

ఇద్దరకీ ఆ ప్రశ్న కాస్త ఇబ్బందికరంగా వుంది.

'చాలా రోజులుగా అనుకుంటున్నాను, మీ ఇద్దరిని అడగాలని. మీరు కలిసి బతకటం వెనక ప్రేమ వుంది. నన్ను కనటం వెనక ప్రేమ వుంది. ఇదే ప్రేమకోసం శంకర్ హాసినిని నరికేశాడు. అసలిప్పుడు బిస్కట్ల దగ్గర్నుండి సినిమాల దాకా ప్రేమ లేనిది లేదు. సింబల్సన్నీ అవే. ఇంకో విషయం ఏమిటంటే మీరు ప్రేమ కోసం.. అదే మానవత్వం మీద ప్రేమతో.. శంకర్‌కు అనుకూలంగా, వ్యతిరేకంగా పోరాడబోతున్నారు కదా!' అంది.

అప్పటిదాకా పద్మలో చైతూ మీద వున్న కోపం లాంటిది కరిగిపోయింది.

గోపాల్ తినటం ఆపాడు.

నిశ్శబ్దం.

'చెప్పరా... బొత్తిగా ఎవరూ మాట్లాడ కుండా తింటున్నారని అడిగాను. ఇప్పుడు కాకపోతే ఇంకెప్పుడన్నా చెప్పండి. ఒక్క ప్రేమ గురించే కాదు. నా గురించి కూడా. మీ ఇద్దరూ నన్ను ప్రేమిస్తున్నారా? ఈ ప్రశ్నకి కూడా జవాబు కావాలి' అని తన ప్లేటు తీసుకుని వెళ్లిపోయింది.

ఇద్దరూ చైతన్యకేసి చూస్తుండిపోయారు.

★ ★ ★

ఆదివారం ఉదయం.

పద్మ చైతన్యతో 'నేను బయలుదేరుతున్నాను' అంది.

'నేను కూడా వస్తానమ్మా' అంది. పద్మకు అర్థం కాలేదు.

'ముందు నేను ఆ ఇల్లు చూడాలి' అంది చైతన్య.

'వెళ్దాంరా' అంది పద్మ.

ఇద్దరూ ఆ ఇంటికి వెళ్లారు. సింపుల్‌గా వుంది. ఆ ఇంటివాళ్లు పద్మంటే గౌరవం వున్నవాళ్ళు. వాళ్ల పిల్లలు ఇతర రాష్ట్రాల్లో ఉద్యోగాలు చేసుకుంటున్నారు.

ఒకటి రెండు సంవత్సరాల్లో తిరిగి బదిలీమీద వచ్చేస్తారు. వీళ్లు ఎప్పుడన్నా వెళ్లి పిల్లల్ని చూసి వస్తుంటారు. పద్మ వారికి తోడుగా వుంటుందనుకున్నారు. పద్మ మహిళా సంఘంలో పని చేస్తోందని వారికి తెలుసు.

'ఇల్లు ఎలా వుంది చైతూ?'

'బాగానే వుందమ్మా'

'నువ్వు నీ పుస్తకాలు ఇక్కడికి తెచ్చుకుంటావా?'

'చూస్తానమ్మా...' అంది.

'అంటే...' అంది పద్మ.

'నేను నీ దగ్గరో, నాన్న దగ్గరో వుండాలనుకోవటం లేదు. పరీక్షలయ్యేంతవరకూ నేను ఇద్దరి దగ్గరా వుంటాను. ఆ తర్వాత నేను వేరేచోటుకు వెళ్లి చదువుకోవాలనుకుంటున్నాను.'

'వేరే చోటు అంటే?'

'అది ఢిల్లీ కావచ్చు పూణే కావచ్చు' అంది చైతన్య

'మంచిది చైతన్యా' అంది పద్మ.




**నా** పరీక్షలు అయిపోయాయి.

నేను బాగానే రాశాను. అంటే ఫస్ట్‌క్లాస్ రావచ్చు. నేను స్టేట్ ర్యాంకులు తెచ్చుకోవాలనుకోలేదు.

అదే నా ధ్యేయమయితే నేను అలాంటి ప్రయత్నం చేసేదాన్ని. అప్పుడప్పుడూ నేను అమ్మ దగ్గరకు వెళ్లేదాన్ని. అమ్మ ఇల్లు చిన్న ఆఫీస్‌లా మారిపోయింది. ఓ కౌన్సిలింగ్ సెంటర్ అయింది. ఎప్పుడూ ఎవరో ఒకరు వస్తుండేవారు. దాదాపు అందరూ స్త్రీలే. కొంతమంది పురుషులున్నా తమ ఆడపిల్లలకు అన్యాయం జరిగిందని చెప్పుకోవటానికి వచ్చేవారే.

'గోపాల్ కలుస్తున్నాడా? ' అడిగారెవరో ఓసారి.

'లేదు. ఆ మధ్యన ఓ మీటింగ్‌లో కనిపించాడు. తను తన పనుల్లో బిజీ. నేను నా పనుల్లో తీరికే లేకుండా ఉన్నాను' అంది అమ్మ.

'ఏమైనా నువ్వు నాకు నచ్చావు పద్మా. నిజం చెప్పాలంటే నువ్వు గోపాల్ నుంచి బయటకు రావటం గురించి మన సర్కిల్స్‌లోనే రకరకాలుగా మాట్లాడుకున్నారు. నాకు ఆశ్చర్యం కలిగింది. ఒకరిద్దరితో తగాదా పడ్డాను. నిజానికి మారాల్సింది మనం. జనం చాలా విషయాల్లో మన కంటే ముందున్నారు. ఉద్యమాల్లో పనిచేసేవారిలో కూడా ఇంతగా ఫ్యూడల్ భావాలున్నాయా అనిపించింది.'

అమ్మ నవ్వేసింది.

'ఎందుకు పద్మా నవ్వుతున్నావ్'

'నిజానికి ఉద్యమాల్లో పనిచేసే చాలామంది పాత భావాల నుండి బయటపడరు. మామూలు మనుషులకంటే కన్సర్వేటివ్‌గా వుంటారు. కొంతమంది నన్నే అడిగారు. సలహాలు చెప్పారు. కలసిపొమ్మన్నారు. మా భావాలు ఒకటి కానప్పుడు ఎలా కలవగలం? '

ఆమె మాట్లాడలేదు.

'అందుకే నేను నా వ్యక్తిగత జీవితం గురించి ఎవరేం కామెంట్ చేసినా పట్టించుకోను. నేను ఎవరి దగ్గరా నిధులు అడగటం లేదు. సాధ్యమైనంత నిరాడంబరంగా బతికే ప్రయత్నం చేస్తున్నాను. నేను గోపాల్ నుండి బయటకు రావటం వల్ల మా చైతూకి ఎంత బాధ కలుగుతుందో నాకు తెలుసు. అయినా నేను మాత్రం రాజీ పడదలచుకోలేదు' అంది.

ఇక 'శంకర్' విషయం గురించి నేను నాన్నతో ఎప్పుడూ మాట్లాడలేదు. చట్టం తన పని తాను చేసుకుపోతున్నట్లు ఆయన పని ఆయన చేస్తున్నారు.

గోపాల్ పద్మతో కలిసి ఉండటంలేదని తెలిశాక ప్రజాస్వామ్య హక్కుల సంఘానికి చెందిన నాయకత్వం గోపాల్‌తో మాట్లాడింది.

'మీరు విడిపోవటానికి వ్యక్తిగత కారణాలు వున్నాయా' అని.

'అలాంటివేం లేవు. ఉరిశిక్ష విషయంలో పద్మ పట్టుబట్టడం వలన ఇదంతా జరిగింది' అన్నాడు గోపాల్.

కానీ మనం పద్మ లాంటి స్త్రీలను కాపా

డుకోవాలి. రాజకీయాల్లోకి మహిళలు రావటమే తక్కువ. అందులోనూ 'మన' రాజకీయాల్లో ఇంకా తక్కువే. అలాంటప్పుడు వున్నవారే జారిపోతే ఎలా?' అన్నారు.

'నిజమే. నేను చాలా ప్రయత్నం చేశాను. నిజానికి మనం అంటే పార్టీ కూడా అనుసరిస్తున్న విధానం వల్లనే ఇవన్నీ వస్తున్నాయి' అన్నాడు గోపాల్.

'అదేంటి?'

'మనం రాజకీయ చైతన్యం కలిగించటంలో విఫలం అయ్యాం. అవుతున్నాం. రైతుల విషయం తీసుకున్నా. కార్మికుల్ని తీసుకున్నా అలానే జరుగుతోంది. రైతు కూలీల ప్రయోజనాలు వేరు. కానీ వాళ్లిద్దరి ఐక్యత లేనిదే భూపోరాటం జరగదు. వారిద్దరికీ వేరే సంఘాలు ఉండవచ్చు కానీ రాజకీయ చైతన్యం లేనప్పుడు అసలు శత్రువుని వదిలేస్తారు. ఇప్పుడు కులసంఘాల నుండి మహిళా సంఘాలు, వృత్తి సంఘాలు అన్నీ అలానే అయ్యాయి. వాళ్లు 'తమ' గురించి మాట్లాడుతున్నారు తప్ప బాధపడేవారి గురించి ఉమ్మడిగా మాట్లాడటం లేదు'.

'నిజమే మన ఉద్యమం ప్రారంభ దశలో వుంది. ఇలాంటి ఆటుపోట్లు తప్పవు.'

'మనం చేస్తున్నది పొరపాటో- అవసరాలకు రాజీపడుతున్నామో నాకు అర్థం కావటం లేదు. సరైన సమయంలో మనం ఎదుటివారి లోపాల్ని ఎత్తి చూపటం లేదు.'

'ఎత్తి చూపితే పద్మ చేసినట్లే చేస్తారు' అన్నారొకరు.

'మరేమిటి మార్గం? ఒక సమస్యని ఆడవాళ్లూ- మగవాళ్లూ- కులమూ- మతమూ- ప్రాంతమూ ఎవరి పరిధుల్లో వారు పరిష్కరించుకోవటం కుదురుతుందా?'

'కుదరదు. కుదరదని వాళ్లని తెలుసుకోనిద్దాం. ఒకటి మాత్రం నిజం. మనం పార్టీ లైన్ ప్రకారం నడుచుకోవాలి. ఎవరినైనా ఎక్కువకాలం భరించలేదు పార్టీ. ఎంత గొప్పవారైనా పార్టీకి భిన్నంగా ప్రవర్తించినప్పుడు వదులుకుంటుంది. ఏది ఏమైనా మీరిద్దరూ విడిపోవటం మాత్రం ఉద్యమాలకి నష్టం' అన్నారు.

గోపాల్‌కి కోపం వచ్చింది. అయినా నిగ్రహించుకున్నాడు.

ఇంతకీ వాళ్లు ఎవర్ని సమర్థించారో- ఎవర్ని విమర్శిస్తున్నారో అతనికి అర్థం కాలేదు.

★ ★ ★

ఎప్పటివో పుస్తకాలు చూస్తుంటే 'ప్రియదర్శిని మట్టూ' ఉదంతం కనిపించింది పద్మకి.

తను కూడా న్యాయశాస్త్రం చదువుతున్నప్పుడు- తనతోపాటు చదువుతున్న వ్యక్తి. ఆమెను ప్రేమించానన్నాడు.

అందుకు ఆమె ఒప్పుకోలేదు.

అతను ఆమె ఇంటికి వెళ్లి దాడి చేశాడు. తలమీద బలంగా కొట్టాడు. దాంతో ప్రియదర్శినికి స్పృహ తప్పింది. అప్పటికీ అతని ఆగ్రహం చల్లారలేదు. చావుబతుకుల్లో వున్న ప్రియదర్శినిని అతను ఇంకా దారుణంగా రేప్ చేశాడు. తర్వాత ఆమెను చంపేశాడు.

హంతకులకి కూడా ఆర్టికల్ 21 కింద జీవించే హక్కు వుంది. చాలా కేసుల్లో నిందితులు పోలీసుల ముందు నేరాన్ని అంగీకరిస్తారు. దానిని కోర్టులు సాక్ష్యంగా తీసుకోవు. పోలీసులు బలవంతాన తమతో అలా చెప్పించారని కోర్టులో చెబుతారు. ఒక్క పోలీసులే కాదు. మీడియా ముందు ఒప్పుకున్నా ప్రయోజనం లేదు.

అది రుజువు కావాలి.

కోర్టులో నేరం ఒప్పుకున్నా కూడా

# 20 లక్షల మంది సందర్శించే !?

ప్రపంచంలోని అత్యంత విలువైన సేకర ణలు గల మ్యూజియం బ్రిటిష్ మ్యూజియం. లండన్‌లోని ఈ మ్యూజి యంలో లక్షల కొలది పుస్తకాలు, ఆర్ట్ వస్తు వులు, చిత్రాలు వున్నాయి. కార్ల్‌మార్క్స్ దాస్ కేపిటల్‌ను ఈ మ్యూజియం లైబ్రరీ లోని డెస్క్‌నెంబర్ ఎం-7 దగ్గర కూర్చుని రాశాడని ప్రతీతి. 'జాకోబ్ రిచ్‌టర్' అనే మారుపేరుతో కార్ల్‌మార్క్స్ ఇక్కడికి వస్తుం డేవారు.

ఈ మ్యూజియం లైబ్రరీలోని పుస్తకాల షెల్ఫ్‌ల పొడవు మొత్తం 130 కిలోమీటర్లు! 80 లక్షల పుస్తకాలున్నా యిక్కడ. ఏటా మరో 3 కిలోమీటర్ల షెల్ఫ్‌లు దీనికి అదనంగా జోడవు తుంటాయి. ఏటా లక్షన్నర మంది వచ్చి ఈ పుస్తకాలని చదువుతుంటారు. ఈ లైబ్రరీకి జాన్‌రస్కిన్, చార్లెస్ డికెన్స్, సేమ్యూల్ బట్లర్, రాబర్ట్ బ్రౌనింగ్, బెంజిమన్ డిజ్రా యిన్‌లాంటి అనేకమంది రచయితలు వచ్చారు.




23 ఏళ్ళ వయసు గల ఈ బ్రిటీష్ మ్యూజియాన్ని సర్ హేన్స్ స్లోయెన్ అనే ధనవంతుడు స్థాపించాడు. ఇతను కింగ్ జార్జ్-2 వైద్యుడు. ఇతను 50 వేల పుస్త కాలు, చిత్రాలు సేకరించి లండన్‌లోని తన ఇంట్లో నింపాడు. తన విల్లుద్వారా వాటిని 20 వేల పౌండ్లకి బ్రిటిష్ పార్లమెంట్‌కి అమ్మాడు. 1757లో కింగ్‌జార్జికి గల ఆసక్తి వల్ల బ్రిటిష్ మ్యూజియం ఏర్పడింది.

బ్రిటన్‌లో ప్రచురితమయ్యే ప్రతీ పుస్తకం ఒక కాపీని దీనికి పంపాలన్న నియమం ఆయన పెట్టబట్టి ఇన్ని లక్షల పుస్తకాలు బ్రిటిష్ మ్యూజియంలో చేరాయి. బ్రిటిష్ మ్యూజియంకి, బ్రిటీష్ కాలనీలనించి కళా త్మక వస్తువులని ఎన్నింటినో బ్రిటిష్ అధికా రులు తరలించారు. ఆ విధంగా ప్రపంచం నలుమూలలనించి విలువైన కళాఖండాలు ఈ మ్యూజియానికి చేరుకున్నాయి. చైనా, ఇండియా, బర్మా, టర్కీ, జపాన్, హాంకాంగ్ లాంటి అనేక దేశాలనించి ఇక్కడికి పుస్త కాలు, కళాఖండాలు వచ్చి చేరాయి.

కింగ్ జార్జి-III శ్రద్ధ వల్ల కూడా ఇది అభివృద్ధి చెందింది. 7 లక్షల 50 వేల నాణాలు, 50 లక్షల తపాలా బిళ్ళలు, కొన్ని వేల గ్రామ్‌ఫోన్ రికార్డులు, అచ్చయిన మొదటి బైబుల్, షేక్స్‌పియర్ సంతకం చేసిన విల్లు... ఇలా ఎన్నో ఇక్కడ చూడచ్చు. వీట న్నిటినీ చూడటానికి ఓ జీవి తకాలం సరిపోదనే చెప్పాలి.

బెర్నార్డ్ షా ఇక్కడి లైబ్రరీని ఉపయోగించుకు న్నాడు. అందుకు కృతజ్ఞతగా తన రచనల ద్వారా వచ్చే ఆదాయంలో మూడోవంతు ఈ మ్యూజియానికి చెందాలని తన విల్లులో పేర్కొన్నాడు. ఆదేవిధంగా అతని 'పిగ్మాలి యన్' అనే నాటకం ఆధారంగా నిర్మించ బడ్డ సినిమా 'మై ఫెయిర్ లేడీ' నిర్మాత నించే 10 లక్షల పౌండ్లు ఈ మ్యూజియా నికి వచ్చాయి. అత్యంత పురాతన అట్లాస్ లని ఇక్కడ చూడచ్చు. అనేకమంది చరిత్ర కారులు, వివిధ శాస్త్రాలకి చెందిన రీసెర్చ్ చేసేవారు నిత్యం ఈ మ్యూజియంకి రీసెర్చ్ పనిమీద వస్తూంటారు. ఏటా 20 లక్షల మంది దీన్ని సందర్శిస్తుంటారు.

ఆగస్ట్ 26, 1939న రెండో ప్రపంచ యుద్ధం మొదలుకి 8 రోజుల ముందు బ్రిటిష్ మ్యూజియంలోని విలువైన పుస్తకా లని, అన్ని కళాఖండాలని రైలు ద్వారా వేల్స్ నగరానికి తరలించి అక్కడ అండర్ గౌండ్ సొరంగాల్లో భద్రపరిచారు. లేక పోతే, జర్మన్ బాంబింగ్స్‌తో ఈ విలువైన కళాఖండాలు నాశనమైపోయేవి.

దానికి సాక్ష్యం వుండాలి. ఇవన్నీ నిర్దోష లను రక్షించటానికి ఏర్పాటు చేసుకున్నవి. ప్రియదర్శిని హంతకుడు కోర్టుముందు తన నేరాన్ని ఒప్పుకున్నాడు. అయినా కూడా సాక్ష్యాలు లేకపోవటంవల్ల అతను బయటపడ్డాడు.

న్యాయస్థానం తమ ముందుకు వచ్చిన సాక్ష్యం ఆధారంగానే న్యాయ నిర్ణయం చేయాలి. అందుకు వారు పోలీసులమీదే ఆధారపడాలి. న్యాయవ్యవస్థకి ప్రత్యేకమైన పరిశోధన వ్యవస్థ లేదు. అందుకే కంటి ముందు కనిపిస్తున్నా- అందరూ చూస్తుం డగా హత్యలు చేస్తున్నా సాక్ష్యం లేకపోవ టంవల్ల అవన్నీ రుజువు కావటంలేదు. అందుకే అనేకమంది న్యాయాధికారులు తమ నిస్సహాయతని ప్రకటించటం.

దీనికి మార్గం ఏమిటి?

దేనికయినా ఒకటే మార్గం. అది ప్రజా చైతన్యం.

ఇప్పుడు నిరసన ఒకటే మార్గం. అది ఏ రూపంలోనైనా కావచ్చు. అప్పుడు మాత్రమే అవినీతి తగ్గుతుంది. కొందరైనా భయపడతారు. ప్రియదర్శిని హత్య విష యంలో అలాంటిదే జరుగుతోంది.

పద్మకి చాలా తృప్తి కలిగింది.

నిరాశపడనవసరం లేదు. హాసినికి న్యాయం జరగాలి. అంటే ఓపక్క న్యాయ పరమైన పోరాటం చేస్తూనే ప్రజల్ని కది లించాలి. ముందువున్న వేడి ఇప్పుడు వుండకపోవచ్చు. కానీ మేధావుల్ని కదిలిం చగలగాలి. వాళ్లు సామాన్య జనంమీద గట్టి ప్రభావం చూపించగలిగితే, వాళ్లు గళం విప్పుతారు.

★ ★ ★

అమెరికా నుండి పద్మ తమ్ముడు 'అమర్' వచ్చాడు.

పద్మ ఎప్పటికప్పుడు అమర్‌తో మాట్లా డుతోంది. అతను ఇండియా వచ్చి దాదాపు ఎనిమిది సంవత్సరాలయింది.

అతను పద్మ దగ్గరకు వచ్చి 'చైతూ ఎక్కడ? ' అని అడిగాడు.

'గోపాల్ దగ్గరకెళ్లింది. వస్తుంది' అంది.

'ఇంకా విశేషాలేంటక్కా? ' అన్నాడు.

'నువ్వు ఒక్కడివే వచ్చావేంటి. 'శివాని'ని తీసుకురాలేదే' అంది.

శివాని అతని భార్య. డాక్టర్. వాళ్లకి ఓ అమ్మాయి. పేరు మధూలిక.

'శివాని చాలా బిజీగా వుందక్కా. ముందు నేను వచ్చాను. తర్వాత తను వస్తుంది.'

'మధునయినా తీసుకు రావాల్సింది. రానందా' అంది పద్మ.

'అదేం లేదు. తనకీ చదువు. ఏమిటో మా పరుగులు మావి. నేను కూడా వచ్చే వాడిని కాదు. కంపెనీ పనిమీద వచ్చాను. రెండు వారాల్లో వెళ్లిపోతాను' అన్నాడు అమర్.

'నువ్వు మరీ ప్రొఫెషనల్ అయిపోతు న్నావు'

'అయిపోవటం కాదు. అయ్యాను' నవ్వాడు అమర్.

'అయితే ఇండియా రావా? '

'నిజంగా రమ్మంటావా? ' అన్నాడు.

'అదేంట్రా అలా అంటావ్. నువ్వు పుట్టింది ఇక్కడే. నీకు కావాల్సింది సంపా దించుకుని ఇండియా వచ్చేస్తావనుకుంటు న్నాను'

'లేదక్కా. నేను మహా అయితే నా డబ్బుని ఇక్కడ ఇన్‌వెస్ట్ చేస్తాను. అక్కడ మేం ఓ లైఫ్‌స్టయిల్‌కి అలవాటుపడి పోయాం. ఇక్కడ మురికి- ట్రాఫిక్ సెన్స్ లేకపోవటం. ఈ రోడ్స్.. లంచగొండి తనం - టోటల్‌గా బ్యూరోక్రసీ.. వీటిని భరించలేం'.

'అంటే అమెరికాలో అవినీతి లేదంటావ్'

'అక్కా! అది సర్వ ప్రపంచంలో వుంటుంది. మన చిన్నప్పుడు ఇందిరా గాంధీ అన్నారుగా కరప్షన్ సర్వాంతర్యామి' అని.

'అక్కడ పెద్దస్థాయిలో జరగవచ్చు కానీ ఇక్కడంత చిల్లరగా వుండదు. హాయిగా బతుకుతున్న వాళ్లని ఎందుకు కష్టపడమంటావ్' అన్నాడు అమర్.

'శివానీ కూడా ఇలానే ఫీల్ అవుతోందా? '

'ఏమో... మేమెప్పుడూ ఈ విషయం డిస్కస్ చేయలేదు.'

'మేం మధు మీద హోప్స్ పెట్టుకున్నాం. ఆమెకి మంచి జీవితం ఇవ్వాలి. తను ఏం కోరుకుంటే అది చేయాలి. అప్పుడప్పుడు శివాని అంటుంది- మధుకి అత్త పోలికలు వస్తే ఏం చేస్తావని? '

'పోలికలా - లక్షణాలా'

'గ్రామర్ మిస్టేకులు పట్టుకుంటున్నావా. లక్షణాలే అనుకో. మేం మాత్రం చిన్నప్పటి నుంచి మధుకి ఒకటే చెబుతున్నాం. నువ్వో సంచలనం క్రియేట్ చేయాలని. తను 'స్పేస్' టెక్నాలజి తీసుకుంటుందా- సైంటిస్ట్ అవుతుందా అనేది ఇప్పుడే చెప్పలేను. చిన్నపిల్ల కదా. కానీ ఇండియాకి పేరు తేవాలి.'

'ఇప్పుడేగా ఇండియా వద్దని మళ్లీ ఇండియాకి పేరు తేవాలంటున్నావు'

'మధు ఏదన్నా అచీవ్ చేసిందనుకో, అప్పుడేమంటారు? అమెరికా అమ్మాయి సాధించింది అనరు. భారతీయ సంతతికి చెందిన, ఆంధ్రప్రదేశ్‌కి చెందిన, ఇంకా చెప్పాలంటే మన 'తెలుగుతేజం' అంటారు'

'బాగానే మాట్లాడుతున్నావ్ తెలుగు'

అతను నవ్వేశాడు, 'య్యా' అంటూ.

## చివరికంటా కాల్చాలి

మద్రాస్ లయోలా కాలేజిలో చదివే రోజుల్లో గిరీశం ఏకపాత్రాభినయం వేస్తున్నారు నరసరాజు. అంతా సిద్ధమయ్యాక చివరినిమిషంలో గుర్తొచ్చింది గిరీశం కాల్చడానికి చుట్టతెచ్చుకోలేదనే విషయం. అప్పటికప్పుడు బయటకు వెళ్ళి తెచ్చే వ్యవధిలేదు. వెంటనే హాస్టల్ వార్డెన్ ఫాదర్ సోలియర్ వద్దకు వెళ్లారు. ఆయన హాస్యకుశలుడు.

'ఫాదర్ ఐ వాన్ట్ ఎ సిగార్' అని అడిగారు నరసరాజు విషయం చెప్పి.

సరే ఇస్తా కానీ.. ఇది విలువైనది. కాస్త కాల్చి పడేయకూడదు.. తుదికంటా కాల్చినట్లు రుజువుగా చుట్టపీక తెచ్చి చూపాలి' అని షరతు పెట్టారు. దానికి అంగీకరించి ప్రదర్శన అయ్యాక, కష్టపడి ఆ చుట్ట తాగి దాని పీక ఆయనకు వెళ్ళి చూపించారు నరసరాజు.

'అక్కా నాకు చైతూని చూడాలని వుంది. తనకి సెల్ లేదా? '

'లేదు. తీసుకోనంది.'

'ప్రైవసీ పోతుందనా...'

'ఏమోగాని నీకు ఏం చేసిపెట్టమంటావ్'

'అవన్నీ పెట్టుకోవద్దు. నేను హోటల్‌లో సూట్ బుక్ చేశాను. నువ్వు-చైతూ కూడా అక్కడే వుండాలి. ఈ వేడి నేను తట్టుకోలేను. అవునూ ఓ ఏసీ పెట్టిద్దాం.'

'నేను ఈ వేడిని భరించగలను. అవేమీ అవసరంలేదు' అంది పద్మ.

'ఓకే...ఓకే... మనం హాయిగా కబుర్లు చెప్పుకోకుండా వంటా- వార్పులు పెట్టుకోవద్దు. హోటల్‌లోనే తిందాం' అని...

'అమ్మ ఎలా వుంది? ' అన్నాడు.

'ఇప్పటికి గుర్తొచ్చిందా? '

అమర్ కొంచెంసేపు మాట్లాడలేదు.

'నువ్వు చూసి ఎన్ని రోజులయింది? '

'సంవత్సరాలు... నీతో ఫోన్లో చెప్పానుగా'

'అది నిజమే అన్నమాట' అన్నాడు అమర్.

'ఈ మధ్య చైతూ అమ్మమ్మని తరచుగా కలుసుకుంటోంది. వాళ్లిద్దరూ మంచి ఫ్రెండ్స్ అయ్యారు'

'నువ్వు చెప్పావుగా గుర్తుందక్కా... కనీసం చైతూనయినా అమ్మ ఒప్పుకొంది... సంతోషం' అన్నాడు.

'ఇంకేంటి అమర్'.

'ఏమీ లేదు. ఓరోజు అమ్మ దగ్గరకి వెళ్లొద్దాం' అన్నాడు.

'నేను కూడానా!'

'అవును. అందరం వెళ్దాం' అన్నాడు.

పద్మ మాట్లాడకపోయేసరికి 'ఏంటక్కా మాట్లాడవు. అమ్మ దగ్గరకు రావటం నీకు ఇష్టంలేదా? ' అన్నాడు.

'అలా అని కాదు'

'మనం కొన్ని పట్టుదలలు తగ్గించుకుంటే బాగుంటుంది. అయినా మనల్ని ఇంటికి రావద్దని అమ్మ అనలేదుగా'

'లేదు అమర్. ఇంటికి వెళ్లినా ముభావంగా వుంటుంది. ఏదో ఒకటి రెండు మాటలు మాట్లాడి ఆ తర్వాత తన పని తను చూసుకుంటుంది. మనం వెళ్లి అమ్మను బాధపెట్టటం ఎందుకని ఆలోచిస్తున్నాను' అంది పద్మ.

'అమ్మ ఎలా వుంటుంది, ఏం మాట్లాడుతుందనేది మనకు అనవసరం. ఇండియా వచ్చి అమ్మను చూడకుండావుంటే శివాని ఒప్పుకోదు. శివాని ఒప్పుకున్నా లేకపోయినా అది నా బాధ్యత. అసలు అమ్మకు ముందే చెప్పివుంటే మనం పరాయి మనుషుల్లా మన ఊరు వెళ్లాల్సిన అవసరం వుండేది కాదు. నేను స్టేట్స్ వెళ్లగానే ఫ్రెండ్స్ ముందు అడిగే ప్రశ్న అదే. మీ

అమ్మను కలిశావా అని...'

'ఇంకా అక్కడ సెంటిమెంట్స్ వున్నాయా? '

'ఉన్నాయి. అందరూ నాలానే వుండరు. నిజానికి చాలామందికి ఎన్ని డబ్బులున్నా మనం థర్డ్ సిటిజన్స్ అనే ఫీలింగ్ వుంది. అలాంటప్పుడు ఇక్కడకు వచ్చేయవచ్చు కదా అంటావేమో. చెప్పానుకదా- నిన్ను పోరాటాలు చేయవద్దంటే వింటావా. బావని హ్యూమన్ రైట్స్ వద్దులే నీ కంఫర్ట్స్ నువ్వు చూసుకో అంటే వింటాడా... మేం కూడా అంతే. ఇక్కడకు రావాలంటే భయం. ఇక్కడ సెక్యూరిటీ లేదు. ఇక్కడ సౌకర్యాలు తక్కువ. కనీసం మనం మర్యాదలు నేర్చుకోవటానికి ఇంకో రెండు డికేడ్స్ పడతాయేమో' అన్నాడు అమర్.

'సరే.. ఎప్పుడు వెళ్దాం... నీ పనులు తీరాలిగా'

'అదేం ప్రాబ్లమ్ కాదు. నేను రెండు రోజుల్లో అవి పూర్తి చేసుకుంటాను' అన్నాడు అమర్.

'చైతూని కూడా అడిగి చెబుతాను' అంది పద్మ.

'ఓకే. నేను బయలుదేరతాను.'

'అప్పుడేనా...'

'నిద్ర ముంచుకొస్తోంది. సాయంకాలం కలుసుకుందాం' అన్నాడు.

'నిద్ర సుఖమెరగదంటారు. ఇక్కడే పడుకుంటావా? '

'సుఖమైన నిద్రకోసం హోటల్‌కి వెళ్తాను' అని నవ్వేసి,

'నేనేమీ స్వర్గం నుంచి దిగిరాలేదు. నా రూట్స్ ఇక్కడే వున్నాయని నాకు తెలుసక్కా. నాలుగు రోజులు ఇబ్బందిగా అనిపిస్తుంది. భరించలేమా. రేపు అమెరికా నుండి ఇండియన్స్‌ని తరిమేస్తామంటే ఇక్కడికే రావాలి' అన్నాడు చిరునవ్వుతో.

'నువ్వు నాకు అర్థం కావురా'

'ఈ ప్రపంచమే అంత. ఎవరూ ఎవరికీ అర్థం కారు. ముందు మనకి మనం అర్థమయితే చాలు' అన్నాడు అమర్.




తలుపు తెరిచాడు మత్తుగా ఆవలిస్తూ అమర్.

'నేను చైతన్యని' అంది.

'అరే. లోపలకురా. అమ్మేది' అన్నాడు.

'పని వుందని వెళ్లింది. చూసుకున్నాక వస్తానంది' అని లోపలకు వెళ్లింది.

'ఫోన్‌చేసి కాఫీ తెమ్మని చెబుతావా? '

'నాకొద్దు మావయ్యా'

'పోనీ కూల్‌డ్రింక్ తీసుకో'

'అవీ వద్దు. కూల్‌డ్రింక్స్‌లో విషం వుందంట'

అమర్ బిగ్గరగా నవ్వేశాడు. 'ఎందుకు మావయ్యా నవ్వుతున్నావ్? '

'ఏం చెప్పమంటావోయ్. మనం పీల్చే గాలిలో విషం వుంది. తినే తిండిలో వుంది. ఈ కూల్‌డ్రింక్ కంపెనీ వాళ్లు మన కడుపులో వున్న క్రిముల్ని చంపటానికి అవి వాడుతున్నారు. మనకి రెసిస్టెన్స్ పవర్ పెంచుతున్నారని సంతోషపడాలి. అంతేగాని మానేస్తే ఎట్లా? '

చైతన్య కూడా నవ్వేసింది.

'నువ్వు అప్పుడే ఇంత పెద్దదానివయిపోయావు'

'మీరు, ఇంకో నాలుగేళ్లు ఆగివస్తే నేను

పిల్లల్ని కూడా కనేదాన్నేమో' అంది చైతన్య.

'నువ్వు మంచి రిటార్ట్ ఇస్తావు చైతన్యా. ఏదొకటి చెప్పు. తిందాం..?' అన్నాడు.

'ఈ సూట్‌కి ఎంత ఛార్జ్ చేస్తారు మావయ్యా?'

'ఎందుకురా, అవన్నీ అవసరమా?'

'అవసరమే. ఇక్కడ ఏదన్నా తినేకంటే రోడ్‌పక్కన రెండు రూపాయలిచ్చి పానీ పూరీ తింటే బాగుంటుంది. నువ్వు చాలా డబ్బులు వేస్ట్ చేస్తావనుకుంటా'

'అందరూ బతకాలమ్మా... నేను స్నానం చేసి వస్తాను. ఈలోపు స్ప్రింగ్ రోల్స్‌కి ఆర్డర్ చెయ్యి. ధర చూడకు. కావాలంటే నీతో వచ్చి పానీపూరీ తింటాను' అన్నాడు.

ఏమనుకున్నాడో మళ్ళీ తనే ఆర్డర్ చేసి బాత్‌రూమ్‌కి వెళ్ళాడు.

ఓసారి గదంతా చూసింది. ఓ చిన్న ఫ్రిజ్ వుంది. అందులో కూల్‌డ్రింక్ బాటిల్స్ కనిపించాయి. మెత్తటి పరుపులూ, ఇంకోపక్క బొకే, స్వీట్‌పాక్, ఫ్రూట్స్, ఇంగ్లీష్ డెయిలీ వున్నాయి. టీవీ వుంది. వెళ్ళి విండో కర్టెన్ లాగితే నగరమంతా కనిపిస్తోంది.

అమర్ స్నానం చేసి వచ్చాక 'ఇప్పుడర్థమయింది మావయ్యా. ఇక్కడ ఎందుకు ఇంత రేట్లు వుంటాయో' అంది చైతన్య.

అంతలో బజర్ మోగింది.

'కమిన్' అన్నాడు అమర్.

చాలా వినయంగా లోపలికి వచ్చి ప్లేట్లు సర్ది బిల్ ఇచ్చాడు బేరర్.

అమర్ సంతకం పెట్టి యిచ్చాడు. అతను నమస్కారం పెట్టి వెళ్ళిపోయాడు.

'తీసుకో' అన్నాడు.



**'థ్యాంక్స్ మావయ్యా... నీ ఆఫర్‌ని రిజర్వ్‌లో వుంచుకుంటాను. ప్రస్తుతం అయితే నేను ఇండియాలో వుంటాను'**



'అత్తయ్యని ఎందుకు తీసుకురాలేదు'

'వస్తుందమ్మా... వస్తుంది. కాదు, నువ్వే వచ్చేయ్ మా దగ్గరికి' అన్నాడు.

'నేను రావటం ఏమిటి?'

'చదువుకుందువుగాని. ఆ తర్వాత నీకు అక్కడే మంచి ఉద్యోగం దొరుకుతుంది. నువ్వు స్టేట్స్‌లో సెటిలవ్వొచ్చు. మధు వుంది. నేనూ - అత్తయ్యా వున్నాం' అన్నాడు అమర్.

'అమ్మా- నాన్న వుండరుగా' అంది చైతన్య.

అమర్ తింటున్నవాడల్లా నేప్‌కిన్‌తో చేతులు తుడుచుకుని-

'అమ్మా-నాన్న ఎప్పుడూ నీతో వుంటారా లేక నువ్వు ఎప్పుడూ మీ అమ్మా నాన్నల్తో వుంటావా?' అన్నాడు.

'ఏమో' అంది.

'ఆడపిల్ల ఎప్పటికయినా బయటకు వెళ్ళాల్సిందే'

'మగపిల్లలుంటున్నారా?'

'ఉండరు తల్లీ! పొట్ట చేత్తో పట్టుకుని దేశాలు పట్టిపోవాల్సిందే. నేను సరదాగా అనటం లేదురా. నువ్వు స్టేట్స్ వచ్చేయ్. అక్కడ చాలా అవకాశాలుంటాయి' అన్నాడు.

'థ్యాంక్స్ మావయ్యా... నీ ఆఫర్‌ని రిజర్వ్‌లో వుంచుకుంటాను. ప్రస్తుతం అయితే నేను ఇండియాలో వుంటాను'

'గుడ్... మనం అమ్మమ్మ దగ్గరకు వెళ్దాం. మీ నాన్న ఎలా వున్నారు?'

'బాగానే వున్నారు మావయ్యా'

అమర్ మళ్ళీ కాఫీకి ఆర్డరిచ్చాడు.

'నేను నీ కోసం చిన్న చిన్న వస్తువులు తెచ్చాను. నువ్వు కాదనకు' అంటూ ఓ హాండీక్యామ్, లాప్‌టాప్‌లు బయటకి తీశాడు. అలాగే ఓ సెల్‌ఫోన్ యిచ్చాడు. చిన్న టేప్‌రికార్డర్ చూపించాడు.

'ఇవన్నీ ఎందుకు మావయ్యా'

'నువ్వు చిన్నప్పుడు పోయమ్స్ రాశావు కదా'

'అయితే...'

'ఇవన్నీ నీకు అవసరం, ఉంచు. నీకు బట్టలు తెద్దామనుకున్నాను. ఇక్కడే బాగుంటాయని అత్తయ్య అంది. సో... మనం షాపింగ్‌కెళ్తున్నాం' అన్నాడు.

'ఇప్పుడా? '

'రేపు వెళ్దాం, మీ అమ్మతో కలిసి' అన్నాడు.



ఎ.సి. కారులో ప్రయాణం

ముందు సీట్లో కూర్చుంది చైతన్య. హాండ్‌కామ్ ఎందుకు మావయ్యా అంది గానీ, అది ఆపరేట్ చెయ్యటం నేర్చుకున్న దగ్గర్నుంచి మబ్బుల్నీ, కొండల్నీ, పక్షుల్నీ కెమెరాలో బంధించాలనిపిస్తోంది. మనిషి కన్ను రోజూ చూసే దృశ్యాలకు అలవాటు పడిపోతుంది. కెమెరా కన్ను అలా కాదు. ఆ వెలుగు నీడలూ, కెమెరా పట్టుకునే తీరు కొత్త ఆలోచనల్ని రేకెత్తిస్తుంటాయి. చైతన్య ఆ అనుభూతిని ఆస్వాదిస్తోంది.

వెనక సీట్లలో పద్మ, అమర్ ఉన్నారు.

పద్మ హాయిగా నిద్రపోతోంది. అమర్ మాత్రం ఆలోచనల్లో వున్నాడు. ఒకప్పుడు కారు ఎక్కటం అంటే అందమైన కల. విమానం కనిపిస్తే వెర్రి ఆనందం. ఇప్పుడు కారంటే బోర్. రెండేళ్ళకోసారి కొత్త మోడల్ కారు కొనటమే, ఏ పనున్నా ఫ్లయిట్‌కి వెళ్లటమే.

ఎంత డబ్బు ఉన్నా 'అమ్మ' తన దగ్గరికి రాదు. తన సంపాదనను అనుభవించదు. లోలోన ఎంత బాధ ఉన్నా లేనట్లు నటిస్తుంటాడు.

అమ్మ విషయంలోనే కాదు. ఇండియన్ సిస్టమ్ పట్ల అతనికి చాలా అసంతృప్తి ఉంది. ముఖ్యంగా అభ్యుదయకరంగా పని చేసేవారిలోనూ వేగంగా దుర్లక్షణాలు వచ్చేస్తున్నాయి. ఒకప్పుడు త్యాగాలకు ప్రతీకగా నిలిచినవారూ రోజురోజుకూ వ్యక్తి వాదులవుతున్నారు.

ఇండియాలో ఉద్యమాలు చేసినవారెందరో ఇప్పుడు స్టేట్స్‌లో వ్యాపారాల్లో, ఉద్యోగాల్లో ఉన్నారు. అలాంటివారెందరో అప్పుడప్పుడూ కలుస్తుంటారు. చాలా విషయాలు చర్చిస్తుంటారు.

"మనమెటూ సంపాదనలో పడిపోయాం. ఇండియాలో ఉద్యమాలు బలపడాలన్నా ఫండ్స్ కావాలి. మనం కొంత మంది మిత్రుల్ని సెలెక్ట్ చేసుకుందాం. వారికి ఆర్థికంగా సహకరిద్దాం" అనుకున్నారు.

"ఈ విషయం అక్కతో మాట్లాడాలి" అనుకున్నాడు.

మెల్లగా అమర్‌కి కూడా నిద్రపట్టింది.

'అమ్మా-మామయ్యా మీ ఊరు వచ్చింది' అంటోంది చైతన్య.

ఇద్దరూ ఉలిక్కిపడి లేచారు.

"అమ్మమ్మా" అని చైతన్య గొంతు వినగానే ఉద్వేగంతో వచ్చి తలుపు తీసింది.

ఎదురుగా కూతురు-కొడుకూ కనిపించారు. ఆమె ఊహించని దృశ్యం అది. కొంతసేపు తేరుకోలేకపోయింది.

వాళ్ళూ అదే స్థితిలో ఉన్నారు. చాలా సంవత్సరాల తర్వాత చూస్తుండటంతో అమ్మ కొత్తగా అనిపిస్తోంది.

ఆమెలో వయసు తాలూకు భారం కనిపిస్తోంది.

'రండి' అని వెనక్కి తిరిగింది.

పద్మ, అమర్ ఇంట్లో కాలు పెట్టారు. హాల్లో కుర్చీల్లో కూర్చున్నారు. ఓసారి ఇల్లంతా చూసుకున్నారు. ఇదివరకటిలా తమ గదులలోకి వెళ్లటానికి ఏదో అడ్డుపడుతోంది. చైతన్య మాత్రం అమ్మమ్మతో

దొడ్లోకి వెళ్లింది.

'ఏమిటే మీ అమ్మతోనూ, మావతోనూ నా మీద యుద్ధానికొచ్చావా? '

'కాదు. సంధికొచ్చాను' అంది నవ్వుతూ.

'ముందు మీ అమ్మా నాన్నకి సంధి చెయ్యి. నాదేముంది, ఇవాళో రేపో పోయే దాన్ని' అంది.

చైతన్య ముఖంలో నవ్వు మాయం అయింది.

'అవునూ మీ అత్తనీ, కూతుర్ని తీసుకు రాలేదా? '

'నువ్వే అడగొచ్చుగా' అంది కోపంగా చైతన్య.

మనవరాలికేసి చూసి 'ఏమిటే.. నీకు మీ అమ్మా-నాన్నని అన్నానని కోపం వచ్చిందా? అయినా మీ మావయ్య వాళ్ళకు తీసిపోడులే' అని గొణుక్కుంది. 'అలా నిలబడతావే? వాళ్లకి ఏం కావాలో చూడు. నీ వయసులో మేం ఇలా ఉండే వాళ్ళం కాదు. పైగా కథలూ- కాకరకా యలూ రాస్తానంటావు' అంది.

'నువ్వు నా మీద పడుతున్నావా? ' అంటూ వెళ్లింది చైతన్య.

ఇంకా ఇద్దరూ హాల్లోనే ఉన్నారు.

'మావయ్యా ఇది మీ ఇల్లు. చూస్తుంటే మీరు బంధువుల్లా వచ్చినట్లు కనిపిస్తు న్నారు' అంది చైతన్య.

పద్మ-అమర్ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. అమర్ లేచి అమ్మ దగ్గ రకు వెళ్ళాడు.

'ఎలా వున్నావమ్మా? '

'బాగానే వున్నా'

'నా మీద ఇంకా కోపం పోలేదా? '

'నాకు ఎవరి మీదా కోపం లేదు. మీరే మన్నా చిన్నపిల్లలా కోప్పడి చెప్పటానికి. సంపాదిస్తున్నారు. గొప్ప గొప్ప పనులు చేస్తున్నారు. నీ సంపాదన చూసి, నీ అక్క సేవలు చూసి సంతోషపడుతున్నా' అంది అదోలా.

'సరేనమ్మా... మేం రెండు రోజులు నీ దగ్గర ఉండాలని వచ్చాం. ఈ రెండు రోజులూ అన్నీ మరిచిపోదాం. కనీసం ఈ జ్ఞాపకాల్తోనన్నా వెళ్తాను. నీకు ఇష్టంలేని పనులు ఏమీ చేయవద్దు. మాతో రమ్మని కూడా మేం అనం. నువ్వు మాత్రం చిన్న ప్పుడు మాతో ఎలా ఉన్నావో అలా వుండ టానికి ప్రయత్నం చెయ్యి' అనేసి వచ్చాడు అమర్.

పద్మ-అమర్ అంతకుముందే అనుకు న్నారు, అమ్మను బాధపెట్టే ఏ విషయం గురించి మాట్లాడకూడదని.

ముందు కాఫీలు వచ్చాయి. అప్పటిక ప్పుడు ఏదో టిఫిన్ చేసింది. పక్కింటివా రితో మాట్లాడింది. ఓ నాటుకోడిని తెప్పిం చింది. పద్మ కూడా అమ్మ పక్కన తిరుగు తోంది.

భోజనాలు అయ్యాక పద్మ-అమర్ తెలి సినవారింటికి వెళ్ళారు. చైతన్య అమ్మమ్మ దగ్గరే ఉండిపోయింది. అప్పుడు 'మధు' ఫొటోని చూసుకుంది.

'నీ పోలికలు వచ్చాయమ్మమ్మా' అంది.

'వాడు ఫొటోని చూపించే బదులు మన వరాలిని చూపించవచ్చు గదా' అంది.

'మావయ్య ఆఫీస్ పనిమీద వచ్చారంట. అత్తయ్య వాళ్ళని పంపిస్తానన్నాడు'

ఆమె తలూపింది.

'అమ్మమ్మా- మావయ్య నన్ను అక్కడికి వచ్చేయమంటున్నాడు. వెళ్లనా' అంది ఏమంటుందోనని. ఆమె ముఖంలో వెంటనే తేడా కనిపించింది.

'నిన్నూ రమ్మంటున్నాడా... తీసుకెళ్ళ మను. అయినా ఇలాంటివన్నీ నన్ను అడు గుతావెందుకు? నీకు ఇష్టమయితే వెళ్ళు. నాకు ఇష్టం లేదు.'

'ఎందుకని? మనుషులందరూ ఒకేచోట బతకలేరు. మన దేశంలోనే ఇతర

రాష్ట్రాలు వెళ్తున్నప్పుడు విదేశాలు వెళ్తే తప్పేంటి?' అంది చైతన్య.

'మీ అమ్మని ఎవరన్నా మా సమస్యలు తీర్చమని అడిగారా? మీ నాన్నని సంపాదించుకుంటే కాదని అన్నారా? వాళ్లు ఆ పనులు ఎందుకు చేస్తున్నారు? మనం బతకటంతోపాటు ఇంకొకరికి సహాయపడాలని. దేశం కూడా అంతే. ఈ దేశంలో పుట్టాం. ఇక్కడ పెరిగాం. చదువుకున్నాం. ఇక్కడ మన తెలివితేటలు ఉపయోగపడితే బాగుంటుంది. డబ్బుకి అంతం ఎక్కడ? మనిషికి తృప్తి లేకపోయాక ఇంక మాట్లాడడానికి ఏమీ మిగలదు' అంది ఆమె. చైతన్య తలూపి లేచి వెళ్లింది. తర్వాత అమ్మమ్మను మావయ్య కెమెరాతో ఫొటోలు తీసింది.

అలాగే హాండీక్యామ్‌తో షూట్ చేస్తుంటే, 'ఇవన్నీ ఏమిటే?' అంది.

'రేపు నువ్వుండవు. నీ జ్ఞాపకాలుంటాయి'

'అవి ఎవరికి కావాలి'

'నాకూ- మధుకి, మా పిల్లలకి. చాలా..' అంది.

అప్రయత్నంగా మనవరాలిని దగ్గరకు తీసుకుంది.

'మనసు నిండే మాటన్నావే. నేను బతికుండగా మధుని చూస్తానంటావా?' అంది.

'ఎందుకు చూడకూడదు. నువ్వు ఒప్పుకుంటే మావయ్య నిన్ను అమెరికా తీసుకువెళ్తాడు. అక్కడ నువ్వు వుండాల్సిన పని లేదు. ఓ నెల రోజులుండి వచ్చేయవచ్చు'

'అంతదూరం నేను ప్రయాణం చేయలేను లేవే' అంది.

సాయంకాలంపూట అందరూ కలిసి చేల దగ్గరకు వెళ్లారు. పద్మతో ఆమె మాట్లాడిందిగాని గోపాల్ విషయం మాత్రం ప్రస్తావించలేదు. అమ్మ అడిగితే ఏం చెప్పాలో ముందే నిర్ణయించుకుంది పద్మ.

'మావయ్యా ఈసారి నువ్వు మధుతో వచ్చివుంటే చాలా బాగుండేది. అమ్మమ్మకి మధుని చూడాలనుంది' అంది చైతన్య.

'వచ్చే సంవత్సరం వీలును బట్టి వస్తాంరా' అన్నాడు. అమ్మను కలిసి 'అమ్మా ఓసారి కంప్లీట్ టెస్టులు చేయించుకుంటే బాగుంటుంది. రేపు మాతో హైదరాబాద్ వచ్చేయకూడదూ' అని అడిగాడు.

'నాకేం సమస్య లేదు. నేను బాగానే ఉన్నాను' అంది.

'నువ్వు ఏమనుకోనంటే.... అని ఆగాడు.'

'ఏ విషయం గురించి మాట్లాడుతున్నావ్?'

'నీకు డబ్బులు అవసరం వున్నా లేకపోయినా నేను నీ పేర ఎకౌంట్ ఓపెన్ చేయాలనుకుంటున్నాను. ఓ లక్ష రూపాయలు అందులో వేస్తాను' అన్నాడు.

'లక్ష రూపాయలా. నేనేం చేసుకోను' అంది.

'ఏమీ చేసుకోకపోతే అలానే వుంచమ్మా. అయినా ఎప్పుడు ఏ అవసరం వస్తుందో తెలియదుగా'

'ఏ అవసరం వచ్చినా ఫర్వాలేదు. నాకు రెండెకరాల భూమి వుంది. అది అమ్ముకుంటాను' అందామె.

'భూమిని అమ్మటం ఎందుకులేమ్మా' అన్నాడు అమర్.

'నీకు భూమంటే అంత ప్రేమ వుందా?' అంది.

అమర్ మాట్లాడలేదు.

'నాకు డబ్బులు వద్దు అమర్. ఇది కోపంతో అనే మాట కాదు. నాకు అవసరం లేదు. అంతే' అంది.

'సరే. ముందే చెప్పాను. నిన్ను బాధ

పెట్టడం నాకు ఇష్టం లేదని' అన్నాడు.

'అమ్మమ్మా మాతో హైదరాబాద్ వస్తున్నావా? ' అంది చైతన్య.

'లేదు. నీ పరీక్షలు ఎపుడు తెలుస్తాయి'

'ఇంకో రెండు వారాలు పట్టొచ్చు రిజల్ట్స్ రావటానికి'

'అప్పుడు వస్తాలే' అంది.

పద్మ మాత్రమే అమ్మతో ఎక్కువ మాట్లాడలేదు. తిరిగి వాళ్లు హైదరాబాద్ ప్రయాణం అయ్యారు.

'మొత్తంమీద ఈసారి నాకు తృప్తిగా వుందక్కా' అన్నాడు అమర్.

★ ★ ★

అమర్ గోపాల్‌ని కలుసుకున్నాడు ఇంటి దగ్గర.

చైతన్య కూడా అక్కడే వుంది.

'ఏంటి బావగారూ విశేషాలు'? అన్నాడు అమర్.

'నీకు తెలియని విశేషాలేముంటాయి అమర్. మీ అక్కతో నువ్వు మాట్లాడి వుంటావు కదా' అన్నాడు గోపాల్.

'మాట్లాడాను. నేను ఎవర్నీ కన్విన్స్ చేసే స్థితిలో లేను. పర్సనల్‌గా చూస్తే మా అమ్మ మాకు దూరంగా వుంటోంది. ఇప్పుడు ఎవరూ ఎవరి అభిప్రాయాలను అమాంతం మార్చేయలేరు. ఎవరు అనుకునేది వారికి సరైందనిపిస్తుంది. సో... మనం మన పద్ధతుల్లో ముందుకు పోవటమే' అన్నాడు.

'ఏది ఏమైనా మీ అక్కలో కొంత ట్రెడిషనల్ ఔట్‌లుక్ వుందనిపిస్తోంది. ఇంకొంచెం బ్రాడ్‌గా ఆలోచిస్తే బాగుంటుంది. అయితే నువ్వన్నట్లు అనుభవమే ఎవరినైనా మార్చుతుంది' అన్నాడు గోపాల్.

వాళ్లు కొన్ని రాజకీయ విషయాల గురించి మాట్లాడుకున్నారు.

'ఓకే బావా మళ్ళీ కలుస్తాను' అన్నాడు అమర్.

ఆ తర్వాత పద్మను కలిసినపుడు అడిగాడు.

'అక్కా! నువ్వు ఈ పనులన్నీ చేయాలంటే డబ్బులు కావాలి. ఈ ఖర్చులన్నీ ఎలా భరిస్తున్నావ్. ఎక్కడ్నుంచయినా నీకు నిధులు వస్తున్నాయా? '

'లేదు తమ్ముడూ... మేం బయటి సంస్థల నుంచి నిధులు తీసుకోవాలనుకోవటంలేదు. వాళ్ల దగ్గర నుండి తీసుకుంటే కొన్ని షరతులు పెడతారు. వాటికి లోబడి మేం పనిచేయాల్సి ఉంటుంది. ముఖ్యంగా అలాంటి సంస్థల పట్ల మాకు ఓ అవగాహన ఉంది. అందుకే మేం విరాళాలు తీసుకున్నా వ్యక్తుల నుండే. ప్రతి పైసాకి జమాఖర్చులుంటాయి. అలాగే మా వాళ్లు చాలామంది తమ ఆదాయం నుండి లెవీ కడుతుంటారు' అంది పద్మ.

అప్పుడు స్టేట్స్‌లో ఉన్న కొందరు మిత్రుల గురించి చెప్పి- 'మేం వ్యక్తులమే. మాకు ఎలాంటి షరతులూ లేవు. మీరు మహిళల సమస్యల మీద పనిచేస్తున్నారు. కాబట్టి మా వంతు సహకారం అందిస్తాం. నీ అభిప్రాయం చెప్పు' అన్నాడు.

'తమ్ముడూ మేం చేసే పనిలో న్యాయం ఉందని మీరు అనుకుంటున్నారా లేదా అనేది నాకు ముఖ్యం. వెంకటేశ్వరస్వామి హుండీలో అజ్ఞాత భక్తులు వేసిన కానుకల్లా మీరు ఎంతో కొంత ఇద్దామనుకుంటున్నారా? ' అంది.

'వాళ్లు ఎందుకలా చేస్తారో మాకు తెలియదు. మేమయితే మీకు బ్లాక్‌మనీ పంపించాలనుకోవటంలేదు. ఇంక మీరు చేస్తున్న పనిపట్ల మాకు అంగీకారం ఉంది. మాకు కావలసింది హత్యలు లేని ప్రపంచం. అందరినీ సమానంగా చూసే సమాజం' అన్నాడు అమర్.

'చూద్దాం తమ్ముడూ. నీ ప్రపోజల్

చెప్పావు. నేను ఒక్కదాన్నే నిర్ణయం తీసుకోలేను. ఇది నా కుటుంబ సంస్థ కాదు. మిగతావారందరితో చర్చించాలి. వాళ్ళందరూ కన్విన్స్ అయితే అప్పుడు చూద్దాం. ఈ డబ్బు అనేది చాలా ప్రమాదయమయింది' అంది పద్మ.

'నేను అలా అనుకోవటం లేదు. డబ్బు చాలా అవసరం. మనం ఏ చిన్నపని చేయాలన్నా డబ్బు లేనిదే అడుగు ముందుకు పడదు. పని చేయగలరు చాలామంది. కానీ డబ్బులు ఇవ్వలేరు'

'నేను అంటున్నది విరాళాల గురించి తమ్ముడూ. మనకు అవసరమైన దానికంటే ఎక్కువ విరాళాలు వచ్చినా ప్రమాదమే. డబ్బు మనుషుల మీద ఎప్పుడూ ప్రభావం చూపిస్తూనే వుంటుంది. అందులో వ్యక్తిగత ప్రతిష్ఠ పెంచుకోవటం, సహచరుల్ని కాక అనుచరుల్ని తయారుచేసే ప్రమాదాలున్నాయి. నేను వాటి గురించి మాట్లాడుతున్నాను' అంది పద్మ.

**తీవ్రవాదులు పదిమందిని చంపేశారు- బస్‌లో వెళ్తున్న వారిని బయటకు లాగి నిర్దాక్షిణ్యంగా- ఇది కాశ్మీర్‌లో జరిగింది.**

'ఓకే... మీరు డిస్కస్ చేయండక్కా. నేను చైతన్యని స్టేట్స్ రమ్మన్నాను. ఇక్కడే గ్రాడ్యుయేషన్ చేస్తానంది. తనకి ఎప్పుడు ఎలాంటి సహకారం కావాలన్నా అందిస్తాను. అలాగే అమ్మ పేరుతో ఎకౌంట్ ఓపెన్ చేయాలనుకున్నాను. హాస్పిటల్ బిల్స్ ఇండియాలో కూడా తలకు మించుతున్నాయి. అమ్మ ఒప్పుకోలేదు. నేను చైతన్య పేరుమీద ఎకౌంట్ ఓపెన్ చేస్తున్నాను. చైతూ ఒప్పుకుంది. మనవరాలి ద్వారా మనం ఏం చేసినా అమ్మ ఒప్పుకుంటుంది. ఇంకా...' అని ఆగాడు.

'చెప్పు'

'బావను కలుసుకున్నాను. నువ్వు కొంచెం ట్రెడిషనల్‌గా ఆలోచిస్తున్నావని, ఇంకొంచెం బ్రాడ్‌గా ఉండాలని ఆయన అభిప్రాయం.'

పద్మ నవ్వింది.

'సరే. మీ ఇద్దరి గురించి నేను మాట్లాడేదేం లేదు. మళ్ళీ నేను ఎప్పుడొస్తానో చెప్పలేను. నీకు ఆర్థికంగా, హార్దికంగా ఏ అవసరం వచ్చినా ఈ తమ్ముడున్నాడని గుర్తుపెట్టుకో. శివాని కూడా ఈ విషయంలో కన్సర్వేటివ్ కాదు'

పద్మ తలూపింది.

అమర్ వెళ్ళిపోయాడు.

★ ★ ★

సమాజం మళ్ళీ ఒక్కసారిగా ఉలిక్కిపడింది

తీవ్రవాదులు పదిమందిని చంపేశారు- బస్‌లో వెళ్తున్నవారిని బయటకు లాగి నిర్దాక్షిణ్యంగా- ఇది కాశ్మీర్‌లో జరిగింది.

అలాగే నక్సలైట్లు కూడా ఇన్‌ఫార్మర్స్ అనే అనుమానంతో ముగ్గుర్ని చంపేశారు. ఓ మందుపాతర పేలిన సంఘటనలో కూడా పోలీసుల్తోపాటు ముగ్గురు పౌరులు మరణించారు.

ఈ సంఘటన జరిగిన వారం రోజుల తర్వాత ఎన్‌కౌంటర్ జరిగింది.

ప్రజాస్వామ్య హక్కుల సంఘం ఎన్‌కౌంటర్‌ని ఖండించింది.

అది బూటకం అంది. నిజనిర్ధారణ కమిటీ వాస్తవాలను తెలుసుకోవటానికి వెళ్ళింది.

గోపాల్ ఈసారి ఆ కమిటీలో లేదు. అయినా అతను మీడియా ముందు మాట్లాడాడు. ఆ రోజు రాత్రి ఇంటికి రావటం ఆలస్యం అయింది. నేనప్పటికే నిద్రపోయుంటానని అనుకున్నాడు. కానీ తన





కోసం ఎదురు చూస్తూ నేను కన్పించ
డంతో,

'ఏంటమ్మా ఇంకా నిద్రపోలేదా?'
అన్నాడు.

'నిద్ర రావటం లేదు నాన్నా'



'ఏమైంది చైతూ...'

'ఈ దేశంలో ప్రజాస్వామ్య హక్కులు ఎవరికోసం నాన్నా' అంది తను సూటిగా.

'అదేంటమ్మా అలా అడిగావు. ప్రజల కోసమే.'

'పోలీసులు ఎవరినీ కాల్చేయకూడదు. ఎవరు తప్పు చేసినా విచారణ జరిగాక కోర్టు శిక్ష విధిస్తుంది. అంతేగాని చట్టాన్ని ఎవరూ చేతిలోకి తీసుకోకూడదు. అవునా...'

'అవునమ్మా'

'మరి మనిషి జీవించే హక్కుని ఎవరైనా తీసుకోవచ్చా తమ చేతుల్లోకి?'

'నువ్వు శంకర్ గురించి అడుగుతున్నావా చైతూ'

'కాదు. నక్సలైట్ల గురించి అడుగుతున్నాను. తీవ్రవాదుల గురించి అడుగుతున్నాను. వారికి మాత్రం ఎవరినైనా చంపే హక్కు వుంటుందా?' అన్నాను ఆవేశంగా.

గోపాల్ మాట్లాడలేదు.

'చెప్పండి నాన్నా... తప్పుని తప్పుగా చెప్పండి. పోలీసులెంత ఒన్ సైడెడ్‌గా వున్నారో మీరూ అలానే వుండకూడదుగా. ఇన్ని సంవత్సరాలుగా నక్సలైట్లు చాలా మంది చనిపోయారు. చాలామందిని చంపారు. వీళ్లెవరూ కోర్టుదాకా రాకుండానే న్యాయం పొందుతున్నారు. అవునా!' అంది తను.

'చైతూ... నువ్వు నిద్రపోమ్మా. టైం అయింది' అన్నాడు గోపాల్.

'అంటే నేను మీకు ఎలా కనిపిస్తున్నాను' అంది, తను ఒకింత కోపంగా.

'ఎలా కనిపించటం ఏమిటమ్మా -నువ్వు మా అమ్మాయివి. ఇలాంటి విషయాలను ఆవేశంతో నిర్ణయించలేం. నీ వయసు అలాంటిది. మనం తీరిగ్గా వున్నప్పుడు మాట్లాడుకుందాం. ఇవన్నీ ఇప్పటికిప్పుడు పరిష్కారం అయ్యే సమస్యలు కాదు' అన్నాడు నాన్న.

'ఆ విషయం మాత్రం మీరు నమ్ముతున్నారా? ఇలా చేస్తుంటే మాత్రం ఈ సమాజం ఎప్పటికీ మారదు. ఎవరిష్టం వచ్చినట్లు వారు ప్రవర్తిస్తే ఈ సమాజం ఎందుకు? మీరు అధికారంలోకి రాలేదు. ఇప్పుడే ఇంతమందిని చంపుకుంటూ పోతున్నారు. మీరు అధికారంలోకి వస్తే ఇంకెంతమందిని ఊచకోత కోస్తారో? మీరు ప్రజాస్వామ్య హక్కుల సంఘం అనే పేరును మార్చుకోండి. మీరు ఎవరి హక్కులకోసం నిలబడుతున్నారో వారి పేరే పెట్టుకోండి' అనేసి నా గదిలోకి వెళ్లిపోయాను విసురుగా.

★ ★ ★

నాకు చాలా బాధగా వుంది.

ఎన్‌కౌంటర్లలో చనిపోయిన వారిని చూస్తుంటే బాధ కలుగుతుంటుంది. అదే సమయంలో మందు పాతర్లు పేలి పోలీసులు చనిపోయినా, నక్సలైట్లు ఎవరినన్నా చంపేసినా కూడా. వాళ్లు శత్రువులే కావచ్చు. చంపటం మించి ఇంకో మార్గం లేదా? కొన్నిసార్లు ఒకరు అనుకొని ఇంకొకర్ని చంపేసిన సందర్భాలున్నాయి. ఒక వ్యక్తి మరణంతో ఆ కుటుంబాలు, ఆ వ్యక్తి మీద ఆధారపడిన ఇతరుల జీవితాలు ఎలాంటి పెనుమార్పులకు గురవుతాయో చెప్పలేం. చనిపోయినవారే నయం అనిపిస్తారు.

ఇలా అనిపించటం నా బలహీనతా అనిపిస్తోంది.

శంకర్‌కి ఉరిశిక్ష రద్దు కావాలని నాన్న అనటంలో వున్న వాస్తవికతను నేను అర్థం చేసుకుంటున్నాను. ఇలాంటి దశలోనే నాన్న మనుషులందరి విషయాల్లో సమానంగా వ్యవహరించటం లేదని అర్థమయింది.

నాన్న శంకర్‌కి ఉరిశిక్ష రద్దు కావాలన



టంలో మానవత్వాన్ని మించినదేదో వుంది. ఆయన నాకు తెలియని విషయాల్ని అర్థమయ్యేలా చెప్పవచ్చు చెప్పాలి. కానీ ఆ రాత్రే కాదు. ఆ తర్వాత కూడా అలాంటి ప్రయత్నం చేయలేదు.

ఆ విషయం మరిచిపోయినట్లు ప్రవర్తించారు.

నాన్నే కాదు. అలాంటివారిని నేను చాలా మందిని చూశాను. పోలీసులు చంపేసిన వారిమీద పాటలు రాయటం తప్పుకాదు. కానీ నక్సలైట్లు పొరపాటున చంపేసిన వారిమీద ఎప్పుడైనా ఓ గీతం రాశారా?

వారెప్పుడయినా వార్తల్లో వున్నారా?

వారి కుటుంబాలు ఏమైపోయాయనే ఆలోచన ఎవరికైనా వుందా? అసలు అలా చనిపోయేవారు ఎవరు? సామాన్యులు, వెనుకబడినవారు. అణచివేతకు గురయ్యేవారు బతుకు కోసం పోరు చేస్తున్నారు. వారికి ప్రభుత్వాలు సాయం చేశాయా? లొంగిపోయిన నక్సలైట్లకి మాత్రం లక్షల రూపాయల ఆర్థిక సాయం. ఎన్ని హత్యలు చేస్తే అంతగా వాళ్ల తలలకి వెల పెరుగుతుంది. అదే వారి పునరావాసానికి ఇస్తారు. అంటే సమాజంలోకి ఏ వ్యక్తయినా తను తీవ్రవాదంలోకి వెళ్లి- కొంతమందిని చంపి, ప్రాణాపాయాన్ని తప్పించుకుని లొంగిపోతే బతుకుతెరువు దొరుకుతుందనేగా!

ఎంతటి వికృతమైన ప్రజాస్వామ్యం ఇది!

నాన్న అమ్మను విమర్శించటంలో అర్థం వుందా?

నాలో రకరకాల భావాలు. నేను తలనొప్పితో, అశాంతితో నలిగిపోతున్నాను.

కసి... కసి...

శంకర్‌లో ఎంత కసి వుందో పోలీసుల్లోనూ అంత కసి వుంది. తీవ్రవాదుల్లోను వుంది. యుద్ధనీతి అని ఒకటుందని చరిత్ర పుస్తకాల్లో చదువుతుంటే ఇప్పుడు నవ్వొస్తుంది.

ఏ పవిత్ర యుద్ధాల్లో ఈ నీతి ఉంది?

పిల్లల మీద- స్త్రీల మీద- జనావాసాల మీద దాడులు చేయకూడదనే సూత్రాన్ని ఎవరు పాటిస్తున్నారు?

ఏ యుద్ధం చూసినా ఏముంది! పచ్చి నెత్తురు ప్రవాహాలు... అది వ్యక్తిగతమో, సామూహికమో ఏదయితే నేమిటి... ఎటు చూస్తే అటు ఓ విధ్వంసం. మానవ ప్రాణాలకు విలువ లేని ఈ స్థితి నుండి బయటపడకుండా నాగకరికత ఏమిటి?

నాన్నను నేను అడగాలనుకుంటున్న ప్రశ్నలనేకం.. ప్రేమంటే ఏమిటన్న ప్రశ్నకు జవాబు లేదు.

మీ రాజ్యంలో ఉరిశిక్షలుండవా? ఇదీ నేను అడుగుతున్న ప్రశ్న.

నేరం చేసేవారిపట్ల మీరు అనుసరించే విధానం ఏమిటి?

మీ శిక్షాస్మృతి ఏమిటి? మీ దృష్టిలో ఏది నేరం? ఏది ధర్మం?

మీ పరిపాలనలో లంచగొండులకు, ప్రభుత్వాల్ని మోసం చేసేవారికి మీరు ఏలాంటి శిక్షలు విధిస్తారు?

వారిలోనూ పరివర్తన తేవడానికి ప్రయత్నం చేస్తారా?

ఒకటా రెండా వేల వేల ప్రశ్నలు పుట్టుకొస్తున్నాయి.

'కుడి ఎడమల దగాదగా' అన్నారు. నిజమేనేమో.

నేను ఆలోచించే మార్గం సరైందేనా?

ఏదో కొసకు కట్టుబడకపోతే అశాంతేనా?

అసలు ఇవన్నీ తలకెక్కించుకుని బాధపడటం ఎందుకు?




పద్మ మొత్తం మీద కొంత సమాచారాన్ని సేకరించింది.

అందులో పుణేకి చెందిన అక్క చెల్లెళ్లు వున్నారు. వారు రేణుక షిండే, సీమా గవిటే. వీళ్లు అయిదుగురు పిల్లల్ని అపహరించారు. ఆ తర్వాత కిరాతకంగా చంపేశారు.

చిన్న పిల్లల్తో చిన్నవో పెద్దవో నేరాలు చేయించటం- అవసరం తీరిపోయాక వారిని చంపేయటం. వారికి మరణశిక్షను విధించారు. పద్మ వాళ్లిద్దరి ఫొటోలు చూసింది. వాళ్లు ఇంతటి దారుణం చేసుంటారా అనిపించింది. ముఖాలకూ నేరాలకూ సంబంధం ఉండదని తనకి తెలుసు.

బొంబాయి బాంబు పేలుళ్లల్లో రుబీనాకు పాత్ర వుందని టాడా కోర్టు అభిప్రాయం. ఆ సంఘటనలో 257 మంది చనిపోయారు. రుబీనా యాకోబ్ భార్య.

రాజీవ్‌గాంధీ హత్య కేసులో నళినికి ఉరిశిక్ష విధించినా తర్వాత యావజ్జీవ కారాగార శిక్షగా మార్చటం జరిగింది. ఇంకొంత మంది మహిళా నేరస్థులు వుండవచ్చుగానీ, వారి నేరాల స్వభావం అంత తీవ్రమైంది కాదు.

అంటే నేరప్రపంచమంతా పురుషుల చుట్టూనే తిరుగుతుంది. అలాగే ఉరిశిక్షల విషయం చూసినా సింగపూర్ మొదటి స్థానంలో ఉంది.

ఎలా చూసినా భారతదేశంలోనే ఉరిశిక్షలు తక్కువగా వున్నట్లు లెక్క.

అయితే ఉరిశిక్ష అమలులో ఉందా లేదా అనేదానితో సంబంధం లేకుండానే హత్యాపరంపర సాగుతోంది.

ఇది ప్రపంచ పరిణామం.

ఇప్పుడు ఈ అంశం మీద తర్జన భర్జనలు జరగాలి. సమాజం పరిపక్వదశకు చేరాలంటే ఈ అడ్డంకుల్ని దాటి తీరాలనుకుంది పద్మ.

★ ★ ★

నేను వరూధిని అమ్మమ్మను కలిశాను.

నా మనసులో చెలరేగుతున్న భావాల్ని చెప్పాను. ముఖ్యంగా నేను హాసిని విషయంలో తప్పు చేస్తున్నానా అనే భావం కలిగింది.

మొదట్లో నేను ఎంత బాధపడ్డానో, భయపడ్డానో నాకు గుర్తుంది. అంతేకాక నేను ఆ కుటుంబంతో అనుబంధం పెంచుకున్నాను. శంకర్‌కి ఉరిశిక్ష అమలు చేయటమే తగిన శిక్ష అనుకున్నాను.

ఇప్పుడు నేను సందేహంలో ఉన్నాను.

శంకర్ యువకుడు. అతను కుటుంబం అదుపులో లేడు. అతని స్నేహాలూ, అతను చూసిన సినిమాలు, ఇంకా అతను చూస్తున్న వ్యక్తులు- ముఖ్యంగా రాజకీయాల్లో పైకి వచ్చిన అనేకమంది గూండాలూ, ఖూనీకోర్లు- వీళ్ళే అతనికి ఆదర్శం కావచ్చు.

ముఖ్యంగా స్త్రీలంటే అతనికి భక్తి-గౌరవం లేకపోవచ్చు. పురుగుల కంటే హీనమని అతననుకోవచ్చు.

కానీ కొన్ని దశాబ్దాలుగా దేశంలో విప్లవం తెస్తామని ముందుకొచ్చిన పార్టీలు, ఎంతోమంది అమూల్య కార్యకర్తల్ని, నాయకుల్ని కోల్పోయిన పార్టీలు... తమ ఆచరణవల్ల ఎలాంటి ఫలితాలు వస్తున్నాయో ఎప్పటికప్పుడు అనుభ

వంలోకి వస్తున్నా- విచక్షణ లేకుండా అదే హింసాకాండని కొనసాగిస్తున్నప్పుడు 'శంకర్'ది తప్పేముంది?

పార్టీకి, పార్టీలో పనిచేస్తున్న వారిమీద ఏమాత్రం కంట్రోల్ లేదు.

శంకర్ మీద అతని కుటుంబానికి కంట్రోల్ లేదు. అంతే...

మొత్తంగా చూసినప్పుడు ప్రాణాలు ఇవ్వాలన్నా- తీయాలన్నా వారు చాలా సులభంగా చేస్తారా పనుల్ని.

అలాంటి వారిని పోలీసులు 'ఎన్‌కౌంటర్' రూపంలో కాల్చేస్తున్నారు. ఆ రకంగా అణచివేయటానికి ప్రయత్నిస్తున్నారు.

'శంకర్'ని కూడా అలా 'ఎన్‌కౌంటర్' చేసి ఉంటే బాగుండేదా? నాలో అలాంటి ఆలోచన పెరిగి పెద్దదయింది.

నేరాన్ని నిర్ణయించటంలో జరుగుతున్న సుదీర్ఘమైన క్రమం వల్ల ఇదంతా జరుగుతోందా?

అంతలోనే అనిపించింది. ఇన్ని దశాబ్దాలుగా కొన్ని వందల మందిని పోలీసులు చంపినా, ఈ ఉద్యమాన్ని ఎందుకు రూపుమాపలేక పోయారు?

ఇప్పటికీ ఎందుకని ఇంకా అలాంటి ఉద్యమాల్లోకి జనం వెళ్తున్నారు? చనిపోతామని తెలిసినా సిద్ధపడుతున్నారంటే వారి జీవితాలు అంత దుర్భరంగా ఉండాలి.

అంటే 'ఎన్‌కౌంటర్' ఈ సమస్యకి పరిష్కారం కాదు.

వ్యక్తులకయినా- పార్టీలకయినా!

మరేమిటి?

ఒకప్పుడు ఉరి శిక్షను అమలు చేసే ప్రభుత్వాలు అత్యంత దుర్మార్గమైనవి. ఆ అణచివేత అనాగరికమైనది.

ఇప్పటి పరిస్థితి ఏమిటి?

ఈ ప్రభుత్వాలు ఎవర్ని ఉరి తీస్తున్నాయి? ఎవరికి క్షమాభిక్షను ప్రసాదిస్తున్నాయి?

అసలిప్పుడు నేను ఎటువంటి స్టాండ్ తీసుకోవాలి?

'ఉరిశిక్ష కావాలా? వద్దా?'

అంతా విన్నాక వరూధినిగారు చిరునవ్వు నవ్వారు.

'నీలో అపరాధ భావన ఎందుకమ్మా?' అన్నారు.

నేను మాట్లాడలేకపోయాను.

'ఓ రకంగా నువ్వు ఔట్ సైడర్‌వి. జరిగినదాంతో నీకు సంబంధం లేదు. నువ్వు ప్రేక్షకురాలివి. కాకపోతే హాసిని నీకు స్నేహితురాలు. నీకే కాదు, మీ కాలేజీలో ఇంకొంత మందికి స్నేహితురాలు అవునా?' అంది.

నేను తలూపాను.

'వాళ్ళందరూ మొదట బాధ పడ్డారు. తర్వాత ఆ విషయం మరిచిపోయారు. చదువుకుంటున్నారు. మీ అమ్మ- నాన్నలు ఈ కేసు విషయంలో పని చేస్తున్నారు. ఇద్దరూ ఏదో ఒక పరిష్కారం కోసం పోట్లాడితే వేరు. రెండు పరిష్కారాల కోసం వాళ్లు ఫైట్ చేస్తున్నారు. ఫలితం ఎలా ఉంటుందో తెలియదు. శంకర్‌కి ఉరిశిక్ష అమలు కావచ్చు కాకపోవచ్చు. మనం యుద్ధం చేయటమేనమ్మా. ఫలితాన్ని మనం నిర్ణయించలేం. కనిపించని ఎన్నో శక్తులు నిర్ణయిస్తాయి. అందుకని నీకు ఇంత మధనం అనవసరం. నువ్వు చంపలేదు- నువ్వు ఉరిశిక్ష వేయలేదు. ఈ రెండింటికీ స్పందిస్తున్నావు. మనం మన పరిమితులు తెలుసుకోవాలి. లేకపోతే ఎప్పుడూ బాధే' అన్నారామె.

'అంటే నన్ను మౌనంగా ఉండమంటారా?'

'మీ అమ్మా-నాన్నలు ఏం చేయాలో తేల్చుకున్నారు కాబట్టి అందుకు తగ్గట్టు

పని చేస్తున్నారు. నువ్వాపని చేసేంతవరకు నీకు బాధే. హాసినీ - శంకర్ విషయంలో ఏ పరిష్కారమైనా నీకు బాధని కలిగిస్తుంది' అన్నారామె.

వరూధిని అమ్మమ్మ బాగా చెప్పారు.

మంచో, చెడో ఓ నిర్ణయానికి వచ్చి పని చేసుకుపోయేవారికి ఎలాంటి బాధ ఉండదేమో!

★ ★ ★

నేను నాగపూర్‌లో చదవాలని నిర్ణయించుకున్నాను.

అమ్మకూ-నాన్నకు కూడా నిర్ణయం గురించి చెప్పాను.

'నీ ఇష్టం' అన్నారు. మొదట్లో 'సైకాలజీ' అంటే ఇంట్రెస్ట్. ఇప్పుడు మాత్రం నేను 'ఫిలాసఫి' చేయటానికే ఇష్టపడుతున్నాను. అయితే అంత దూరం వెళ్లాలా అనే అభిప్రాయం వారి మనసులో ఉంది. నేను హైదరాబాద్‌లో వుంటే మాత్రం కొన్ని జ్ఞాపకాల నుండి బయటపడలేను. ముఖ్యంగా హాసిని జ్ఞాపకాలు. అవన్నీ అమ్మా-నాన్నల్తో ముడిపడున్నాయి.

వారికి దగ్గరగా వుంటూ- ప్రతి క్షణమూ ఏదో ఒక ఉద్వేగానికి లోను కావాలి. అంతకుమించి ఓ కొత్త ప్రాంతంలో చదవటంవల్ల కొత్త పరిచయాలు ఏర్పడతాయి. కొత్త ఉత్సాహం కలుగుతుంది.

నేను అమ్మమ్మను నాతో వస్తావా అని అడిగాను. తను వస్తానంది. మేం ఓ చిన్న పోర్షన్ అద్దెకు తీసుకున్నాం. నాగపూర్‌లో తెలుగువారు చాలామంది వున్నారు. ఆ మాటకొస్తే ఈ దేశంలోనూ, ప్రపంచంలోనూ తెలుగువారు లేనిచోటంటూ లేదేమో!

నేను నాగపూర్ వెళ్లేముందు ఓసారి హాసిని వాళ్ల ఇంటికి వెళ్లాలనుకున్నాను. వీలయితే అమ్మమ్మతో. అమ్మమ్మ కూడా ఒప్పుకొంది.

మేం వెళ్లాం. అమ్మమ్మని పరిచయం చేశాను. నేను నాగపూర్ వెళ్తున్న విషయం చెప్పాను. ఆమె చాలా సంతోషపడింది.

సుధీర్ ఇంటర్‌లో కొస్తున్నాడు. 'లయ' కూడా ఇప్పుడు మామూలు ప్రపంచంలో పడింది. తను కూడా ప్రైవేట్‌గా డిగ్రీ చేస్తానని చెప్పింది. కాలేజ్‌లో చేరటం తనకు ఇష్టం లేదని చెప్పింది.

నేనూ- సుధీర్ విడిగా మాట్లాడుకున్నాం. అమ్మా-నాన్న ఇద్దరూ 'హాసిని' విషయంలో విడిగా వుంటున్నారని చెప్పినప్పుడు ఆశ్చర్యపోయాడు.

'మా వల్ల మీ కుటుంబం చీలిపోయిందంటే అమ్మ బాధ పడుతుంది' అన్నాడు.

'ఇది కేవలం హాసిని విషయమే కాదు సుధీర్. ఇప్పుడు సమాజాన్ని కుదిపేస్తున్న విషయం. మన పార్లమెంట్ మీద దాడి

## వెయ్యను వెయ్యనంటూనే

నంద్యాలలో ఓసారి 'చలో ఢిల్లీ' నాటకం వేశారు. నిర్వాహకుడు సుందరరావుకు అందులో పాత్రధారి ఆచారికి మాటా మాటా రావడంతో అతను వెళ్లిపోయాడు. అతను వెళ్లిపోతే మళ్లీ రాత్రికి నాటకం ఎలా అని నరసరాజు అడిగితే నువ్వున్నావుగదా? ఆ పాత్ర నువ్వే వెయ్యి.. అన్నాడతను. దాంతో ఆ రాత్రి ఆ వేషం వేశారు నరసరాజు. రాత్రి వేసిన వాడికంటే వీడే బావున్నాడని జనం అనుకున్నార్ట. 'వెయ్యను వెయ్యను గాక వెయ్యను అంటూనే సుందరరావు కోసం ఒక సారికాదు మూడు సార్లు ఆ పాత్ర వేయాల్సివచ్చింది' అంటారు నరసరాజు.



జరిగింది. ఇంకా పసిపిల్లలమీద దాడులు జరిగాయి. బాంబుపేలుళ్ల కేసులున్నాయి. ఇవన్నీ విచారణలో రకరకాల దశల్లో వున్నాయి. అలాగే బస్సు దహనం కేసు ల్లాంటివి. వాటిలో కొన్నింటిని యావజ్జీ వంగా మారుస్తున్నారు. కొన్ని కేసులు తిరగతోడుతున్నారు. అంటే రానున్న కాలంలో ఇదో పెద్ద చర్చనీయాంశం అవు తుంది. బహుశా ఈ తీర్పులూ- శిక్షలూ ఒకే కాలంలో వస్తాయి.

అప్పుడు మళ్ళీ గందరగోళం సృష్టి స్తారు. మహిళల కోసం పనిచేసేవారూ ప్రజల హక్కుల కోసం పనిచేసేవారు వీటికి దూరంగా వుండలేరు. అప్పుడయినా ఈ భేదాలు తప్పవు' అన్నాను.

'అంటే శంకర్ శిక్ష పడకుండా తప్పించు కుంటాడా? ' అన్నాడు.

'అది ఆ న్యాయాధిపతుల మీద ఆధార పడివుంటుంది సుధీర్. అలాగే ప్రజల చైతన్యం మీద కూడా. 'శంకర్'కి క్షమాభిక్ష పెట్టాలనే డిమాండ్‌కి మద్ధత్తు లభిస్తే, అతను ఉరి శిక్షనుండి బయటపడతా డేమో' అన్నాను.

'కానీ... ఓ మనిషిని చంపిన వ్యక్తి మళ్లీ ఆ కుటుంబం ముందు తిరుగుతుంటే వాళ్లకేం అనిపిస్తుంది. తమ జీవితాల్ని వెక్కిరిస్తున్నట్లు అనిపించదా. ఏ క్షణమైనా ఆ వ్యక్తి మీద ప్రతీకారం తీర్చుకోవాలనిపిం చదా' అన్నాడు కాస్త ఉద్రేకంగా.

'నేను అలా అనుకోను. అది ఆ వ్యక్తి మీద ఆధారపడి వుంటుంది. ఓ ఆవేశంతో హత్యలు చేసినా తర్వాత రుషుల్లా మారి నవారున్నారు. వారు తాము చేసిన తప్పుకి క్రుంగిపోయారు. ఇంకొంత మంది తమవల్ల అన్యాయం జరిగిన కుటుంబాల్ని ఆదుకున్నారు'.

'సినిమాల్లోనా? ' అన్నాడు వ్యంగ్యంగా.

'అలాంటి సినిమాలుండవచ్చు సుధీర్. నేను చెప్పేది వాస్తవం. ఎక్కడిదాకో ఎందుకు. మీ అమ్మగారు శంకర్ మీద జాలి పడ్డారు. అలాంటి తల్లులు చరిత్రలో లేరా? ' అన్నాను.

'మీరు కూడా మారిపోయారు' అన్నాడు సుధీర్. ·

'నువ్వు కూడా మారతావేమో. శంకర్‌ని క్షమిస్తావేమో. ఎవరు చెప్పగలరు. మనం దరం ఎప్పుడూ ఒకేరకంగా వుండటం కుదరదుగదా' అన్నాను.

సుధీర్ మాట్లాడలేదు.

'నేను హైదరాబాద్ వచ్చినప్పుడు వస్తుంటాను' అన్నాను.

తలూపాడు.

★ ★ ★

చైతన్య నాగపూర్‌లో చేరింది. అప్పుడ ప్పుడు పద్మ వెళ్లి చూసి వస్తోంది. గోపాల్ కూడా ఒకటి రెండు సార్లు వెళ్లాడు.

శంకర్ కేసు సుప్రీంకోర్టులో వుంది. ఎప్పుడన్నా దేశంలో ఎక్కడన్నా దారుణ నేరాలు జరిగినప్పుడు మళ్లీ 'శంకర్' ఉదంతం బయటికొస్తుంది.

అయితే ప్రజాస్వామ్య హక్కుల సంఘం విషయంలో మెల్లగా ప్రజల్లో వ్యతిరేకత మొదలయింది. పత్రికల్లో 'వారు కేవలం కొంతమంది హక్కుల కోసమే పోరాటం చేస్తున్నారు. ముఖ్యంగా ఎన్‌కౌంటర్స్ లాంటివి జరిగినప్పుడే బయటికొచ్చి హడా వుడి చేస్తున్నారు' అంటూ ఉత్తరాలు రాస్తున్నారు. వ్యాసాలు రాస్తున్నారు.

గోపాల్‌లో కూడా మెల్లగా అలాంటి భావం మొలకెత్తింది.

ఎంతకాలం మనం మొరటుగా వుండ గలం. ఈ విమర్శలు చేస్తున్నవారంతా ప్రజావ్యతిరేకులు కాదు. వాళ్లు ఎన్‌కౌం టర్లు జరిగినప్పుడు ఖండిస్తున్నారు. అదే సమయంలో నక్సలైట్లు మనుషుల్ని చంప

టాన్ని అంగీకరించలేక పోతున్నారు. అన్నిటికీ మించి సిద్ధాంత బేధాలవల్ల విడిపోయిన గ్రూపులవారు ఒకరినొకరు చంపుకునే స్థితికి రావటం కూడా ఎవరికీ మింగుడు పడడం లేదు. చంపే విషయం వచ్చేసరికి భూస్వామి- పెట్టుబడిదారుడు- సామాన్యుడు- తోటి పార్టీ కార్యకర్త అనే తేడాలేం లేవు. అలా నిర్మూలించటానికి వారు ఏర్పాటు చేసుకున్న కొలబద్దలేంటో కూడా తెలియవు. అందుకే ఓ రకమైన నిస్తేజానికి సానుభూతిపరులు లోనవుతున్నారు. గోపాల్ ఈ అంశాన్ని సంఘం ముందుపెట్టాడు.

'గోపాల్ మనం విప్లవకారుల్లా ఆలోచించాలి. విప్లవం వచ్చేందుకు మన పోరాటంలో చాలా మంది ప్రాణాలు పోతాయి. ఆ మాటకొస్తే రష్యాలో కొన్ని కోట్లమంది చనిపోయారు. చైనాలోనూ అంతే. మన భారతదేశానికి స్వతంత్రం కోసం చేసిన యుద్ధంలో కూడా చాలా మంది చనిపోయారు. అందుకని మనం సెంటిమెంట్‌కి లోనుకాకుడదు.'

'అలాంటప్పుడు శంకర్‌లాంటి నేరస్థుల విషయాన్ని చట్టానికి వదిలిపెడదాం. మనమెందుకు పట్టించుకోవాలి?'.

'శంకర్‌కి మన పార్టీ కేడర్‌కి తేడా వుంది గోపాల్. మనం హింస చేయాల్సి వచ్చినా అది వ్యవస్థ మార్చటం కోసం చేస్తాం. శంకర్ లాంటివాళ్లను మనం జాలితోనో, సెంటిమెంట్‌తోనో సమర్థించటం లేదు. 'శంకర్'ని ఉరితీసిన వ్యవస్థ మన వాళ్లను వదులుతుందా... అందుకే మనం మన శ్రేణుల్ని కాపాడుకోవటంలో భాగంగానే చూస్తాం ఇలాంటి వాటిని' అన్నారొకరు.

'మీరు పార్టీ పార్టీ అంటున్నారు మనది ప్రజాసంఘం'

ఎవరో నవ్వారు- 'మనం పైకి అలా చెప్పుకుంటాం. ప్రజా సంఘం అయితే ఒకేరకమైన సంఘాలు ఇన్ని అవసరం లేదు. పార్టీ చీలినప్పుడల్లా అనుబంధ సంఘాలన్నీ చీలిపోతుంటాయి. ఇవన్నీ తప్పవు గోపాల్'

'అలాంటప్పుడు మనం మన పార్టీ సంఘంగానే చూద్దాం. ఓసారి మేం కొంత మంది హక్కుల కోసం మాత్రమే వున్నాం. అని ప్రకటన ఇచ్చేద్దాం. క్లియర్ అయిపోతుంది.'

'గోపాల్- నువ్వు లాయర్‌వి. ఇలా మాట్లాడటం బాగుండలేదు. మనం సంఘంలో జరిగే విషయాల్ని బయటకు చెప్పం, చెప్పకూడదు. మనం మన పద్ధతుల్లో పని చేసుకుంటూ పోదాం.'

'నేను అది అంగీకరించలేను. మనకు ప్రజలు దూరం అవుతున్నారు. 'పార్టీ' అనేది ఎంత గొప్పదయినా తప్పులు చేయకుండా వుండదనుకోవటం భ్రమ. క్లియర్‌గా తప్పు జరుగుతోందని తెలిసినప్పుడు మనం ఖండించాలి'.

'అది సంఘం లోపల జరుగుతోందిగా'.

'కానీ అది ప్రజలకి తెలియాలి. మనం ఆ ప్రకటన చేయటం వలన ప్రజల్ని విశ్వాసంలోకి తీసుకున్న వాళ్లమవుతాం. సంఘం లోపల ఏం జరుగుతోందన్న విషయం బయటివారికి తెలియదు. కనీసం మనం ప్రజాస్వామికంగా వున్నట్లు కనిపించాలి'

'ఇప్పుడేమంటావ్ గోపాల్?'

'హింస ఎటునుంచి జరిగినా మనం ఖండించాలి. అది మనం తప్పనిసరిగా చేయాల్సిన పని'

'అందువల్ల సమస్యలు వస్తాయి'

'మన పని మనం చేయకపోవటం వలన ఇప్పటికే చాలా సమస్యలు వచ్చాయి. ఈ విషయం మీద సంఘంలో చర్చ జరగటం అవసరం' అని గోపాల్

గట్టిగా చెప్పి వచ్చేశాడు.

ఇంటికి రాగానే చాలా ఒంటరిగా ఫీల య్యాడు.

శంకర్ మీద ఎలాంటి సెంటిమెంట్ లేదు. అతన్ని ఉరిశిక్ష నుండి కాపాడటం వెనకవున్న ప్రయోజనాలు వేరు అనటాన్ని డైజెస్ట్ చేసుకోలేకపోతున్నాడు గోపాల్.

ఏమైనా చైతన్య అడిగిన ప్రశ్నకి తను ఎలాంటి సమాధానం చెప్పాడో ఇప్పుడు తనకూ అలాంటి సమాధానమే దొరికింది. చాలా అసంతృప్తిగా వుంది గోపాల్ కి.

అదే సమయంలో గోపాల్ గురించి సంఘంలో కొందరు సభ్యులు మాట్లాడుకుంటున్నారు.

గోపాల్ సిన్సియర్‌గా పని చేస్తాడు. ఇప్పుడతను ఈ విషయం మీద సీరియస్‌గా ఉండ టానికి కారణం కుటుంబమే. అతని భార్య విడిగా వుంటోంది. వాళ్లు కూడా ఈ కారణంగానే విడిపోయారు. ఇప్పుడు గోపాల్ తిరిగి ఆలోచిస్తున్నాడా? వారి ద్దరూ కలవబోతున్నారా?

తను పోలీసు నిర్బంధానికి భయపడుతున్నాడా?

ఈ రోజు వర్గ శత్రువుల గురించి అడిగాడు. రేపు పోలీసుల్ని మాత్రం ఎందుకు చంపాలి. వాళ్లకి మాత్రం హక్కులు లేవా అంటాడేమోనని అనుకున్నారు.

గోపాల్ ఓరకంగా అంతర్ముఖుడ య్యాడు.

ఇప్పుడు తనకి తరచుగా చైతన్య గుర్తొస్తోంది. తను చిన్నప్పుడు రాసిన కవితల్ని తీసి పదే పదే చదువుకుంటాడు.

'నాన్నా ప్రేమంటే ఏమిటి?' అని చైతన్య అడుగుతున్నట్లే అనిపిస్తుంది.

**చట్టాల గురించి చెప్పటమంత సులభమైంది కాదు ప్రేమను గురించి చెప్పటమంటే అనిపించింది.**

జవాబు చెప్పాలి. రేపటి తరానికి ప్రతి విషయమూ విడమర్చి చెప్పాలి.

పద్మ పరిచయం అవటం గుర్తొచ్చింది. ఆమెను చూడగానే ఓ సంచలనం. రాత్రంతా నిద్ర పట్టలేదు. అప్పటికప్పుడు వెళ్లి ఆమెను చూడాలనిపించింది. ఆమె ఎదురుగా కూర్చుని మాట్లాడాలనిపించింది. 'ప్రేమంటే ఇదేనా?' అనిపించింది. ఇందుకేనా జీవితాన్ని అంకితం చేసుకుంటారనుకున్నాడు.

ఒకరోజు పద్మతో చెప్పాడు.

'నాకు మీరంటే ఇష్టం కలిగింది' అని.

'ఎందుకు కలిగింది? నాలో మీరు ఇష్టపడుతున్న అంశాలేమిటి?' అంది పద్మ.

'మీ భావాలు నాకు నచ్చాయి. మనం కలిసి బతికితే బాగుండుననిపించింది' అన్నాడు గోపాల్.

'నా గురించి మీకు తెలిసింది చాలా తక్కువ. అలాగే మీ గురించి నాకు తెలిసింది కూడా'

'పద్మగారూ.. అన్ని విషయాల్లో మనకు ఒకే అభిప్రాయం వుండకపోవచ్చు మీరు మహిళల కోసం పని చేస్తున్నారు. నేను నా వృత్తిని ప్రజల కోసం అనుకుంటున్నాను. మీరు నాకు పూర్తిగా తెలియటమంటే అదెప్పటికీ సాధ్యం కాదేమో' అన్నాడు.

పద్మ ఆలోచించింది. ఒకటి రెండుసార్లు వాళ్లు మాట్లాడుకున్నారు. ప్రతిసారీ పద్మలో ఓ కొత్త ఆకర్షణ కనిపించేది. అది ఆమెలో అందం కాదు. పద్మ కంటే ఎంతో అందమైన వారిని గోపాల్ చూశాడు. ఎప్పుడూ ఇలాంటి భావం కలగలేదు.

చట్టాల గురించి చెప్పటమంత సులభమైంది కాదు ప్రేమను గురించి చెప్పటమంటే అనిపించింది.

వాళ్లిద్దరూ ఒక అంగీకారానికి వచ్చారు.

'మనం కొంతకాలంపాటు కలసి వుందాం. అప్పుడు ఒకరికొకరం ఇంకా బాగా అర్థమవుతాం. మన బలహీనతలు కూడా తెలుస్తాయి. మనం కలసి బత కటం సాధ్యం కాదని తెలిసినప్పుడు మర్యా దగా విడిపోదాం' అనుకున్నారు.

అలాగే ఓ ఇల్లు తీసుకున్నారు. అయితే ఈ విషయం అమ్మకి చెప్పటానికి పద్మ సందేహించింది. రేపు ఎలా వుంటుందో తెలియదు. ఇప్పుడే తమ గురించి చెప్పి రేపు విడిపోతే ఇంకా కంగారుపడుతుంద నుకుంది. అయితే ఇద్దరు ఓచోట కలసి బతికితే సమాజం చూస్తూ వూరుకోదు. వారిని ఏదో రకమైన బంధంలో వున్నట్లు ముద్ర వేస్తుంది.

పద్మ తల్లికి ఈ విషయం తెలిసిపో యింది. కలసి బతకటం మొదలు పెట్టిన కొంతకాలం ఎవరి గదుల్లో వారుండేవారు. ఉద్యోగం చేయటం, ఆ తర్వాత మీటిం గులు, సమావేశాల ఏర్పాట్లు వీటన్నింటి గురించి చర్చించి గుడ్‌నైట్ అని వెళ్లిపో యేటప్పుడు మాత్రం తామిద్దరూ స్త్రీ- పురు షులమని అర్థమయ్యేది.

చాలా రాత్రులు నిద్ర వుండేది కాదు. పద్మ దగ్గరకు వెళ్ళి- ఆమె చేతులు పట్టు కోవాలని, ఆమె బుగ్గలమీద ముద్దు పెట్టా లనిపించేది. అంతలోనే భయం, ఏమను కుంటుందోనని.

కొంతకాలం తర్వాత తనే అడిగాడు- 'ప ద్మా ఇలా ఎంతకాలం? నీకు దూరంగా నేను వుండలేకపోతున్నాను' అని. పద్మ మాట్లాడలేదు. అప్పుడు మధనపడ్డాడు.

నన్నింకా నమ్మలేకపోతోందా? నన్ను ప్రేమించలేదా? నేను పద్మకు నచ్చలేదా? నేను కూడా మగవాడిలా ప్రవర్తిస్తు న్నానా? ఎన్నో ప్రశ్నలు... కొన్ని గంటలే అయినా గోపాల్‌ని కుదిపేశాయి. తమ మధ్య భౌతికంగా ఎలాంటి బంధం లేకపో యినా మిత్రులందరూ తమని భార్యాభర్త లనే అనుకుంటున్నారు.

'అదేంలేదు' అంటే నమ్మరు. వాళ్లకు కూడా లీగాలిటి కావాలి. ఇరువురు స్త్రీ పురుషులు కలసి ఏ శారీరక సంబంధం లేకుండా బతకవచ్చు అనేదాన్ని వాళ్లు ఆమోదించలేకపోతున్నారు. పోనీ వాళ్లు మామూలు మనుషులు కాదు, సీరియస్ అభిప్రాయాలున్నవారే.

ఆ రాత్రి ఎప్పటిలానే గుడ్‌నైట్ చెప్పి పద్మ తన గదికి వెళ్లింది. తలుపులు మూశాడు గోపాల్.

పద్మ అర్థం కావటం లేదే అనుకు న్నాడు. ఇంకొంత కాలం ఆగాలనుకుంటోం దేమో. తనెందుకు తొందరపడాలి. ఇప్ప టికే తన ఫీలింగ్స్ చెప్పాడు. అయినా ప్రేమంటే ఏమిటి? ఒకప్పుడు పద్మ దూరంగా వున్నప్పుడు తన దగ్గరికి వెళ్లాల నిపించేది. ఇప్పుడు పక్కనే వుంది. అయినా తృప్తి కలగటం లేదు. మనసు తనతో శారీరకమైన అనుభవం కావాలం టోంది. అదేనా ప్రేమంటే...?

ఆ అనుభవమే ప్రేమయితే అది ఎక్క డైనా దొరుకుతుందే... కానీ పద్మ మాత్రమే తనకు కావాలి. ఇలాంటి ఆలోచ నల్లో సతమతమవుతున్నప్పుడు తలుపు మీద చప్పుడయింది. గోపాల్ వెళ్లి తలుపు తీశాడు.

ఎదురుగా పద్మ. తలనిండా మల్లె పూలు. అప్రయత్నంగా పద్మని గోపాల్ కౌగిలించుకున్నాడు.

ఆ స్పర్శ ఇప్పటికీ తాజాగానే వుంటుంది. ప్రేమ తాలూకు పరాకాష్ఠ అదేనేమో. ప్రేమంటే బాధ... ప్రేమంటే నిరీక్షణ... ప్రేమంటే నిగ్రహం. శంకర్ లాంటి వారిలో ప్రేమను పొందే లక్షణాలు లేవు. వారు తిరస్కారాన్ని భరించలేరు. వారు ఎప్పుడు కోరుకుంటే, ఏది కోరు



కుంటే అది లభించాలి. లేకపోతే అసహనానికి, తద్వారా విధ్వంసానికి పూనుకుంటారు.

పద్మ పరిశీలనలో నిజం వుంది.

పార్టీలోనూ అంతే. చేసిన తప్పుని బట్టి శిక్ష వుంటుంది. ముందు హెచ్చరికలు చేస్తారు. సస్పెన్షన్ వుంటుంది. ఇంకా భరించలేనప్పుడు పార్టీ నుండి బహిష్కరిస్తారు.

అప్పటిదాకా పార్టీకోసం పనిచేసి, తమ సర్వస్వాన్ని పార్టీకోసం అర్పించి పనిచేసిన వారు పార్టీ నుంచి బయటకు వెళ్లటమంటే అది ఉరిశిక్షలాంటిదే. అయినా పార్టీలు ఆ శిక్షను విధిస్తున్నాయి. అందుకు కారణం ఇంకేమాత్రం పార్టీలు ఆయా వ్యక్తుల్ని భరించలేకపోవటమే. కొన్ని సందర్భాల్లో వ్యక్తులు పార్టీకంటే గొప్పవాళ్లమనుకుంటారు. ఇంకొన్ని సమయాల్లో సిద్ధాంతపరంగా, ఆచరణపరంగా విభేదాలు వస్తాయి. ఏదిఏమైనా పార్టీ క్రమశిక్షణను పాటించాలి. క్రమశిక్షణను అతిక్రమించిన వారెవరైనా శిక్షకు అతీతులు కాదు.

శంకర్ కూడా అంతే!

సమాజంలో అమలులో వున్న సహజ న్యాయాలన్నింటినీ తిరస్కరించాడు. తన సమస్యని, అది అంత సమస్య కాకపోయినా మడ్డుకత్తితో పరిష్కరించాడు. అలాంటి వ్యక్తికి శిక్ష పడాల్సిందే. కఠినమైన శిక్షపడాలి. ఇలాంటి ఆలోచనలు గోపాల్‌లో మొదలయ్యాయి. తను ఓ నిర్ణయం తీసుకునేలోపు పరిణామాలు వేగంగా జరిగిపోయాయి.

సుప్రీంకోర్టు కూడా శంకర్‌కి విధించిన మరణశిక్ష సబబే అని తీర్పునిచ్చింది.

అప్పుడు గోపాల్ ఆలోచనలు మళ్లీ మారిపోయాయి.

'శంకర్' ఓ చెడిపోయిన పిల్లవాడు!

అతను చెడిపోవటంలో పరోక్షంగా ఎందరో ప్రభావం చూపించారు. ఈ ప్రపంచంలో గొప్ప సృజనగానీ, భయంకరమైన విధ్వంసంగానీ కేవలం వ్యక్తులే చేయరు. అలాగే రాజకీయపార్టీల నుండి బహిష్కరణకు గురయిన వారు మళ్లీ పార్టీల్లోకి వస్తున్నారు.

క్రీడల్లోగాని, జీవితంలోగాని ఎవరికీ దారులు మూసేయకూడదు. శంకర్‌కి ఓ అవకాశం ఇవ్వాలి. అందుకోసం మళ్లీ పెద్ద చర్చను లేవదీయాలి.

ఇదంతా పద్మకి నచ్చదు. తమ మధ్య ఇంకా దూరం పెరుగుతుంది. అయినా తప్పదు. ఇది ఓ మనిషి ప్రాణం కోసం చేస్తున్న యుద్ధం. 'శంకర్' మరణశిక్ష నుండి బయటపడి పశ్చాత్తాపం పొందినా పూర్తిగా మారినా కూడా 'పద్మ' అతన్ని క్షమించలేకపోతే ఆమె గురించి బాధపడాల్సిన అవసరం లేదు.

తమ మధ్య వున్న ప్రేమ షరతులు లేనిది కాదు. కేవలం శరీరాలకు పరిమితం అయింది కాదు.

చైతన్యకు ఈ విషయమే చెప్పాలి అనుకున్నాడు.

★ ★ ★

సుప్రీంకోర్టు తీర్పు తర్వాత మళ్లీ పత్రికల్లో అనేక వ్యాసాలు, సంపాదకీయాలు, పెండింగ్‌లో వున్న కేసుల సమాచారాలు ఈ తీర్పుమీద సామాన్యుల నుండి న్యాయాధిపతులదాకా రకరకాల అభిప్రాయాలు, ప్రకటనలు- ప్రజాస్వామ్యంలోని ఓ కోణాన్ని ప్రతిబింబించాయి.

సుధీర్ నుండి ఉత్తరం వచ్చింది.

అక్కా...

ఇప్పుడు తృప్తిగా వుందని రాయను. అసలు కథ ఇప్పట్నుంచే మొదలవుతుంది. 'శంకర్'కి ఆందోళన వుందో లేదో నాకు తెలియదు. తనకు ఏమీకాదని అతను ధీమాగా వుండవచ్చు. అతనికి ఏ క్షణ

మైనా క్షమాభిక్ష పెడతారేమోనని నాకనిపిస్తోంది.

ఓసారి లయ అడిగింది- 'శంకర్ బయటకు వస్తే నన్నూ, అమ్మని కూడా చంపేస్తాడా?' అని. లయకలా ఎందుకనిపించిందో తెలియదు. అతను చంపదలుచుకుంటే అందులో నేనూ వుంటాను కదా. నన్ను ఎందుకు వదిలేసిందో, మగవాడ్ననా!

లయ ఇప్పటికీ నిద్రలో ఉలిక్కిపడి లేస్తుంటుంది. ఏడుస్తుంది. అలాంటప్పుడే మనసు వికలం అవుతుంది. అతను బతికివున్నంత కాలం ఓ పీడకలలా మా మనసుల్లో కొస్తాడు. మా ఇద్దర్నీ స్వేచ్ఛగా ఏపనీ చేసుకోనివ్వడు.

అమ్మని మినహాయిస్తే నాలో అతనంటే కసి పెరుగుతుంటే లయలో భయం పెరుగుతోంది. అదేదో మా వరకే పరిమితం అయితే వేరే విషయం. శంకర్ మీ కుటుంబం మీద కూడా తన పడగనీడను ప్రసరించాడు.

నిజానికి ఈ కేసుని ఎంత త్వరగా పరిష్కరించగలరా అని ఎదురు చూస్తున్నాను.

ఇలా చాలా రాసుకుంటూ వచ్చాడు. ఎంత రాసినా అదే వేదన. తను మాత్రం రాజీ పడలేకపోతున్నాడు.

అమ్మ మాత్రం సంతోషించింది. ఇది తమ పోరాటానికి విజయం అని ఆమె ప్రకటించింది. ముఖ్యంగా ఆడపిల్లలు తమని తాము కాపాడుకొనటానికి ఏం చేయాలో వివిధ పత్రికల్లో ఆమె వ్యాసాలు రాసింది. పెద్దవారితో ఉపన్యాసాలు ఇప్పించింది. క్యాంప్స్ నిర్వహించింది.

అమ్మ చేస్తున్న పోరాటంలో కేవలం మహిళలే కాదు, పురుషులు కూడా ఉన్నారు. ఎవరు ఈ సమస్య మీద కలిసి వచ్చినా అమ్మ ఆహ్వానించింది.

ఇదే సమయంలో శంకర్‌కి ఉరిశిక్ష రద్దు చేయాలని నాన్న కూడా తీవ్రంగా ప్రయత్నాలు చేశాడు. శంకర్ క్షమాభిక్ష కోరటానికి అంగీకరించలేదు. నాన్న అతన్ని కలిశాడు. మాట్లాడాడు. ఇంకా మేధావుల్ని కదిలించాడు.

నేను ఇదంతా గమనిస్తున్నాను.

కాలం ఎలా గడిచిపోయిందో తెలియదు.



**అమ్మని మినహాయిస్తే నాలో అతనంటే కసి పెరుగుతుంటే లయలో భయం పెరుగుతోంది. అదేదో మా వరకే పరిమితం అయితే వేరే విషయం. మీ కుటుంబం మీద కూడా ...**



శంకర్ 'ఉరిశిక్ష' రద్దయింది!

ఈ ప్రకటన ఒక్కసారిగా పత్రికల్లో - టీవీల్లో ప్రముఖంగా వచ్చింది. శంకర్‌కి యావజ్జీవ కారాగార శిక్ష వేశారు. నేను ఈ తీర్పుని ఆమోదించలేకపోయాను. అలాగని వ్యతిరేకించలేకపోయాను.

నిస్సహాయంగా- దీనంగా హాసిని నాకేసి చూస్తున్నట్లనిపించింది. అంతకుమించి నేను సుధీర్‌ని కలవాలని అనుకోలేదు. తనని ఫేస్ చేయటం నా వల్ల కాదు.

అమ్మ మా దగ్గరికి వచ్చింది. నన్ను బయటికి తీసుకువెళ్లింది.

'ఓడిపోయాను చైతూ' అంది.

'బాధపడకమ్మా' అన్నాను.

'బాధ కాక ఏం మిగిలింది చైతూ. ఇంక చట్టాలు చేసి లాభం లేదు. నన్నడిగితే పోలీసులూ - న్యాయస్థానాలూ - జైళ్లూ ఇవన్నీ అనవసరం. ఎవరికి ఇష్టంలేని వారిని వారు చంపుతున్నారు. అది భూమి కోసం, ఆస్తుల కోసం, అధికారం కోసం కావచ్చు. ఆడవాళ్ల మీద అత్యాచారాలు చేయటం కావచ్చు. అలాగే ఎవరికి కావల

సిన వారికి వారు క్షమాభిక్షలు పెడుతున్నారు. ఇది డెమోక్రసి కాదు. అలాగని నియంతృత్వం కాదు. ఇది ఏ వ్యవస్థో ఎవరికీ అర్థం కాకుండా తయారయింది. మీ నాన్నలాంటి వాళ్లు ఈ వ్యవస్థని కాపాడటానికి మాత్రమే పనికొస్తున్నారు' అంది బాధగా.

'నీ వరకు నువ్వు చివరి వరకూ యుద్ధం చేశావు. ఫలితం మన చేతుల్లో లేదు. ఇంక బాధపడటం అనవసరం' అన్నాను.

'అలా అని నేను సరిపెట్టుకోలేకపోతున్నాను. ఇన్ని సంవత్సరాలుగా ఎన్ని అపజయాలో.. ఈ వ్యవస్థ మారుతుందనే నమ్మకం కలగటం లేదు. పోరాడాలన్న ఉత్సాహం చచ్చిపోతోంది' అంది అమ్మ.

'అమ్మా... పోరాడాల్సింది నువ్వు మాత్రమేనా! ఎవర్నికైతే బాధ కలిగిందో వారు ముందుకు రావాలి. మనం ఎప్పుడయితే ఇతరుల బాధని మన బాధ చేసుకుంటున్నామో - వారికి బదులు మనం అన్ని పనులూ చేస్తున్నామో, అప్పుడు వారు రిలాక్సవుతున్నారు. మా తరఫున పోరాడటానికి మనుష్యులున్నారనుకుంటున్నారు. అందుకే నువ్వు కొన్నాళ్లపాటు వీటన్నిటికీ దూరంగా ఉండమ్మా. నీ అవసరం ఉందని ఎదుటి వారనుకున్నపుడు నువ్వు ముందుకు వెళ్లు...' అన్నాను.

'అట్లయితే ఈ సమాజం ఇంకా కుళ్లిపోతుందే.'

'పోనీ. లేదంటే నువ్వు అపజయాలను పట్టించుకోవద్దు. పని చేసుకుంటూ వెళ్లు. ఈ రెండింటిలో నువ్వు ఏదో ఒకటి నిర్ణయించుకో. అప్పుడే నువ్వు బాధపడటం జరగదు.'

★ ★ ★

గోపాల్ ఇంట్లో వున్నాడు తను 'లా'కి చెందిన పుస్తకాలు తిరగేస్తున్నాడు. అప్పుడు వచ్చాడు సుధీర్ 'నమస్కారం' అంటూ.

ముందు గోపాల్ గుర్తు పట్టలేదు.

'నేను హాసిని బ్రదర్‌ని' అన్నాడు.

'రా బాబు, కూర్చో' అన్నాడు గోపాల్.

'నేను కూర్చోటానికి రాలేదు' అన్నాడు సుధీర్.

'సరే, నిలబడే చెప్పు' అన్నాడు గోపాల్.

'నువ్వు ఆడపిల్ల తండ్రివేనా?'

'సుధీర్' అరిచాడు గోపాల్ షాక్‌తో.

'అవును. నువ్వు ఓ ఆడపిల్లకు తండ్రివయితే ఇలా చెయ్యవు. నీకు 'శంకర్' తరఫు నుండి ఎంత డబ్బు వచ్చింది. నువ్వు ఎంతకి అమ్ముడుపోయావు. నువ్వసలు మనిషి జన్మ ఎత్తావా?' అంటున్నాడు కసిగా.

'మిస్టర్' అన్నాడు కోపంగా గోపాల్.

'ఏమిటి అంత కోపం వచ్చింది. చంపేసింది మీ కూతుర్ని కాదు. మీ అమ్మని కాదు. నీ భార్యని కాదు. అందుకే దేశం మీదకు పెద్ద ప్రవక్తలా బయలుదేరావు. నిన్ను రెండు మాటలంటేనే అంత కోపం వచ్చింది. ఎదుటివారికి రాదా? నువ్వు తెల్లారి లేస్తే పోలీసుల్ని శిక్షించాలంటావ్. వాళ్లని ఎందుకయ్యా శిక్షించాలి? నీలానే వాళ్లు కూడా పొట్టకూటి కోసం ఆ పనులు చేస్తున్నారు. వారికి జీతం ఇచ్చేదే అందుకు. ఏ లాజిక్ ప్రకారం శంకర్‌కి శిక్ష వద్దన్నావ్- ఏ న్యాయం ప్రకారం పోలీసులు నేరస్థులయ్యారు? శంకర్ మారితే పోలీసులూ మారతారు. అసలు నువ్వు మీ పార్టీ వాళ్ళని ఇలా ఎందుకు చేస్తున్నావనగలవా? ఒకవేళ అలా అడిగితే ఒక్క నిముషం మీ సంఘంలో వుండగలవా? నీకేం హక్కు ఉందని నువ్వు తీర్పులిస్తున్నావ్?' అన్నాడు రొప్పుతూ.

'సుధీర్-నువ్వు ఆవేశంలో ఉన్నావు. ఇలా మాట్లాడేవారిని నేను చాలామందిని

చూశాను' అన్నాడు.

'అంటే మేం చూడలేదా నీలాంటి వాళ్లని...'

'నువ్వు మీ అక్కని కోల్పోయిన బాధలో ఉన్నావు. నిన్ను నేను అర్థం చేసుకుంటాను'

'నన్ను అర్థం చేసుకుంటావా, మిస్టర్ గోపాల్? అది నీకీ జన్మలో సాధ్యంకాదు! మీకు మనుషుల్ని అర్థం చేసుకోవాలనే జ్ఞానం, వారి భావాల్ని గౌరవించాలనే దృష్టి ఉంటే ఇలా వుండేది కాదు సమాజం. మీరు ఎక్కడి నుండి బయలు దేరారో, ఇప్పుడు ఎక్కడున్నారో వెనక్కి తిరిగి చూసుకోండి. అసలు మీరు ఏ విలువలకి కట్టుబడి ఉన్నారని? మీకు భార్యల భావాలతో పనిలేదు. పిల్లల గురించి పట్టదు. సమాజంలో మనుషుల గురించి వకాల్తా ఎలా తీసుకుంటారు? నిన్ను నేను అర్థం చేసుకుంటున్నాను మిస్టర్. నువ్వో అమ్మాయికి ద్రోహం చేశావు. అది గుర్తుంచుకో. కనీసం పశ్చాత్తాపపడు. అప్పుడన్నా మనిషిగా మిగులుతావు' అని ఇంకో మాటకు ఎదురుచూడకుండా వెళ్ళిపోయాడు.

గోపాల్ దిగ్భ్రాంతితో కూర్చుండిపోయాడు తన కుర్చీలో.

★ ★ ★

గోపాల్‌కి ఇలాంటివి కొత్త కాదు.

తమను ముఖం మీద అనకపోయినా, తమ వెనకాల చాలామంది విమర్శిస్తారు. సుధీర్ యువకుడు. అన్యాయం జరిగిందనే ఆగ్రహం వల్ల అలానే మాట్లాడతాడు. అయితే పద్మ నుంచి అలాంటి ఆగ్రహం వస్తుందని అతను ఊహించలేదు.

ఆ రాత్రి ఇంటికి వచ్చింది. ముఖంలో ఎలాంటి భావాన్ని కనిపించకుండా జాగ్రత్త పడుతోందా అనిపించింది గోపాల్‌కు. పద్మని చూడగానే సంతోషం కలిగింది. అప్పటి నుండి ఇప్పటి వరకూ తను రాలేదు.

'రా పద్మా. మంచినీళ్ళు తీసుకొస్తాను' అని వెళ్లబోయాడు.

'అవసరం లేదు' అని, 'ఇప్పుడు తృప్తిగా వుందా?' అంది.

'ఎందుకు పద్మా?'

'మా మీద గెలిచానని?'

'మీ మీద గెలవటం ఏమిటి? నేను మీ మీద ఎప్పుడూ యుద్ధం చేయలేదు. నువ్వు ఇంకా ఈ కేసుని వ్యక్తిగతంగానే తీసుకుంటున్నావా?'

'మీరు తీసుకోలేదా?'

'పద్మా. నేను లేకపోతే ఇంకొకరు ఈ విషయంలో ముందుకొచ్చేవారు. నువ్వు పోరాడకపోతే ఇంకొకరు 'శంకర్'కి వ్యతిరేకంగా ముందుకొస్తారు. అందుకని కాస్త కోపం తగ్గించుకుని మాట్లాడుకుంటే మంచిది'

'అలాగా. మీరు శంకర్‌కి ఉరిశిక్షను రద్దు చేయించగలిగారు కానీ ఇంతవరకు నేను చేసింది తప్పు అని అతనితో కనీసం ప్రకటన కూడా ఇప్పించలేకపోయారు. హాసినిని చంపినందుకు అతను బాధపడటంలేదు. మీరు బాధపడుతున్నారు. అయినా ఇంతమంది తీవ్రవాదంలోకి ఎందుకు వస్తున్నారు..."

'నువ్వే చెప్పు'

'ఇందులోకి వచ్చేవారందరూ సిద్ధాంత పుస్తకాలు చదివినవారు కాదు. పేదరికం వల్ల, తమకు న్యాయం జరగకపోవడం వల్ల, తమమీద జరుగుతున్న దౌర్జన్యం భరించలేక వస్తున్నారు. రేపు హాసిని తమ్ముడు మీ ఉద్యమంలోకి వస్తే ఏం చేస్తారు?'

'నా ఉద్యమం ఏమిటి పద్మా...' చిరాగ్గా అన్నాడు.

'ఓహో... మీది ప్రజాస్వామ్య హక్కుల్ని

రక్షించే సంఘం కదా. సరే. ఈ సుధీర్ నక్సలైట్లలోకి వస్తే మీరు... అంటే ఆ పార్టీ ఒప్పుకుంటుందా? ఒప్పుకోదా?'

'నాకు తెలియదు'

'మీకు తెలుసు. చెప్పటానికి ఇష్టంలేదు. నేను చెబుతున్నాను. ఇప్పుడు సుధీర్ వస్తానంటే అతన్ని పార్టీలోకి తీసుకుంటారు. అతను చదువుకున్నాడు కాబట్టి మెల్లగా నాయకత్వం వస్తుంది. అతనప్పుడు శంకర్‌ని చంపేస్తాడు'.

గోపాల్ ఉలిక్కిపడ్డాడు.

'అవును, శంకర్‌ని చంపి అతను వర్గశత్రువు అంటాడు. అప్పుడు నువ్వు లేదా మీ సంఘం సుధీర్‌ని సమర్ధిస్తుందా? వ్యతిరేకిస్తుందా?' సూటిగా అడిగింది.

'నేను ఊహాజనితమైన ప్రశ్నలకి జవాబు ఇవ్వలేను' అన్నాడు గోపాల్.

'నిన్ను నువ్వు మోసం చేసుకోవద్దు గోపాల్. ఇది ఊహ కాదు... వాస్తవం. మీలోని బలహీనత అదే. మీకు ప్రాణాలంటే విలువలేదు. నిజంగానే మీరు మానవ ప్రాణాలకు అంత విలువ ఇస్తే ఎవరి ప్రాణం పోయినా ఒకేలా స్పందిస్తారు. రేపు నేను చెప్పినట్లు జరుగుతుంది. కాకపోతే సుధీర్ నక్సలైట్లలో చేరకపోవచ్చు. అతను స్వంత సైన్యం ఏర్పాటు చేసుకోవచ్చు. 'మాఫియా' ముఠాల్లో చేరవచ్చు. మీ క్షమాభిక్ష కార్యక్రమం చాలా వికృతమైన ఫలితాన్నివ్వబోతోంది' అంది.

'అలా అంటే శంకర్‌ని ఉరి తీయటం వలన కూడా అలాంటివి జరగవా...'

'జరుగుతాయి గోపాల్. ఇప్పుడు దేశంలో ఈ చర్చే నడుస్తోంది. పార్లమెంట్ మీద దాడి చేసినవారికి ఉరిశిక్ష వేయాలంటున్నారు కొంతమంది. దానివల్ల అల్లర్లు జరుగుతాయి. మారణకాండ జరుగుతుందంటున్నారు ఇంకొందరు. ఏ పార్లమెంట్‌ని ధ్వంసం చేయాలనుకున్నారో, ఆ పార్లమెంట్ ముందుకే రేపు ఆ కేసు వస్తుంది. ఏ ప్రజాస్వామ్యాన్ని నాశనం చేయాలనుకున్నారో ఆ ప్రజాస్వామ్యం ద్వారానే బయటపడాలనుకుంటున్నారు. మీరూ అంతే. మతం పేరుతో మారణకాండ సృష్టిస్తున్నవారూ అంతే. ఈ దేశంలో నిజంగా బాధపడేవాళ్లు ఏ వర్గాలనూ, ఏ పార్టీలనూ సమర్ధించనివారు. వాళ్ల దృష్టిలో 'న్యాయం' వీటన్నింటికీ అతీతమైంది. ఇప్పుడు వారి సంఖ్య స్వల్పం కావచ్చు. పరిస్థితులు ఎప్పుడూ ఇలా వుండవు. అది గుర్తుంచుకోండి' అంది.

'సరే పద్మా... ఇంకేమన్నా మాట్లాడు.'

'ఇంక మాట్లాడటానికి మన మధ్య ఏమీ మిగల్లేదు గోపాల్. నేను వెళ్తున్నాను' అంది పద్మ.

'నిన్ను ఆగమని నేను చెప్పలేను. ఇన్ని సంవత్సరాలు మనం కలిసి బతికాం. కనీసం ఈ ఒక్కరోజు మనింట్లో వుండు'

'థాంక్స్. మనం ఇలాంటి సెంటిమెంట్స్‌కి అతీతులం గోపాల్' అని వెళ్లిపోయింది.

గోపాల్ తల పట్టుకుని కూర్చున్నాడు చాలాసేపు.

పద్మ మాట్లాడిన ప్రతి మాటా శూలంలా గుండెలో నాటుకుంది. అప్పుడు ఇంత బాధనిపించలేదు. నిజంగానే తను కుంచించుకుపోతున్నాడా? 'ప్రపంచ కార్మికులారా ఏకంకండి' అనే నినాదం ఎక్కడ! ఇప్పటి తమ స్థితి ఏమిటి? సువిశాల భారతదేశంలో విప్లవం సాధించాలన్న ఆశయం ఇప్పటికీ వుందా? అసలు ఇంతమంది ప్రజానీకాన్ని కలిపేంత గొప్ప నైపుణ్యం తమలో లేదు. ఇది అంగీకరించాలి.

గోపాల్ ప్రజలకోసం జీవితాల్ని త్యాగం చేసిన ఎందరో మహానుభావుల్ని

చూశాడు. వాళ్లందరినీ ఏ మాత్రం గౌరవం లేకుండా విమర్శించే వాళ్లనీ చూశాడు. నాలుగు కథలు రాసి, నాలుగు పాటలు పాడి, పత్రికల్లోనూ, టీవీల్లోనూ కనిపించినంత మాత్రాన ఎవరూ గొప్పవా రైపోరు.

చివరివరకూ వారు నమ్మినదానికి కట్టు బడి వుంటున్నారా అనేది వాళ్లు ఆలోచిం చుకోవాలి.

ప్రపంచాన్నంతా దుమ్మెత్తి పోసేవాళ్లు, తమ మీద వచ్చే చిన్న విమర్శనూ తట్టు కోలేరు. 'ద్రోహం-కుట్రా' అనే పదాలు ఇప్పుడు ప్రయోగించే వారిమీదే ఎదురు తిరుగుతున్నాయి.

'వక్రీకరణ' శిల్పం పంచరంగుల నుండి రకరకాలుగా ఎదిగిపోయింది.

'నాకిప్పుడు కొంతకాలం విశ్రాంతి కావాలి' అనుకున్నాడు.

అదే విషయాన్ని సంఘం నాయకత్వం తో చెప్పాడు.

'అదేంటి గోపాల్? నీ పని నువ్వు చూసుకుంటూనే పని చెయ్యి' అన్నారు.

'లేదు. నేను నాయకత్వ స్థానంలో వుండను. ఆ బాధ్యతలు ఇంకెవరికన్నా అప్పచెప్పండి'

'అంటే సంఘం నుంచి కూడా వెళ్లిపోవా లనుకుంటున్నావా?'

'లేదు. సాధారణ సభ్యుడిగా వుంటాను. ఇప్పుడు నాలో చాలా అనుమానాలు న్నాయి. ప్రశ్నలున్నాయి. నేను కొంత కాలం పాటు అధ్యయనం చేయాలనుకుం టున్నాను. భవిష్యత్తు గురించి నేను చెప్ప లేను. ఈ సంఘంలో ఉంటానో ఉండనో, అసలు ఈ ఉద్యమంలో పని చేస్తానో, చేయనో' అన్నాడు గోపాల్.

'మీ ఇష్టం గోపాల్' అన్నారు.

గోపాల్‌ని సంఘ నాయకత్వ బాధ్యతల నుండి తప్పించారు.

ఆ రకంగా సంచలనం సృష్టించిన హాసిని హత్య అటు పద్మని, ఇటు గోపా ల్‌ని ఓ నైరాశ్యంలోకి నెట్టేసింది.

★ ★ ★

చైతన్య గ్రాడ్యుయేషన్ పూర్తయింది.

పోస్టుగ్రాడ్యుయేషన్ చేయాలనుకుం టోంది. అలాగే తర్వాత పి.హెచ్.డి చేయాలని కూడా వుంది.

అమ్మా, నాన్నలు విడిగానే వుంటు న్నారు. హాసిని వాళ్ల కుటుంబం ఆ ఊరు విడిచిపెట్టి వెళ్లిపోయింది. ఎక్కడికి వెళ్లారో మాత్రం తెలియదు. వాళ్లు తాము ఎవరికీ తెలియని ప్రాంతంలో బతకాలను కున్నారేమో. సుధీర్ విషయం కూడా తెలి యదు.

అతను చదువుకుంటున్నాడో లేదా చదువు మానేసి ఎక్కడయినా ఉద్యోగం చేస్తున్నాడా అనేది తెలియదు. 'లయ' చదువు మానేసిందా? ఆ అమ్మాయికి చిన్న వయసులో పెళ్లి చేసివుంటారా? హాసిని వాళ్లమ్మగారి ఆరోగ్యం బాగుందా? అసలామె ఉన్నారా?

ఇవన్నీ ప్రశ్నలు.

ఈ ప్రపంచం గురించి పట్టించుకోవటం మొదలుపెడితే ఆ తీరు ఓ రకంగా వుంటుంది. మనం ఏ విషయాన్నీ సీరియ స్‌గా తీసుకోకపోతే ఇంకోరకంగా వుంటుంది. చైతన్య దృష్టంతా చదువు మీద వుంది. అలాగే గ్రంథం రాయాలన్న కోరికా వుంది.

అందుకు కావలసినవన్నీ సమకూర్చు కుంటోంది. తనను ఎప్పుడు ఏది ఆకర్షిం చినా ఆ అంశంమీద పరిశోధన చేస్తోంది. దానికి చెందిన మెటీరియల్‌ని గేదర్ చే స్తోంది. కంప్యూటర్‌లో ఫీడ్ చేస్తోంది.

అమర్ మళ్లీ ఇండియా వస్తానన్నాడు గాని రావటం కుదరలేదు. శివాని-మధూ లిక కూడా రాలేదు. అయితే ఫోన్‌లో

మాట్లాడుకుంటున్నారు. మెయిల్స్ ఇచ్చుకుంటారు. స్టేట్స్ నుండి అమర్ చైతన్యకి ఎలాంటి మెటీరియల్ కావాలన్నా పంపిస్తున్నాడు.

'చైతన్యా.... నువ్వు పెళ్ళి చేసుకోవా?' అని అడిగింది అమ్మమ్మ ఆ రోజున.

'అప్పుడే నాకు పెళ్ళేంటీ అమ్మమ్మా' అంది.

'అదేంటమ్మాయ్- మేమందరం ఈ వయసుకి పిల్లల్ని కన్నాం. మీరంటే చదువులనీ, ఉద్యోగాలనీ ఆగుతున్నారుగానీ....' అంటుంటే.

'అమ్మమ్మా, పెళ్ళి చేసుకోవాలనుకున్నప్పుడు నీకు చెబుతాను. ప్రస్తుతం నేను ఆ విషయం గురించి ఆలోచించటం లేదు' అంది.

'ఈ వయసే అలాంటిదమ్మా. ఈ వయసులోనే ప్రేమల్లో పడతారు. మీ అమ్మ చేసినట్లు నువ్వు కూడా చేస్తావేమోననిపిస్తుంటుంది'

'అప్పుడు నాతో మాట్లాడవా?'

'నేను మాట్లాడితే ఎంత... మాట్లాడకపోతే ఎంత. మీ అమ్మ చూడు ఒంటరిగా వుంటుంది. మీ మావయ్య దూరంగా వున్నాడు. వాడూ-కోడలూ ఎలా వుంటారో మనం చూడలేదు. ఏమైనా మీరు కలసి మెలసి సుఖంగా వుంటే చూడాలని మేం కోరుకుంటాం' అంది అమ్మమ్మ.

'ఇప్పుడు నన్నేం చేయమంటావు?'

'అట్లంటే నేనేం చెబుతాను. ముందు నీకు చదువు ముఖ్యం. చదువుకో. కానీ పెళ్ళి విషయంలో తొందరపడొద్దు'

'నేను తొందరపడను. ఇప్పటివరకు నేను ఎవరినీ ప్రేమించలేదు. నా పెళ్ళి నువ్వే చూసి చేద్దువుగాని'

'నువ్వెన్నేళ్ళు చదువుతావో తెలియదు. అప్పటిదాకా నేను వుండాలిగా.'

'అమ్మమ్మా నీలాంటివాళ్ళు అలా అంటుంటారు. నువ్వు నా పెళ్ళి చూడటమే కాదు, నా పిల్లల్ని కూడా చూస్తావు. సరేనా' అంది చైతన్య.

'అది సరేగాని మీ అమ్మను అలా వదిలేయటమేనా? నువ్వేమీ పట్టించుకోవా?' అంది.

'ఏం పట్టించుకోవాలమ్మా'

'మీ నాన్ననీ, అమ్మనీ కలపలేవా? ఒకప్పుడంటే చిన్న పిల్లవి. ఇప్పుడు పెద్దయ్యావు కదా!'

'నువ్వు నాకంటే చాలా పెద్దదానివి. మీ అమ్మాయికి నువ్వు చెప్పు. మా నాన్నకు నేను చెబుతా'

'నేను చెబితే మీ అమ్మ వినదు. నువ్వే చెప్పు.'

అసలు చెబితేనేకదా వింటుందో వినదో తెలిసేది. ముందు నువ్వు చెప్పు' అంది చైతన్య.

'అలా కాదులేవే. నువ్వు మీ అమ్మతో మాట్లాడు' అంది ఆమె.

'నీ పట్టుదల వదులుకోవు' అని నవ్వింది చైతన్య.

'పట్టుదలలెప్పుడో వదిలేశా. కావాలంటే నేను చెప్పానని మీ అమ్మకు చెప్పు' అందామె.



అమ్మమ్మ భయం నాకు అర్థమయింది.

నేను కూడా ఏదో ఓ సంచలనం సృష్టిస్తానని అనుకుంటుందేమో. ఆమె నా దగ్గర వుండటానికి కారణం కూడా అదేనేమో. నేను కాలేజీనుంచి రాగానే 'ఏమిటి ఈరోజు విశేషాలు' అని గుచ్చి గుచ్చి అడిగేది. నేను మామూలుగా చెప్పేదాన్ని. 'ఇంకా ఏమిటి?' అని అడిగేది. 'ఇంకేం లేవు' అంటే నేనేదో దాస్తున్నట్లే అనుకునేది.

మా అమ్మమ్మకు కో-ఎడ్యుకేషన్ ఇష్టం వుండేది కాదు. ఆడపిల్లల్ని విడిగా చదివిం

చాలి. మగపిల్లల్ని ఆడపిల్లల దగ్గరకు రానీయకూడదు. అసలు మీ స్నేహితురాలిని ఆడపిల్లల కాలేజీలో చదివిస్తే ఇలా జరిగేది కాదేమో అందోసారి.

ఈ ప్రపంచంలో ఆడా-మగా కలిసేవుంటారు. చదువు వరకు విడిగా వుండొచ్చు. అయినా గుంటూరులో స్టూడెంట్‌ని చంపిన వ్యక్తి విద్యార్థి కాదు. ఇంటి దగ్గర నుండి బయలుదేరిన దగ్గర్నుండి బస్సులు, షాపులు, రోడ్లలో..తిరుగుతారు. అలాగే ఉద్యోగాలు చేయాలి- వ్యాపారాలు చేయాలి. ఎక్కడ చూసిన మగవారితోనే కలిసి వుండాలి. వారిని ఎదుర్కోవాలి. వారితో పోటీ పడాలి.



**ఈ ప్రపంచంలో ఆడా-మగా కలిసేవుంటారు. చదువు వరకు విడిగా వుండొచ్చు. అయినా గుంటూరులో స్టూడెంట్‌ని చంపిన వ్యక్తి విద్యార్థి కాదు.**



ఒకప్పుడు ఉమ్మడి కుటుంబాలు. స్త్రీలకు బయటకు రావలసిన అవసరం లేదు. ఇప్పుడు అలా వుండటం అసాధ్యం. ఇవన్నీ పాత తరం వారికి తెలియవని కాదు. వారి భయాలు వారివి.

ఇన్ని సంవత్సరాల తర్వాతయినా 'అమ్మ' గురించి మాట్లాడింది. అమ్మా-నాన్నా రాజీపడతారా లేదా అనేది పక్కనుంచితే అమ్మమ్మలోని ఈ మార్పు నాకు చాలా ఆనందాన్నిచ్చింది. నేను కూడా ఓ ప్రయత్నం చేయాలనుకున్నాను.

అందుకే ముందు అమ్మతోనే మొదలు పెట్టాను.

'నువ్వూ-నాన్నా ఒకరినొకరు ఇష్టపడ్డారు. మీరు కలసి బతకటం కోసం అమ్మమ్మని దూరం చేసుకున్నావు. మీ గురించి చాలామంది వ్యంగ్యంగా మాట్లాడుకోవటాన్ని భరించారు. ఇన్ని అవమానాలు పొందింది, ఇంత నష్టపోయింది మీరు విడిపోవటానికి కాదమ్మా' అన్నాను.

'ఇప్పుడు నాకు చాలా హాయిగా వుంది చైతూ' అంది అమ్మ.

'నేను నమ్మను. నువ్వన్నట్లు ఇప్పుడు బాగున్నా ఆ తరువాత బాగుండదు. మీకు హాసిని విషయంలో భేదాలు వచ్చాయి. కేవలం నాన్న వల్లనే 'శంకర్'కి ఉరిశిక్ష రద్దు కాలేదని నీకు తెలుసు. నిజానికి హాసిని నా స్నేహితురాలు. ఒకప్పుడు తనకు అన్యాయం జరిగిందని నీ మీద, నాన్నమీద నేను తగాదా పడ్డాను. గుర్తుందా?'

అమ్మ తలూపింది.

'ఇప్పుడు నాలో ఇదివరకటి కోపం లేదు. శంకర్ కూడా మామూలు మనిషి. అతనికో అవకాశం ఇస్తే ఏమౌతుంది అనిపించింది. నాకు ఈ విషయంలో అభ్యంతరముంటే నన్ను కూడా కాదనుకోవాలి' అన్నాను.

'చైతూ నన్ను కన్విన్స్ చేయటానికి ప్రయత్నం చేస్తున్నావా?' అంది సూటిగా నన్నే చూస్తూ...

'నువ్వు చదువుకుంటున్నావు. ఈ తీర్పుల విషయంలో నీ పాత్ర ఏమీ లేదు. శిక్ష వేసినా, వేయకపోయినా నీకు బాధ కలుగుతుంది. అంతవరకే, కానీ మీ నాన్నవల్ల సామాన్యులు కూడా బాధపడుతున్నారు. మీ నాన్న ఓ పక్కన హింసను సమర్థిస్తాడు. దాన్నే ప్రతిహింస అంటాడు. పోనీ దానికే కట్టుబడి వుంటే వేరే విషయం. 'శంకర్' లాంటి ఓ కర్కశమైన వ్యక్తిని కాపాడాలనటాన్ని నేను ఒప్పుకోలేకపోతున్నాను. మీ నాన్నను చూస్తుంటే ఇప్పుడు నాకు కనిపించేవి ఇవే. అందుకే దూరంగా హాయిగా వున్నానని చెబుతున్నాను.'



'అమ్మమ్మ నీ గురించి బాధపడుతోం దమ్మా' అన్నాను.

'నా గురించి బాధపడుతోందా? అంటే నాకు అర్థం కాలేదు'.

'నువ్వూ-నాన్నా విడిగా వుండటం గురించి' అన్నాను.

'చైతూ.. అమ్మమ్మ నీకు పెళ్లికాదని భయపడుతోందేమో. అలాంటి భయాలు అవసరం లేదని చెప్పు. ఒకవేళ ఆమె అనుకున్నట్లు నిజంగానే నీకు పెళ్లి కాకపో యినా ప్రమాదమేమీ లేదని చెప్పు' అంది.

'ఎందుకమ్మా అంత కోపంగా మాట్లాడ తావ్. అమ్మమ్మ నా గురించి బాధపడ లేదు. నీ గురించి బాధపడుతోంది. అయినా నాకు పెళ్లి కాకపోతే ప్రమాదం లేదని నువ్వెలా చెబుతావమ్మా' అన్నాను.

అప్పుడు ఆశ్చర్యంగా చూసింది.

'నీకు పెళ్లి అవసరం లేదనిపించొచ్చు నాకు కావాలి.'

'అంటే మేం విడిగా వుంటే నీకు పెళ్లి కాదనుకుంటున్నావా?'

'అనుకోవటం లేదు. నాకు తగిన వ్యక్తి దొరుకుతాడు. దొరికేదాకా నేను వెయిట్ చేయగలను. నా కోసమయితే మీరు కలిసి బతకొద్దు' అన్నాను.

అమ్మ మాట్లాడలేకపోయింది.

నాకు కోపం వచ్చింది. నేను ఈ విష యంలో ఇంక నాన్నతో కూడా మాట్లాడా లనుకోలేదు. అమ్మ పట్టుదలగా వున్న ప్పుడు నాన్నని ఒప్పించి లాభం లేదు.

నేను-నా చదువు- నా అభిరుచికి చెందిన విషయాలు తప్ప ఈ విషయాలు పట్టించుకోకూడదనుకున్నాను.

★ ★ ★

'ప్రియదర్శిని' హత్య కేసు మీద దేశవ్యా ప్తంగా నిరసనల వెల్లువ ప్రభావం 'జెస్సికా లాల్' కేసుమీద పడింది.

అందరి ముందు జెస్సికాలాల్‌ను నింది తుడు చంపేశాడు. అయినా హంతకుడు తప్పించుకున్నాడు.

అందుకు కారణం హత్యను చూసిన వారు నిజం చెప్పలేకపోయారు. ముఖ్యంగా పోలీసులు సాక్ష్యాలు దొరక కుండా చేశారు.

నిందితుడు తప్పుకున్నా జనం ఊరుకో లేదు. మీడియా ఇలాంటి కేసులన్నింటి మీదా దృష్టి సారించింది.

జెస్సికాలాల్ కేసును తిరగదోడేరు. పోలీసులమీద ఎఫ్.ఐ.ఆర్. దాఖలు చేసి పరిశోధించే స్థితి వచ్చింది.

పద్మకు మళ్లీ ఉత్సాహం వచ్చింది.

గోపాల్ కూడా ఈ కేసుల గురించి తీవ్రంగా అధ్యయనం చేస్తున్నాడు. ఉరికి గురవుతున్న వారిలో ఎక్కువమంది నిరు పేదలే. వారికి ప్రభుత్వం తగినంత న్యాయ సహాయం అందించటం లేదు. అటు వామపక్షాలకు చెందినవారు కాని, మతపరమైన పార్టీలు కాని తమకు చెందిన వ్యక్తులకు మరణ శిక్షలు పడిన ప్పుడు స్పందిస్తున్నారు.

ఓ మతానికి చెందిన వ్యక్తికి మరణ శిక్ష పడితే వామపక్షాల వారు మౌనంగా ఉంటున్నారు. అలాగే వామ పక్షాలకు చెందిన వ్యక్తులకు మరణశిక్ష పడినప్పుడు మతాలకు చెందినవారు మౌనంగా ఉంటు న్నారు.

ఇలాంటి సమయాల్లోనే 'నాగరికత' గురించి ఎవరికి వారు చెబుతున్నారు. 'ఉరిశిక్ష' నాగరిక సమాజానికి తగదని అంటున్నారు. భాష ఏదైనా కావచ్చు ఎంత తర్కంతోనైనా మాట్లాడవచ్చు. అంతిమంగా చూస్తే మాత్రం కొంతమం దికి మాత్రమే పరిమితం అవుతున్నారు.

ఈ విషయాలు తెలిసినప్పుడు, ఇవి వాస్తవాలయినప్పుడు పద్మతో గొడవ ఎందుకు? రాజీ పడాలి. నాది తప్పు అనాలి. ఇప్పుడు 'శంకర్' కేసులో తను చేయగలిగిందేంలేదు. ఉరిశిక్షను యావ

జీవ కేసుగా మార్చవచ్చేమో గాని యావ జ్జీవ కేసుని ఉరిశిక్షగా మార్చటం సాధ్యం కాదుగా అనుకున్నాడు.

అయితే మనసు అంగీకరించలేకపో తోంది.

'నేనూ- నా కుటుంబం అనే చట్రంలోకి వెళ్ళిపోతున్నానా' అనిపిస్తోంది. ఒకసారి అలాంటి ఆలోచనకి వస్తే మరింత పతనం అవుతానేమో. అయినా ఈ సమాజం మారాలనుకున్నప్పుడు ఇలాంటి వాటిని భరించాలి. పద్మే మారుతుందేమో చూద్దాం అనుకున్నాడు.

ఆ విధంగా రెండోసారి కూడా గోపాల్ ఎటూ తేల్చుకోలేకపోయాడు.




'చైతన్యా- మీ అమ్మతో మాట్లాడావా?' అంది అమ్మమ్మ.

'మాట్లాడాను. మనం ఆ విషయం గురించి మర్చిపోదాం అమ్మమ్మా' అంది.

'ఏమందో చెప్పు'

'అవన్నీ వద్దు. తను నాన్న దగ్గరకు వెళ్లదు. అంతే'

'నేను చెప్పమన్నానని చెప్పావా?'

'అమ్మమ్మా నీది పిచ్చి. నువ్వు చెప్పమ న్నావని వినగానే ఎగిరి గంతేస్తుందనుకు న్నావా? ఇన్ని రోజులు నువ్వు చెప్పలేదని అమ్మ నాన్నకు దూరంగా ఉండటం లేదు.'

'ఈ సోదంతా ఆపి ఏం జరిగిందో చెప్పు'

'వద్దులే'

'నామీద నీకు గౌరవముంటే చెప్పు' అంది అమ్మమ్మ.

'అమ్మమ్మా నువ్వు బాధ పడతావని నేను చెప్పకూడదనుకున్నాను.'

'నీకు పెళ్ళి కాదని మా అమ్మ నన్ను నా భర్త దగ్గరికి వెళ్ళమంటోందా' అంది అమ్మ.

ఆ మాటతో ఆమె బిగుసుకుపోయింది.

'అలా అందా?' అంది మెల్లగా నోరు పెగుల్చుకుని.

'అలానే అంది. నేను నీ తరపున గట్టిగా మాట్లాడాను. అమ్మమ్మా ఇంకెప్పుడూ నన్ను అమ్మతో ఈ విషయం మాట్లాడ మని చెప్పవద్దు. మనం వాళ్లు కలిస్తే సంతోషపడదాం. మనం వారికి అవసరం లేదు. మనకీ వాళ్ళు అవసరం లేదు' అంది చైతన్య.

'మేం ఎటూ అట్లానే బతుకుతున్నాం. నీ పరిస్థితి అట్లా ఎందుకవ్వాలనుకున్నాను. కొంతమంది తెగేదాకా లాగుతారు. మీ అమ్మ అట్లాంటిదే. చంపినోడు బాగు న్నాడు. చచ్చిపోయిన పిల్ల ఏ లోకానుందో తెలియదు. వీళ్లు మాత్రం ఇట్టా తయార య్యారు. అయినా నాకు బుద్ధి ఉండాలి. ఇన్ని సంవత్సరాలు కష్టాలన్నీ ఓర్చుకున్నా. ఇప్పుడు నేనెందుకు కల్పించుకోవాలి. బాగానే మర్యాద చేసింది' అంటుంటే గొంతు వణికింది.

'ఈ మాత్రం దానికే నువ్వంత బాధప డాలా? నేను మా అమ్మకి గట్టిగా చెప్పాను. నీకు పెళ్లి వద్దేమో నాకు కావాలి అని. నేను పెళ్లంటూ చేసుకుంటే ముందు నీకు నచ్చాలి. ఈ మాట నిన్ను సంతోష పెట్టటానికి అనటం లేదు. నిజంగా అంటున్నాను' అంది.

ఆమె మాట్లాడలేదు. కానీ చైతన్య మాటలు ఆమెని సాంత్వనపరిచాయి. 'నువ్వు ఇంకెప్పుడూ ఎవర్నీ ఏమీ అడ గొద్దు. నీ ఇష్టమైనంత కాలం చదువుకో. ఆ తర్వాత పెళ్లి గురించి ఆలోచిద్దాం.

నేను వరూధినికి కూడా చెబుతాను' అందామె.

'ఆమెకు పిల్లలున్నారా అమ్మమ్మా?'

'ఎందుకడుగుతున్నావు?' అంది అమ్మమ్మ.

'వరూధిని అమ్మమ్మతో మాట్లాడాలనుకుంటున్నావుకదా. వాళ్లకు చెందిన అబ్బాయిలేమన్నా ఉన్నారేమో అనుకున్నాన్లే' అంది చైతన్య.

ఆమె మాట్లాడలేదుగాని చైతన్య మాటలు ఆమెలో కొత్త ఆలోచన రేకెత్తించాయి.

★ ★ ★

ధనంజయ ఉరి ఆగస్టు 14న అమలు జరిగింది. మరుసటిరోజు దేశానికి స్వాతంత్ర్యం వచ్చినరోజు. అంతకుముందు ఉరికంబాలు ఎక్కినవారు దేశభక్తులు. వారి త్యాగాలవల్లనే మనం ఈపాటి స్వేచ్ఛను అనుభవిస్తున్నామని చెప్పుకుంటాం. స్వాతంత్ర్యం వచ్చాక 'జైళ్లు' అవసరంలేదని భావించినవారున్నారు. సోషలిస్టు వ్యవస్థలోనూ జైళ్లు, ఉరికంబాలు ఉండవనుకున్నారు. కానీ చైనా దేశంలో అత్యధికంగా ఉరితీయటం దేనికి సంకేతం. గోపాల్ మనసు మనసులో లేదు. అతను ఈమధ్య కోర్టుకి సరిగ్గా వెళ్లటంలేదు. ఎక్కువగా ఆలోచనల్లో గడిపేస్తున్నాడు. ఇప్పుడు తన మనసు ఒకటే కోరుకుంటోంది. మనుషులెవరూ ఒకరి ప్రాణం ఇంకొకరు తీసుకునే అవసరంలేని సమాజం కావాలి. ఏ వ్యక్తీ ఇంకో వ్యక్తి ప్రాథమిక హక్కుకి ఏ రూపంలోనూ ఆటంకం కలిగించకూడదు. జైళ్లూ, ఉరికొయ్యలూ- భయంకరమైన శిక్షలు లేని సమాజం కావాలి. అప్పుడు లాయర్లూ, పోలీసులూ, న్యాయస్థానాలూ- న్యాయాధిపతులూ వీరి అవసరం ఉండదు. వీళ్లందరూ కూడా తమ మనసులు చంపుకుని పనిచేయాల్సిన అవసరం ఉండదు. ఎవరి అభిరుచికి తగిన రంగంలో వారు పనిచేసుకోవచ్చు. బతకటంకోసం ఏ రంగం ఎన్నుకుంటే బాగుంటుందనేది కాకుండా మనసుకి నచ్చినవిధంగా జీవితాల్ని మలచుకోవచ్చు. అలాంటిదాన్ని మానవాళి ఎప్పటికైనా చూస్తుందా? అదో అందమైన కలేనా? ఒకప్పుడు ప్రపంచానికి, ముఖ్యంగా తనలాంటివారికి ఆదర్శంగా, లక్ష్యంగా నిలిచిన 'కమ్యూనిజం' తిన్న ఎదురుదెబ్బలు ఇప్పుడు తమందరినీ మార్చివేస్తున్నాయి. ఇది మాత్రం నిజం. ఇప్పుడు 'విశ్వజనీన'మైన సిద్ధాంతంగా మార్క్సిజాన్ని పరిగణించే పరిస్థితి లేదు. ఎవరికి తోచిన వ్యాఖ్యానం వారు చెప్పుకుంటున్న గ్రంథంగా అది మిగిలిపోతోంది. పాతతరం వారంతా రాలిపోతున్నారు. వారు బహిరంగంగా మాట్లాడరు. కొత్తతరంవారు కూడా క్రమంగా కులం- మతం- ప్రాంతం- ఇవి సృష్టిస్తున్న బంధాల్లో చిక్కుకుపోతున్నారు. ఇప్పుడు ప్రపంచవ్యాప్తంగా ఓ పరిణామమేదో జరగాలి. అప్పుడు మాత్రమే కనీసం కొంత మందయినా ఏకమవుతారు అనుకున్నాడు.

అతనికి చైతన్యను కలుసుకోవాలనిపించింది.

★ ★ ★

పరీక్షలయిపోయాయి. నాగపూర్ నుంచి నేను హైదరాబాద్ వచ్చాను. అమ్మమ్మ మళ్లీ ఊరు వెళ్లింది. కొన్ని రోజులు అక్కడే ఉంటానని అంది. నేను హైదరాబాద్‌లోనే ఉండి డాక్టరేట్ చేయాలనుకుంటున్నాను. అమ్మని, నాన్నని కూడా కలుసుకుని అయిదారు నెలలవుతోంది. నేను ఇదివరకటిలానే అమ్మ దగ్గర, నాన్న దగ్గర ఉండాలని నిర్ణయించుకున్నాను. చూస్తుండగానే అయిదు సంవ

త్సరాలు గడిచిపోయాయి. ఇప్పుడు నాకు నేస్తం ఎవరంటే వరూధిని అమ్మమ్మే.

'చైతన్యా మీ అమ్మమ్మ నీ పెళ్లి గురించి ఆరాటపడుతోందిరా. నన్ను కూడా మంచి సంబంధం చూడమని చెప్పింది. నేనయితే బయటకు వెళ్లటంలేదు. ఇంట్లోనే ఉంటు న్నాను. అయినా నువ్వు ఇంకొంతకాలం ఆగుతావా? అసలు ఈ విషయం మీ అమ్మా నాన్నలతో మాట్లాడావా?' అని అడిగారామె.

'లేదమ్మమ్మా' అన్నాను.

'కనీసం వాళ్లయినా నువ్వేం చేస్తావని అడిగారా?'

'అడగలేదు. పరీక్షలు ఇప్పుడే అయ్యాయి. మెల్లగా అడుగుతారేమో' అన్నాను.

'నేను ఇప్పటివరకూ వంట నేర్చుకో లేదు. టీ పెట్టటం వరకు వచ్చు నాకు వంట చేసుకునే అవసరం లేకుండా అమ్మా- నాన్న- అమ్మమ్మ సహాయప డ్డారు. ఇప్పుడు నేను వంట నేర్చుకోవాల నుకుంటున్నాను. ఎప్పుడూ ఇంకొకరిమీద ఆధారపడటం మంచిది కాదుకదా.'

నేను తత్వశాస్త్రానికి చెందిన ఎన్నో పుస్త కాలు చదివాను. చదువుతున్నాను. ఎప్ప టికప్పుడు మానవజీవితంలో కొత్త కొత్త ఆలోచనా పరంపర ఊపిరి పోసుకుం టోంది. ఎకడమిక్‌గా చదవటం వేరు, మా సిలబస్‌లో లేని పుస్తకాలు, సమాజం మీద ఓ ముద్ర వేసిన పుస్తకాలు కూడా నేను చదువుతున్నాను.

నాకు ప్రతిదాంట్లోనూ కొంత ప్రత్యేకత కనిపించింది. అలాగే ఓ తత్వాన్ని ప్రతిపా దించే స్థితిలో ఓరకంగానూ, ఆచరణలో దిగాక ఇంకో రకంగానూ ప్రజలు స్వీకరి స్తున్నారు. ప్రతిదానికీ ప్రారంభం ఓ అవస్థే. తర్వాత కాలంలో ఉచ్ఛ దశ. క్రమంగా అదే 'తత్వశాస్త్రాన్ని' నమ్మినవా రిలో విభేదాలు.. మెల్లగా క్షీణదశ మొద లవుతుంది. ఆ తర్వాత అవశేషంగా మిగు లుతుంది. కొన్ని తత్వశాస్త్రాలు మధ్యలో మళ్లీ కొంతకాలం ఓ వెలుగు వెలుగు తాయి.

అయినా ఈ వయసులో నీకు తత్వశా స్త్రాలతో పనేమిటి? అవి చదివినకొద్దీ లోతులకు వెళ్లినకొద్దీ ముసలమ్మల్లా తయారవుతాం. లేదా ముసలయ్యలు అవు తాం. కాస్త రొమాంటిసిజం కూడా కావాలి అన్న స్నేహితురాళ్లున్నారు.

సోవియట్‌లో చాలా కాలం రొమాం టిక్ చిత్రాలు తీయటానికి ఎవరు ముందుకు వచ్చేవారు కాదు. అక్కడ ప్రభుత్వ అధీనంలో సినిమా ఉండేది. సాహిత్యంలోనూ అంతేనేమో. అక్కడ సంస్కరణలు మొదలయ్యాకే వెల్లువలా అన్ని రకాల సాహిత్యం, సినిమాలు వచ్చాయి.

అంతకుముందు కూడా కొన్ని నవలల్ని ఆ ప్రభుత్వం నిషేధించింది. అవన్నీ కూడా ఫిలాసఫీకి చెందినవే. చరిత్రలో ఎప్పుడూ ఇదే గొడవ. తమ వాదం మాత్రమే సరైందని నమ్మటం వరకు అర్థం చేసుకోవచ్చు. కానీ అందుకోసం మారణహోమం చేయటం అసలు విషాదం.

ప్రతి మతమూ, అందులోని శాఖలు, అలాగే కులమూ, అందులోని ఉపకులాలు, ప్రాంతాలు, వాటిలోని ఉప ప్రాంతాలు ఎప్పుడూ ఘర్షిస్తూనే వుంటాయి. అవసర మైన సందర్భాల్లో తాత్కాలికంగానే కలుస్తున్నాయి. ఆ అవసరం తీరిన మరు క్షణం నుండే మళ్లీ ఎవరి గ్రూపు వారిది.

మానవజాతి సత్యాన్వేషణ చేయటానికి అడ్డుగా వున్నవి చాలా వున్నాయి. ప్రస్తుతం ఈ ప్రపంచాన్ని గుప్పిట పెట్టు కుంది మాత్రం అమెరికావాడే. అందులో

సందేహం లేదు.

మానవజాతి గమనాన్ని వాళ్లు నిర్దేశిం చాలని చూస్తున్నారు. అది సాధ్యం కాదని వారికి తెలుసు. అయితే ఎవరికైనా భ్రమలు లేకపోతే బతకలేరు.

నాకు ఎందుకో నా వయసు వారికంటే అమ్మమ్మలాంటి వారితో స్నేహం చేయాల నిపిస్తోంది. నన్ను చూసి మా అమ్మ చిరాకు పడుతుంది. నేను ఫిలాసఫి తీసు కోవటం తనకు ఇష్టం లేదు. నన్ను కూడా తనలానే స్త్రీల కోసం పనిచేయాలని అమ్మ కుంది. నేను ఎప్పుడేం చేస్తానో అనే సందేహం అమ్మలో వుంది.

మరీ ఎక్కువగా చదివితే చర్చలకే పరి మితం అవుతారనే భయం అమ్మది. అది కూడా ఓ విభాగమే. ఎవరో ఒకరు చర్చ చేయాలి కదా. నా స్నేహితురాలు ఈ మాటకు ఏమందంటే...

'నువ్వు కూడా ఏ తత్వవేత్తనో, స్వామీ జీనో చేసుకోవే. ఇద్దరూ చక్కగా చర్చల్లో మునిగి తేలవచ్చు' అంది. నాకు నవ్వొ చ్చింది.

'చైతన్యా నువ్వు మామూలు మనిషిని చేసుకున్నావా ఇక, ఆ మహానుభావుడి పరిస్థితి గందరగోళమే. ఆ సాహసం చేయకు' అంది.

'ఆ మాట చెప్పాల్సింది నాకు కాదు. నన్ను చేసుకోబోయేవాడికి. సాహసం లాంటిది ఏదన్నా వుంటే అది చేసేదతనే' అన్నాను.

ఇద్దరం నవ్వుకున్నాం. అయినా ఇరవై అయిదు సంవత్సరాలైనా రాకుండా పెళ్లే మిటి అనుకున్నాను.

★ ★ ★

నాన్న ఓ రోజు నా గదికి వచ్చారు. మంచంమీద కూర్చున్నారు. 'చైతన్యా...' అన్నారు దిగులుగా.

'ఏమైంది నాన్నా' అన్నాను.

'ఏమీ కాలేదు. ఎందుకో ఈ మధ్య ఉత్సాహంగా వుండటంలేదు. నువ్వు చిన్న ప్పుడే నయం. కవిత్వం రాసేదానివి. ఇప్పుడు సొంతం మానేశావు. ఇన్ని సంవ త్సరాలుగా మాకు దూరంగా వున్నావు. అంతకు ముందు కూడా మా పక్కనే వు న్నా నాకే తీరికలేదు. చాలా సంవత్సరాలు వృథా అయ్యాయి' అన్నాడు.

'నువ్వేం చెబుతున్నావో నాకు అర్థం కావటంలేదు నాన్నా.'

'ఏం లేదమ్మా... మళ్లీ నువ్వు చదువు కోసమో, పెళ్లి చేసుకునో వెళ్లిపోతావు. అది తలుచుకుంటేనే బాధగా వుంది.'

'అంటే నన్ను పెళ్లి చేసుకోవద్దంటారా నాన్నా.'

'ఛ...ఛ... నా ఉద్దేశం అది కాదు. ఈ మధ్య నీ గురించి నేను ఎక్కువగా ఆలో చిస్తున్నాను. నీకు నేను న్యాయం చేయలే కపోయాను. నా కిప్పుడు, నువ్వు మళ్లీ చిన్నపిల్లవయితే బాగుండుననిపిస్తోంది' అన్నారు నాన్న.

'నాకూ చిన్నపిల్లని కావాలనుంది. అయితే మళ్లీ నిన్నటి నాన్ననే - నిన్నటి అమ్మనే నేను చూడాలనుకోవటం లేదు' అన్నాను.

నాన్న మౌనంగా తలూపాడు.

'అమ్మమ్మ గురించి వచ్చిన చర్చలో ఓ సారి అమ్మ -లోకంలో చాలామంది మను షులున్నారు. వారిలో బంధువుల్ని చూసు కోవచ్చు కదా అంది. ఆ మాటలు నాకెప్పుడూ గుర్తుంటాయి. అయితే అమ్మతో నేను ఏకీభవించను.'

సమాజంలోని మనుషులతో మంచి సంబంధాలు వుండవచ్చు. అయితే రక్త సంబంధాలను వదులుకోవటంలో అర్థం లేదు. ప్రపంచంలోని ఏ గొప్ప ఫిలాసఫర్ కూడా రక్తసంబంధాలకు అతీతంగా లేరు.

పిల్లల్ని కన్నప్పుడు వారి బాధ్యత తల్లి

దండ్రులదే. అయినా ప్రపంచమంతటితో సంబంధం తెంచుకోవటంలో గొప్పదనం లేదు. కలిసి వుండటంలో వుంది.

నాన్నకు ఈ విషయం ఇప్పుడు అర్థమవుతుందేమో!

నేను నాన్నని గమనిస్తున్నాను. చిన్నప్పటి నా ఫొటోల్ని తదేకంగా చూస్తూ కూర్చుంటారు. అలాగే గోడ ముందు నిలబడి నేను రాసిన అక్షరాలకేసి చూస్తుంటారు. అలాంటప్పుడు ఆయన్ని చూస్తే చాలు జాలి కలిగేది. నేను నాన్నగారిని అర్థం చేసుకోలేకపోతున్నానా... ఆయన కోరుకున్న ప్రేమను అందించలేకపోతున్నానా? ఇంతకూ నేనేం చేస్తే ఆయన సంతోషపడతారు?

★ ★ ★

నేను అమ్మమ్మ దగ్గరకు వెళ్లాను.

నన్ను చూడగానే కంగారుపడింది. ఏదో జరిగిందనుకుంది.

'ఎందుకమ్మమ్మా అంత కంగారుపడుతున్నావు' అన్నాను.

'ఏం చెప్పమంటావు. ఒకప్పుడు నాలో చాలా ధైర్యం వుండేది. ఎలాంటి పరిస్థితి వచ్చినా ఎదుర్కోగలననే ధీమా వుండేది. ఇప్పుడలా అనిపించడంలేదు' అంది.

'అమ్మమ్మా మనం వెళ్లిపోదాం' అన్నాను.

'ఎక్కడికి... నువ్వు హైదరాబాద్‌లోనే వుంటానన్నావు కదా' అంది.

'అలా అనుకున్నాను. ఇప్పుడు నా నిర్ణయం మార్చుకున్నాను'

'ఇప్పుడు ఎక్కడికి వెళ్దామని' అంది.

'మావయ్య దగ్గరకు వెళ్దాం' అన్నాను.

అమ్మమ్మ నాకేసి ఆశ్చర్యంగా చూస్తోంది.

'మావయ్య దగ్గరికా... నేనెందుకమ్మా.. నువ్వు వెళ్లు' అంది.

'అలా కాదు. మనం శాశ్వతంగా అక్కడ వుండటానికి వెళ్లటం లేదు. మళ్లీ ఇండియా వచ్చేద్దాం. నాకెందుకో మావయ్యని, అత్తయ్యనీ, మధునీ చూడాలనుంది' అన్నాను.

'వాళ్లకి మనల్ని చూడాలని లేనప్పుడు మనమెందుకు చూడాలి?'

'అమ్మమ్మా ఇకనైనా పట్టుదలలు మానేద్దాం. నీకు మాత్రం నీ మనవరాలిని చూడాలని లేదా? తనతో మాట్లాడాలని లేదా? నా పెళ్ళి గురించి ఆరాటపడ్డావు. మధు పెళ్లి గురించి నువ్వు ఆలోచించవా? మేమిద్దరం నీ మనవరాళ్ళమేగా. ఎందుకని తనను వేరుగా చూస్తావు. అత్త బయటి నుంచి వచ్చిందనా?' అన్నాను.

ఈ మాటలు అమ్మమ్మ మీద బలంగా ప్రభావం చూపించాయి.

'ఏమిటోనే నాకు ఏమీ తెలియటంలేదు. నేను వరూధినితో మాట్లాడాలి' అంది అమ్మమ్మ.

'మాట్లాడు. ఆమె తనకు అన్యాయం చేసిన వారినే క్షమించింది. ఆమె స్నేహితురాలివి, ఆ మాత్రం నీ పిల్లల్ని క్షమించలేవా' అన్నాను. అమ్మమ్మ ఇంక మాట్లాడలేదు.

నేను మావయ్యతో మాట్లాడాను. అమ్మమ్మా- నేను స్టేట్స్ వస్తున్నామని. ఈ వయసులో అమ్మమ్మని అమెరికా తీసుకువెళ్లాలంటే చాలా సమస్యలున్నాయి. 'వీసా విషయం గురించి మీరేం వర్రీ కావద్దు. అన్నీ నేను చూసుకుంటాను' అన్నాడు. అత్తయ్య, మధు కూడా నాతో మాట్లాడారు.

వాళ్లందరూ కూడా ఎంతో సంతోషపడ్డారు. మావయ్య అక్కడ్నుంచే ఆ ఏర్పాట్లలో ఉన్నాడు.

నేను ముందుగా ఈ విషయం అమ్మకి చెప్పాను. అమ్మ ముందు నమ్మలేదు. అమ్మమ్మ ఒప్పుకుందా- నిజంగా ఒప్పు

కుందా? అని నాలుగుసార్లు అడిగింది. నేను ఒప్పుకుందని చెప్పినా తను నమ్మలేకపోయింది.

'నువ్వు కూడా వస్తావా అమ్మా' అని అడిగాను.

'నేనెందుకు చైతూ- మీరు వెళ్లిరండి' అంది.

'అమ్మమ్మ కూడా ముందు ఇలానే అంది' అన్నాను.

'నాకు పనులున్నాయి చైతూ- నేను రాలేను' అంది అమ్మ.

★ ★ ★

గోపాల్‌కి చైతన్య ఈ విషయం చెప్పగానే ఆశ్చర్యంతోపాటు ఓ షాక్ కలిగింది.

'నువ్వు స్టేట్స్ వెళ్లటం ఏంటమ్మా' అన్నాడు.

'అదేంటి నాన్నా అలా అన్నారు. మన దేశంలో చాలామంది వెళ్తున్నారు. నేను కూడా వెళ్తున్నాను' అంది.

'నా ఉద్దేశం అది కాదమ్మా. నువ్వు అక్కడ సెటిల్ అవటానికి వెళ్తున్నావా?'

'అదింకా నిర్ణయించుకోలేదు నాన్నా. ముందయితే ఆ దేశాన్ని చూడాలనుకుంటున్నాను. వెళ్లాక ఏమనిపిస్తుందో నాకు తెలియదు.'

'చైతూ- ఇప్పటికే నిన్ను మిస్సయ్యానని బాధపడుతున్నాను. మళ్ళీ స్టేట్స్ వెళ్లిపోతానంటున్నావు. నేను ఒంటరివాడినయిపోతానమ్మా' అన్నాడు.

'అయితే నాతోపాటు మీరూ రండి' అంది చైతన్య.

'అది కుదిరే పనా' అన్నాడు.

'మరేం చేద్దాం నాన్నా. అమ్మమ్మ కూడా నాతో పాటు రావటానికి ఒప్పుకొంది'

'మీ అమ్మ కూడా మీతో వస్తాందా?' అన్నాడు గోపాల్.

'లేదు నాన్నా, అమ్మ రానంది'

'ఇంకోసారి ఆలోచించు చైతూ... నువ్వు నాకు దూరంగా వెళిపోతున్నావనే ఆలోచననే భరించలేకపోతున్నాను'

'నాన్నా! ప్రపంచం ఇప్పుడు చాలా దగ్గరయింది. మీరు నన్ను చూడాలనుకున్నా, నేను మిమ్మల్ని చూడాలనుకున్నా ఒక్కరోజులో అది కుదురుతుంది. మనకి ఇప్పుడు కావలసింది డబ్బులు' అంది చైతన్య.

గోపాల్ మాట్లాడలేకపోయాడు.

'నేను అయిదు నెలల లోపు వచ్చేస్తాను నాన్నా. నేను నా చదువు విషయంలో ఓ నిర్ణయానికి రావాలి. ఆ విషయం తేల్చుకోవటానికి కూడా నేను స్టేట్స్ వెళ్తున్నాను. అంది చైతన్య.

గోపాల్ తలూపాడు మౌనంగా.

★ ★ ★

నేను స్టేట్స్ వెళుతున్నానని తెలియగానే నాన్నలో చాలా మార్పు వచ్చింది. ఓ రకంగా చిన్న పిల్లవాడయ్యారు. నేను అమ్మ దగ్గరకు వెళ్తానన్నా 'నా దగ్గర ఇంకెన్ని రోజులు వుంటావు చైతూ... ఈ నాలుగు రోజులన్నా నాతో కలిసుండు' అంటున్నారు.

ముఖ్యంగా పగలంతా ఎక్కడకు వెళ్లినా రాత్రికి ఇంటికి వచ్చేస్తున్నాను. నాన్న నాకు ప్రతిరోజు స్పెషల్‌గా వండిపెడుతున్నారు.

ఓరోజు బట్టల షాపుకి తీసుకువెళ్ళారు. తను అయిదారుజతల డ్రెస్సులు తీసుకున్నారు. అందులో కొన్ని నేనిష్టపడినవి. కొన్ని నాన్నగారు ఇష్టపడినవి.

'ఈ డ్రెస్‌లో నువ్వెలా వుంటావో చూసుకోవాలనుకుంటున్నాను' అన్నారాయన.

ఓ ఫొటోగ్రాఫర్‌ని తీసుకొచ్చారు.

'ఇతను చాలా మంచి ఫొటోలు తీశాడమ్మా. నేను రిక్వెస్ట్ చేశాను. మామూలుగా ఇలాంటి ఫొటోలు తీయటానికి ఒప్పుకోడు' అన్నారు.



నన్ను రకరకాల ఫొటోలు తీశారాయన. నేను నాన్నగారు కలిసిన ఫొటోలు తీయించారు. నాలుగురోజుల తర్వాత వాటిని తీసుకొచ్చారు. ఆయన కళ్లలో ఎంత సంతోషమో చెప్పలేను.

నిజంగానే అతనో అద్భుతమైన ఫొటో గ్రాఫర్.

నా ఫొటోల్ని ఇంత అందంగా తీయటం ఇదే మొదటిసారి. నేను అందంగా వున్నా నని కాదు. అసలు ఆ యాంగిల్స్ రకర కాల మూడ్స్‌ని అతను పట్టుకొన్న తీరు నన్ను ఆశ్చర్యపరిచింది.

నాన్న కళ్లనిండా ప్రేమ. దాంతోపాటు నేను తనకి దూరంగా వెళ్తున్నాననే దిగులూ వుందేమో.

'ఈ ఫొటోని ఎన్‌లార్జ్ చెయ్యమన్నా నమ్మా' అన్నారు.

నాకు ఆ ఫొటోనే నచ్చింది. ఆ ఫొటోని పెద్దదిగా చేసి తన గదిలో పెట్టుకుంటా రంట. నేను అమ్మకి ఫొటోల్ని చూపిం



చాను. తను ఒక్కొక్క ఫొటో చూస్తూ మా ఫొటో దగ్గర ఆగింది. అలా చూస్తుం డిపోయింది. నిజానికి ఆ ఫొటోలో ఓ పక్కన అమ్మ కూడా వుండాలి. తను లేక పోవడం వల్ల బాధ కలిగిందా?

ఎందుకో నా కళ్లలోకి చూసింది. ఆ తర్వాత మళ్లీ కింది ఫొటోల్ని చూడటం మొదలు పెట్టింది. ఒక్క ఫొటోని విడిగా తీసి 'ఇది నా దగ్గరుంచుకుంటాను' అంది అమ్మ.

నాన్నగారు పెద్దదిగా చేయిస్తానంది ఆ ఫొటోనే. అంటే మా ముగ్గురి అభిరుచులు కొన్ని విషయాల్లో సరిపోతున్నాయి. నేను స్టేట్స్ వెళ్లటం పట్ల అమ్మకి కూడా బాధ వుందేమో? అదేంటో.. ఇప్పుడు నాకూ బాధగానే వుంది.

నాగపూర్‌లో ఇన్ని సంవత్సరాలున్నా కలగని బాధ ఇప్పుడు కలుగుతోంది.

వచ్చే నెలలోనే మా ప్రయాణం.

అమ్మమ్మ వచ్చేసింది. వరూధినిగారి దగ్గర వుంటుంది. ఆమెకు కూడా మేం మావయ్య దగ్గరకు వెళ్లటం సంతోషాన్ని కలిగించింది.

నేను ఇక్కడ వున్నన్ని రోజులయినా అమ్మా నాన్నలు నాతో కలిసుంటే బాగుం డుననిపించింది.

★ ★ ★

చైతన్య పుస్తకాలు సర్దుతోంది. అప్పుడు తలుపు మీద చప్పుడయింది. గోపాల్ ఇంట్లో లేడు. కమింగ్ అని చైతన్య వెళ్లి తలుపు తీసింది. ఎదురుగా ఓ యువకుడు నిలబడున్నాడు. అతను చైతన్యకేసి అదోలా చూశాడు.

'ఎవరు కావాలండి?'

'గోపాల్‌గారిని కలవటానికి వచ్చాను' అన్నాడతను.

'నాన్నగారు ఇంట్లో లేరు' అంది.

అతను ఎంత తొందరగా వెళ్లిపోతే అంత బాగుండుననిపించింది చైతన్యకి.

'ఊరెళ్లారా?' అన్నాడతను.

'లేదు. పనిమీద వెళ్లారు'

'నేను ఆయన్ని కలుసుకోవాలి' అన్నాడు అతను.

'ఫోన్ నెంబర్ చెబుతాను. మాట్లా డండి' అంది చైతన్య.

అతను జేబులోనుండి సెల్ ఫోన్ బయటకు తీసి చైతన్య చెప్పిన నెంబర్ ఫీడ్ చేసుకున్నాడు.

'థాంక్స్ వస్తాను' అని అదోలా చూసి వెనక్కి తిరిగాడు.

చైతన్య తలుపు మూసింది.

ఎవరతను...

ఎక్కడో చూసినట్లుంది. మీసాలూ-గడ్డం పెంచాడు. నాన్న కోసం వచ్చాడంటే ఎవరై ఉంటారు. అతన్ని ఎక్కడో చూసి నట్లు అనిపిస్తుందే. ఎందుకో నాకు ఏమీ చేయాలనిపించలేదు. ఒక్కసారిగా ఒంటరి దాన్నయిన ఫీలింగ్ కలిగింది.

అప్పటికప్పుడు నేను ఇంటికి తాళం వేసి బయటకు వెళ్లిపోయాను.

★ ★ ★

రాత్రి చైతన్య ఇంటికి వచ్చింది.

అప్పటికి గోపాల్ ఇంట్లో ఉన్నాడు.

'రామ్మా- నీ కోసం నేను చూస్తున్నాను. ఇంట్లో భోంచేద్దామా- బయటకు వెళ్దామా' అన్నాడు.

'నేను భోంచేసి వచ్చాను నాన్నా' అంది.

'భోంచేశావా?' నిరాశగా అన్నాడు.

'ఫర్వాలేదు నాన్నా. మీకు కంపెనీ ఇస్తాను' అని అప్పుడు గుర్తొచ్చి,

'మీ కోసం ఎవరో వచ్చారు. కలిశారా?'

'ఎవరమ్మా? పేరు అడగలేదా?'

'ఎవరో కుర్రాడు. కుర్రాడంటే మరీ కుర్రాడు కాదు. అతన్ని చూస్తే పేరు కూడా అడగాలనిపించలేదు. మీ ఫోన్ నెంబర్ ఇచ్చాను. అతనికి కాస్త గడ్డం ఉంది' అంది చైతన్య.

'అతనా.. కలిశాడమ్మా... అతను ఎవర నుకున్నావు, శంకర్'.

పెరోల్ మీద బయటకి వచ్చాడు. నన్ను కలుసుకుని 'థాంక్స్' చెప్పటానికి వచ్చాడు.

చైతన్యకి షాక్ తగిలినట్లయింది.

'అతను శంకరా?' అంది అప్రయత్నంగా.

'అవునమ్మా... అతను చాలా మారాడు. నీకు ఇంకో విషయం తెలుసా? జైల్లో అతని సత్ప్రవర్తనకి త్వరలోనే శిక్షాకాలాన్ని తగ్గిస్తారంట' అన్నాడు గోపాల్.

'అంత మారిపోయాడా నాన్నా'

'నేను ముందు నుంచి చెబుతున్నా కదమ్మా- మనుషులు ఎప్పుడూ ఒకే రకంగా ఉండరని'

గోపాల్ డైనింగ్ టేబుల్ దగ్గరికి వెళ్లాడు.

చైతన్య నాన్నకి వడ్డిస్తోంది.

'అమ్మా- శంకర్ పెరోల్ మీద బయటకు వచ్చాడని పద్మకు చెప్పవద్దు'

'ఎందుకని నాన్నా?' అంది చైతన్య.

'మీ అమ్మ బాధ పడుతుంది. తను ఓడిపోయానని ఇప్పటికే అనుకుంటోంది. అందులోనూ శంకర్ వచ్చి నాకు థాంక్స్ చెప్పాడని తెలిస్తే అసలు భరించలేదు' అన్నాడు గోపాల్.

చైతన్య ఆలోచనలు అమ్మ మీదికి వెళ్లాయి. నిజమే. అమ్మకు ఈ విషయం తెలిస్తే చాలా కోపం వస్తుంది. అయినా ఈ విషయాన్ని తను చెప్పకపోవచ్చు. రేపు పత్రికల్లో రాకూడదనేముంది. ఏ విలేఖరో 'శంకర్'కి పెరోల్ వచ్చిందని రాయవచ్చు. అప్పుడు గుర్తొచ్చాడు సుధీర్.

ఇపుడు శంకర్ విషయం సుధీర్‌కి తెలిస్తే ఏ విధంగా రియాక్టవుతాడో అనుకుంది.

'నాన్నా-శంకర్‌కి పెరోల్ ఎన్ని రోజులుంటుంది?'

'నెల రోజులమ్మా' అన్నాడు గోపాల్.

అతను భోంచేయటం అయిపోయింది.

'ఇంకేంటమ్మా విశేషాలు' అన్నాడు గోపాల్.

'నాకు చెందిన విశేషాలేం లేవు నాన్నా... మీరే చెప్పాలి'.

'నేను రోజులు లెక్క పెడుతున్నానమ్మా... నువ్వు వెళ్ళిపోయాక ఏం చేయాలా అని ఆలోచిస్తున్నాను.'

'అదేంటి నాన్నా. మీరు 'లా' చేసిందెందుకు? న్యాయాన్ని కాపాడటానికి ఏం చేయాలా అని మీరు ఆలోచించటం ఏమిటి? ఈ దేశంలో మీ సహాయం కావాల్సిన అభాగ్యులు చాలామంది ఉన్నారు. మీరు మరీ ఏదో కోల్పోయినట్లు అనుకోవద్దు. నేను మళ్లీ వస్తాను. అయినా పెళ్ళి చేసుకున్నా- వేరేచోట ఉద్యోగం చేయాలనుకున్నా మీ దగ్గర ఉండను. అందుకని నా గురించి ఇదివరకు ఎలా ఉన్నారో- ఇప్పుడూ అలానే ఉండండి' అంది చైతన్య.




శంకర్ గుర్తొస్తే చాలు. సంవత్సరాలు వెనక్కి దొర్లిపోతున్నాయి.

అప్పటి దృశ్యాలు- సంఘటనలు అన్నీ కళ్ల ముందు తిరుగుతున్నాయి. నాన్న అతను మారిపోయాడంటున్నారు.

అతను హోసిని విషయంలో పశ్చాత్తాప పడ్డాడని నాన్న చెప్పలేదు. మరిచిపోయారా?

అసలతను 'హాసిని' గురించి మాట్లాడాడా?

నాన్న అడిగారా?

నేను అమ్మ దగ్గరకు వెళ్లాను. అపుడే అమ్మ ఇంకెవరితోనో మాట్లాడుతోంది. వాడి మాటలు నాకు వినిపిస్తున్నాయి.

'ఈ క్షమాభిక్షలది ఓ ప్రహసనం. ఏ పార్టీ అధికారంలో వున్నదనే విషయాన్ని బట్టి అవన్నీ ఉంటాయి. అయినా జైలులో వున్న చాలామంది ఖైదీలు రకరకాల వ్యాధుల్తో బాధపడుతున్నారు. అలాంటి వాటి గురించి పట్టించుకోరు. ఈ మధ్య ఇంటికంటే జైలే నయం అనుకుంటు న్నారు. అక్కడ దొరకని సుఖం లేదు. పైగా ఖైదీలకు జైలు సిబ్బంది భయపడుతున్నారు' అంటోంది అమ్మ.

"అవును రోజులు చాలా మారిపోయాయి. మా నాన్నగారు అప్పట్లో జైల్లో వున్నప్పటి పరిస్థితుల గురించి చెప్పేవారు. రాజకీయ ఖైదీలను కూడా చాలా దారుణంగా చూసేవారు. ఇప్పుడు కూడా సమాజం కోసం పనిచేస్తూ జైలుకెళ్లిన వారి పరిస్థితిలో పెద్దగా మార్పులేదు. మర్యాదలన్నీ హంతకులకు, ఖూనీకోర్లకే" అంటుందో నడివయసావిడ.

అమ్మకి ఈ సమయంలో శంకర్ విషయం చెబితే తను ఇదంతా లంచాలతో, రాజకీయ అండతో జరిగిన లాలూచీ కార్యక్రమమని చీదరించుకుంటుంది. నిజానిజాలు వాళ్లకే తెలియాలి. నన్ను పలకరించడానికి వచ్చింది.

'ఈ రోజు వుంటున్నావా? ' అంది.

'లేదమ్మా... రేపు ఉంటాను' అన్నాను.

'సరే వుండు. ఆంటీతో మాట్లాడి వస్తాను.'

'నేను రేపు వస్తాన్లేమ్మా'

'ఎందుకొచ్చావ్? ఎందుకు వెళుతున్నావ్? ' అని అడిగింది.

'నువ్వు ఖాళీగా వున్నావేమో అనుకు న్నాను. నాకు పనుందిలే' అని చెప్పి బయటకు వచ్చాను. నేను వరూధిని అమ్మమ్మ దగ్గరకు వెళ్లాను. వాళ్లకి శంకర్ విషయం చెప్పాను.'

'వాడు వచ్చినప్పుడు ఇంట్లో మీ నాన్న లేడా? నీకు భయం కలగలేదా? 'అంది అమ్మమ్మ.

'ఎందుకు భయం? '

'ఇంట్లో నువ్వు ఒక్కదానివే కదా... వాడు నిన్ను ఏమైనా చేసుంటే' అంది అమ్మమ్మ.

'నేనేం భయపడలేదు. అయినా నాన్న లేడని చెప్పాను గానీ ఇంట్లో ఎవరూ లేరని చెప్పలేదుగా' అన్నాను.

'అయినా అలాంటి వాళ్లు మీ నాన్న దగ్గరకి రావడం ఏమిటి...? ' అంది అమ్మమ్మ.

'చెప్పిందిగా.. కృతజ్ఞతలు చెప్పుకోవటానికి వచ్చాడని' అంది వరూధిని అమ్మమ్మ.

'ఏమైనా మీ నాన్నకి చెప్పు అలాంటి వాళ్ళని దూరంగా వుంచమని.'

'ఉంచుతాడులే లాయర్లన్నాక అనేక రకాల వాళ్లు వస్తుంటారు. అందరినీ భరించాలి దేవీ'

'ఊఁ' అని అమ్మమ్మ నిట్టూర్చింది.

'అతను పెరోల్ మీద వచ్చాడు. అది అయిపోగానే మళ్లీ జైలుకి వెళ్తాడు. అతనితో అంతటితో సంబంధం వుండదు' అంది వరూధిని అమ్మమ్మ.

'ఈ విషయం మీ అమ్మకు చెప్పద్దు. ఆడాళ్లనందరిని వేసుకుని వాడి ఇంటికి వెళ్తుంది. మళ్లీ అదో రచ్చ' అంది అమ్మమ్మ.

'నాన్న కూడా ఇలానే అన్నారు' అన్నాను.

వాళ్లిద్దరూ ఒకరి ముఖాలు ఇంకొకరు చూసుకున్నారు.

పద్మ ఆ రోజు చైతన్యకోసం తీరిక చేసుకుంది.

ఉదయం వచ్చిన దగ్గర్నుండి చైతన్యని విడిచి పెట్టలేదు.

'చైతూ- మనిద్దరం మూగమనసులు సినిమాకి వెళ్దామా' అని అడిగింది.

'అదేంటమ్మా... అది పునర్జన్మల మీద సినిమా కదా? నీకు ఆ సినిమా అంత బాగా నచ్చిందా?' అంది చైతన్య.

'నా చిన్నప్పుడు చూసిన సినిమా అది. అప్పుడు నేను జన్మల గురించి ఆలోచించలేదు చైతూ. ఆ సినిమాలో పాటలు నాకు ఇష్టం. గోదావరి ఇష్టం. అందులో నటించిన సావిత్రి, జమున, నాగేశ్వరరావులు నా కిష్టం' అంది.

'ఇంకా నీకు ఏ సినిమాలంటే ఇష్టమమ్మా' అంది చైతన్య.

'మల్లీశ్వరీ ఇష్టం. డాక్టర్ చక్రవర్తి ఇష్టం. ముఖ్యంగా మన సున మనసై- బతుకున బతుకై పాట చాలా ఇష్టం. ఆశయాలతో ఆవేదనలతో నేనున్నానని నిండుగా పలికే తోడొకరుండిన అదే భాగ్యమూ అదే స్వర్గమూ' అనే చరణాలు మరీ మరీ ఇష్టం చైతూ...' అంది పద్మ.

తను అలా ట్రాన్స్‌లోకి వెళ్లినట్లు మాట్లాడుతోంది.

నేను గోపాల్ కలిసివున్న తొలిరోజుల్లో నేను పాటలు పాడేదాన్ని.

'పాతాళభైరవి లాంటి సినిమాల్ని, మాయాబజార్ లాంటి పౌరాణిక చిత్రాల్ని నేను చిన్నప్పుడు ఎంతో అభిమానంగా చూసేదాన్ని . నేను చదువుకున్నాక కొత్త కొత్త ఆలోచనలు వస్తున్నాక నాలో చాలా మార్పు వచ్చింది. కొన్ని అభిరుచుల్ని బలవంతంగా చంపుకున్నాను. నేను దేవున్ని నమ్మకుండా ఈ సినిమాలు చూడటమేమిటి? ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారనిపించేది. పాటల మీదా అదే అభిప్రాయం. సినిమా పాటలన్నీ అసలు పాటలే కావు అని నాలో ఓ భావజాలాన్ని నింపుకున్నాను. మనసును కదిలించేది ఏదైనా మంచి పాటే' అంది పద్మ.

**'నా చిన్నప్పుడు చూసిన సినిమా అది. అప్పుడు నేను జన్మల గురించి ఆలోచించలేదు చైతూ. ఆ సినిమాలో పాటలు నాకు ఇష్టం.గోదావరి ఇష్టం. అందులో నటించిన సావిత్రి, జమున, నాగేశ్వరరావులు నా కిష్టం' అంది.**

ఇప్పుడు నేను వినే పాటలు మొదట్లో నన్ను ఊపేశాయి. ఇప్పుడు ఎవరు పాడినా అవే పాటలు, అవే బాణీలు. సినిమాల్లో అయినా, ఉద్యమాల్లోనయినా నా హృదయం నుండి, జీవితం నుండి తీసుకున్న పాటలే బాగుంటాయి. ఉద్యమం చేసినంత మాత్రాన మనం మామూలు మనుషుల కంటే అతీతులం కాదు చైతూ. మన అభిరుచుల్ని మనం నాశనం చేసుకోనవసరం లేదు.

గొప్ప కళ ఎక్కడున్నా మనం స్వీకరించాలి. అసలు మనలో ఉన్న సహజత్వాన్ని పోగొట్టుకోవటాన్ని మించిన విషాదం ఏమీ లేదు. నేను ఇప్పుడు నా ఆశయం నుండి పక్కకి వెళ్తానని చెప్పను. కానీ, నాలో ఉన్న చాలా మొరటు భావాల నుండి బయటపడతాను అంది.

అలా ఏదొకటి చెబుతూనే వుంది అమ్మ. ఇద్దరూ మూగమనసులు సినిమా చూసివచ్చారు. 'టీ' తాగుతూ టీవీ ఆన్ చేస్తే ఆ వార్త... ప్రియదర్శిని మట్టూని హత్య చేసిన వ్యక్తికి మరణశిక్ష వేశారు.

పద్మలో ఒక్కసారిగా ఉద్వేగం... కప్పు కింద పెట్టి చైతూ అంటూ ఆనందంగా ఏడ్చేసింది.

'విన్నావా... కింద కోర్టులో నిర్దోషిగా బయటపడ్డాడు. వాడి తండ్రి పోలీసు అధి



కారి. అయినా కోర్టు అతనికి ఉరిశిక్ష వేసింది. ఇది ప్రజల విజయం' అంటూ చైతన్యని ఆనందంగా ముద్దు పెట్టుకొంది. తర్వాత ఎవరికో ఫోన్ చేసింది. ఇది మామూలు విషయం కాదు. రేపు ఈ హంతకుడికి కూడా క్షమాభిక్ష పెట్టవచ్చు అందుకు మేధావులందరూ కలిసి యుద్ధం చేయవచ్చు ఇంకా న్యాయం వుంది. ఇంకా ప్రజలు ఇలాంటి దుర్మార్గాలకు వ్యతిరే కంగా తమ గళం విప్పుతున్నారు. ఈ నమ్మకం చాలు. రేపు మనం ప్రెస్‌మీట్ ఏర్పాటు చేద్దాం. ఉదయమే మిగతా వారందరికీ ఫోన్ చేస్తాను. నువ్వూ చెయ్యి...'

చైతన్య అమ్మనే చూస్తోంది.

★ ★ ★

జీవితం చాలా గొప్పది. చాలా వివాదా స్పదమైంది. అనంతమైనది. ఇలాంటి పదాలు నేను చాలాసార్లు చదివాను. అవన్నీ అనుభవంలోకి వచ్చినప్పుడు చాలా శక్తివంతమైనవిగా కనిపిస్తాయి. లేనప్పుడు మామూలు అక్షరాలనిపిస్తాయి.

అదేమిటో ప్రపంచంలో అపజయాల పాలవుతున్న ఏ వ్యవస్థ అయినా, అంత లోనే ఏదో మూల విజయాలు సాధి స్తుంది. అలాగే తనకు ఎదురులేదనుకొనే దేశాలు ఊహించని విధంగా చావు దెబ్బలు తింటాయి.

వ్యక్తుల జీవితాల్లోనూ అంతే.

ఈ రెండూ లేకపోతే జీవితమే లేదు. అమ్మావాళ్లు ఇప్పుడు ప్రెస్‌మీట్‌లో మాట్లా డుతుంటారు.

ఇప్పుడు గృహహింసను నిరోధించటానికి బిల్లు వచ్చింది. అప్పుడే ఆ చట్టం ప్రభావం చూపించటం మొదలు పెట్టింది.

ఇంకో పోలీసుకి మరణదండన విధిం చారు.

బహుశా నాన్నగారు ఈ పరిణామాల్ని సరిగ్గా తీసుకుంటారేమో... ఆయనకు అభ్యంతరం వుందల్లా ఒక్క మరణశిక్ష విషయంలోనే. ఇప్పుడు తనూ మారతారా అనేది వేచిచూడాల్సిన అంశం...

ఏమైనా నేను వెళ్లి పోతున్నాను.

ఈలోగా హాసిని కుటుంబ సభ్యుల్ని కలుసుకుంటే బాగుండును.

★ ★ ★

తలుపు మీద చప్పుడు.

చైతన్య లేచి వెళ్లింది. తలుపులు తీసింది. ఎదురుగా శంకర్...

ఆమె ముఖంలో షాక్...

అమ్మమ్మ మాటలు గుర్తొచ్చాయ్...

'నాన్న లేరు' అని తలుపులు వేయబో యింది.

శంకర్ కాలు అడ్డంగా పెట్టాడు. 'నేను ఇప్పుడే మాట్లాడాను. గోపాల్ గారు వస్తు న్నారు. నన్ను ఇంటి దగ్గర వెయిట్ చేయ మన్నారు'.

'దయచేసి నాన్నగారు వచ్చాక రండి' సూటిగా అంది చైతన్య.

'మీరు నన్ను గుర్తుపట్టారా? ' సూటిగా అడిగాడు.

చైతన్య మాట్లాడలేక పోయింది.

'ఒకప్పుడు మనందరం ఒకే కాలేజీలో చదివాం. నేను శంకర్‌ని. నన్ను మీరు లోపలకు రానివ్వండి. నేను అంటరానివా డిని కాదు' అన్నాడు.

చైతన్య చేతులు ఒక్కసారిగా శక్తిని కోల్పోయినట్లనిపించింది. అతను హాల్లోకి వచ్చి కూర్చున్నాడు.

'నేను హాసినిని ప్రేమించాను. తను ఒప్పుకుని వుంటే నా జీవితం ఇలా అయ్యేది కాదు. మీరందరూ నన్ను ద్వేషిం చారు. నాకు ఉరిశిక్ష పడాలన్నారు. మీ అమ్మగారు పద్మగారు కదూ...'

చైతన్య తలూపింది.

'వాళ్లందరూ నేను బతకటానికి వీల్లేద న్నారు. ఈ ప్రపంచంలో మీ నాన్న లాంటి వారూ ఉన్నారు. అందుకే నేను చావు నుండి బయటపడ్డాను'.

'నాకు పనుంది శంకర్. నేను బయటకు వెళ్లాలి' అంది చైతన్య.

'అంటే నన్ను బయటకు వెళ్లమంటారు. నాతో మాట్లాడటం మీకు ఇష్టం లేదు. నేనంటే మీకు అసహ్యం. అంతేగా?' అన్నాడు అదోలా.

'అలాంటిదేం లేదు. నేను వచ్చే వారం స్టేట్స్ వెళ్తున్నాను. నాకు చాలా పనులున్నాయి. మీరు కావాలంటే ఇంటిలో వుండండి' అంది చైతన్య.

'చైతన్య గారూ... నేను మీతో కూడా మాట్లాడాలి'.

'ఏం మాట్లాడతారు?'

'మీ అంగీకారం. తెలుసుకు న్నాక గోపాల్‌గారితో మాట్లాడ తాను'.

'నా అంగీకారం ఏమిటి?' అంది చైతన్య. ఆమె మనసులో మెల్లగా అనుమానం ప్రవేశిస్తోంది. ఏదో జరగబో తోంది. నాన్న త్వరగా వస్తే బాగుంటుంది. ఇతన్ని వదిలించు కోవటం ఎలా?

'నాకు కొత్త జీవితం యిచ్చే బాధ్యత మీ కుటుంబానిదే. నేను నిన్ను ప్రేమిస్తు న్నాను చైతన్యా' అన్నాడు మెల్లగా...

కాలం స్తంభించిందా అనిపించింది చైత న్యకి.

'వచ్చే సంవత్సరం జనవరికో, ఆగస్టుకో నేను బయటికి వచ్చేస్తాను. మనం కొత్త జీవితం మొదలుపెడదాం. గోపాల్‌గారికి అభ్యంతరం వుండదు. నువ్వు కూడా ఆయన రక్తం పంచుకు పుట్టావు కదా చైతన్య... పెద్ద మనసు చేసుకో. నిన్ను పువ్వుల్లో పెట్టుకుని పూజించుకుంటాను' అన్నాడు శంకర్.

'శంకర్' బిగ్గరగా అరిచింది.

'ఎందుకలా అరుస్తున్నావు?'

'నేను స్టేట్స్ వెళ్తున్నానని చెప్పాను. నేను చదువుకోవాలి. ఇప్పట్లో పెళ్లి చేసు కునే ఉద్దేశం నాకు లేదు'

'నువ్వు ఎప్పుడు చేసుకుంటానంటే అప్ప టిదాకా నేను వెయిట్ చేస్తాను'.

'అవసరం లేదు. నిన్ను ఇష్టపడిన అమ్మాయిని చూసుకుని నువ్వు పెళ్లి చేసుకో...'

**ఆమె మనసులో మెల్లగా అనుమానం ప్రవేశిస్తోంది. ఏదో జరగబో తోంది. నాన్న త్వరగా వస్తే బాగుంటుంది. ఇతన్ని వదిలించుకోవటం ఎలా?**

'అంటే నీకు ఇష్టం లేదం టావ్' అని కణతలు పట్టుకు న్నాడు. చైతన్య తన గదికి వెళ్ల బోయింది.

'ఆగు' అన్నాడు.

ఆగిపోయింది. అప్పుడు తలె త్తాడు.

కళ్లు ఎర్రగా వున్నాయి. మనిషిలో ఓ షివరింగ్ కనిపి స్తోంది.

'శంకర్ - మనం తర్వాత మాట్లాడుకుందాం...'

'చైతన్యా... తర్వాత మాట్లా డటం అంటూ వుండదు. నాకు ఇష్టం లేనివి రెండు పదాలు. నన్ను ఇష్టపడనన్నా - ప్రేమించనన్నా నేను భరించలేను. హాసిని అలా అవమా నించిందనే నరికేశా... ఇప్పుడు నువ్వా అదేమాట అన్నావ్... రేపు ఇంకో అమ్మాయి అంటుంది. ఏ నేను ప్రేమించ టానికి తగనా...' అతను లేచి నిలబ డ్డాడు...

చైతన్య భయంతో అంతకు మించి శంక ర్‌కి ఇలా దొరికి పోయానే అనే ఆలోచ



బయటెవరికీ తెలియదు. ఆ తర్వాత నువ్వేం చేసినా నాకు పట్టదు. స్టేట్స్ వెళ్లు. ఎవడి నన్నా పెళ్లి చేసుకో.. నీ ఇష్టం...'

'శంకర్' అరిచింది మళ్లీ...

'ఇంకోసారి అరిస్తే నరికేస్తా... నేను ప్రాణాలకు తెగించిన వాడిని' అని వీపులో దాచిన మడ్డుకత్తి తీశాడు.

చైతన్య ముఖంలో రక్తపు చుక్కలేదు.

అప్పుడే బయటనుండి 'గోపాల్ గారూ' అని ఎవరో పిలుస్తున్నారు.

గిరుక్కున వెనక్కి తిరిగి పరిగెత్తబోయింది చైతన్య.

ఒక్క అంగలో దూకి చైతన్య జుట్టు పట్టుకున్నాడు - ఓ చేత్తో. అతని కళ్లలో కసి... అతని రెండో చెయ్యి గాల్లోకి లేచింది... కొద్ది క్షణాల తర్వాత....

హృదయవిదారకమైన ఆర్తనాదం....

బయట ఎవరో అరుస్తున్నారు... చైతన్య పెద్ద శబ్దంతో కిందపడి గిలగిల కొట్టుకుంది.

నతో వణుకుతోంది.

అప్రయత్నంగా వెనక్కి చూసింది.

'మీ నాన్న కోసమా... రాడు. నాకు ఆయన సాయం చేశాడు కాబట్టి నీకో ఛాన్స్ ఇస్తున్నా. నువ్వు మర్యాదగా లొంగిపోతే నా కోరిక తీర్చుకుని వెళ్లిపోతా.

అలా నడుచుకుంటూ వెళ్లాడు శంకర్.

బయటగేటు తెరిచాడు.

అతన్ని చూసి పరుగులు తీస్తున్నారు జనం.

తాపీగా నడుచుకుంటూ వెళ్లిపోయాడు శంకర్.

★ ★ ★

గోపాల్ చూస్తున్నాడు...

రక్తపు మడుగులో చైతన్య... గది గోడలమీద చిందిన రక్తపు బొట్లు... బయట వందలాది మంది జనం...

వారిని అదుపుచేస్తూ పోలీసులు...

ఓ మూలగా...

పద్మ... చైతన్య అమ్మమ్మ, వరూధిని...

ఇంకా మహిళలు... అందరి కళ్లూ తడిసిపోయాయి.

గోడమీద చైతన్య ఫొటో... చిన్నప్పుడు తను రాసిన కవితలు...

పద్మ శిలలా వుంది.

ఆమె



సెల్‌ఫోన్ నిరంతరాయంగా మోగుతోంది.

ఎవరో దాన్ని తీసుకుని ఆఫ్ చేశారు.

గోపాల్ అందరికేసి వెర్రివాడిలా చూశాడు. అతనికి ఏం జరిగిందో ఇంకా అర్థం కావటంలేదు.

మెల్లగా పద్మ దగ్గరికి నడుచుకుంటూ వెళ్ళాడు.

ఆమె సూటిగా భర్తకేసి చూసింది.

అలా నిలువునా కుప్పకూలిపోతూ గుండెలవిసిపోయేలా ఏడ్చాడు.

'పద్మా... మన చైతూ...' అని చైతన్యని చూపిస్తూ ఏడుస్తున్నాడు.

ఆకాశం బద్దలయిందా అనిపిస్తోంది...



ఇంట్లోనూ- బయటా కన్నీటి తుఫాన్లే!

★ ★ ★

చైతన్య అంతిమయాత్రకి వేలాదిమంది జనం వచ్చారు.

చైతన్య మావయ్య అమర్, అత్త శివాని, వాళ్లమ్మాయి మధూలిక వచ్చారు.

దేవిని ఓదార్చటం వరూధిని వల్ల కావటం లేదు.

ఇంతవరకూ పద్మ, గోపాల్‌తో ఒక్క మాట మాట్లాడలేదు.

'చైతన్య హంతకుడ్ని...'

'ఉరి తీయాలి'

'ఉరి తీయాలి'

'ఉరి తీయాలి'

నినాదాల వెల్లువ. శంకర్ వెళ్లి పోలీసుల ముందు లొంగి పోయాడు.

మళ్లీ పత్రికలు, టీవీలు, మహిళలు, మేధావులు ఈ సంఘటన మీద వ్యాసాలు రాస్తున్నారు. ఊరేగింపులు చేస్తున్నారు. ఉపన్యాసాలిస్తు న్నారు. కవిత్వాలు రాస్తు న్నారు.

ఒకటి...

రెండు...

వారం...

నెల...

ఇంకో కొత్త సమస్య. చైతన్య హత్య విషయం పాతబడిపోయింది.

★ ★ ★

చైతన్య గదిలో చిన్నప్పటి నుంచి ఆమె రాసుకున్న డైరీలు...

వాటి మీద చెయ్యివేసి ఆగిపోయాడు గోపాల్.

'ఇప్పుడు నేను లేను. నా డైరీలే ఉన్నాయి. చదువు నాన్నా' అని చైతన్య చెబుతున్నట్లుంది.

గోపాల్ చదువుతున్నాడు.

అందులో ఎన్నో కలలు- ఎన్నో ప్రశ్నలు- ఎంతో సందిగ్ధత...

ఏదో చేయాలనే ఆరాటం... ఏమీ చేయలేని అశక్తత...

ఇంకా ఆయా సందర్భాల్లో మనసు ఎటు పరుగులు తీస్తే అటు...

అలా... అలా... రక్తపు మడుగులో అంతమైన జీవితం...

**మళ్లీ పత్రికలు, టీవీలు, మహిళలు, మేధావులు ఈ సంఘటన మీద వ్యాసాలు రాస్తున్నారు. ఊరేగింపులు చేస్తున్నారు. ఉపన్యాసాలిస్తు న్నారు. కవిత్వాలు రాస్తున్నారు.**

'నీకు ఏ రంగంటే ఇష్టం చైతూ' ఫొటోముందు నిలబడి అడుగుతున్నాడు.

'ఎరుపు నాన్నా'

ఎరుపంటే కొందరికి భయం చైతూ... చైతూ నువ్వు ఎరుపు ఇష్టమని చెప్పినప్పుడు పొంగి పోయాను తల్లీ...

నీ జీవితం ఇలా రక్తసిక్తం అవుతుందనుకోలేదు.

నీ ప్రశ్నలింకా నన్ను వేధిస్తు న్నాయి.

తల్లీ.. నీలాంటి ఎందరెం దరో ఇలా నేల రాలిన మందా రాలయ్యారు.

ఇప్పుడు కూడా మేం కళ్లు తెరవ కపోతే, మేం క్షమార్హులం కాదు.

నన్ను క్షమించు. నన్ను క్షమించు తల్లీ.

గోపాల్ ఏడుస్తున్నాడు... ఒంటరిగా... తన గదిలో... మదిలో...

ఆ ఇంట్లో...

తలుపుల మీద చప్పుడు...

మెల్లమెల్లగా తలుపు తీశాడు.

ఎదురుగా సుధీర్!

అతను గోపాల్‌నే చూస్తున్నాడు.

వారిద్దరి మధ్య నిశ్శబ్దం.

★ ★ ★

గోపాల్ ప్రజాహక్కుల సంఘానికి రాజీ

నామా ఇచ్చాడు.

అతను ఇప్పుడు సాధారణ సభ్యుడు కూడా కాదు.

అతని లేఖలో ఇలా ఉంది.

'చైతన్య నా కూతురు. బతికి ఉన్నప్పుడు ఓ ప్రశ్న అడిగింది. మనిషి ప్రాణానికి విలువ లేదా అని. విలువ వుందని చెప్పటానికి నేను శంకర్‌లాంటి వాళ్ల గురించి పని చేశాను. నా కూతురుని శంకర్ చంపేశాడని నేను రాజీనామా చేయటం లేదు. మనిషి ప్రాణాలకు నేను విలువ ఇవ్వటంలేదని తెలుసుకున్నాక రాజీనామా ఇస్తున్నాను'.

'తనకున్న ఒక్క కూతుర్ని పోగొట్టుకోవటం... భార్యతో సంబంధాలు లేకపోవటంతో గోపాల్‌కి మతిస్థిమితం తప్పింది' అనుకున్నారు కొంతమంది

పద్మ 'శంకర్'కి ఉరిశిక్ష వేయాలని పోరాటం చేస్తూనే ఉంది. అందుకోసం మద్దతు కూడగట్టటానికి దేశమంతా తిరుగుతోంది.

★ ★ ★

ఆ రోజు...

శంకర్‌ని కోర్టుకు తీసుకువస్తున్నారు. పద్మ- ఇంకొందరు మహిళలు అప్పుడే అక్కడికి వచ్చారు.

ఓ పక్కన సుధీర్ వున్నాడు. అతని కళ్లలో 'కసి' కనిపిస్తోంది.

పోలీస్ వ్యాన్ వచ్చి ఆగింది. 'శంకర్'ని కిందకు దించారు.

అతనిలో అదే నిర్లక్ష్యం....

కోర్టు మెట్లు ఎక్కుతున్నారు.

అప్పుడు జరిగిందా సంఘటన...

ఎటునుండి వచ్చాడో తెలియదు. సెంట్రీలను నెట్టేశాడు..

అతని చేతిలో ఓ ఖడ్గం మెరిసింది.

ప్రచండ వేగంతో గాలిని చీల్చుకుంటూ...

ఓ ఆర్తనాదం..

దూరంగా ఎగిరిపడింది శంకర్ తల.

అతని మొండెం గిలగిల తన్నుకుంటోంది.

కత్తిని గాల్లోకి విసిరేశాడు గోపాల్.

చేతులు ఎత్తి నిలబడిన అతన్ని చుట్టుముట్టారు పోలీసులు.

కెమెరాలు క్లిక్ మంటున్నాయి.

లైట్స్ వెలుగుతున్నాయి. కెమెరాలు జూమ్ అవుతున్నాయి.

'నేను శంకర్‌ని చంపేశాను'.

'ఈ నేరాన్ని నేను అంగీకరిస్తున్నాను'.

'నాకు మరణశిక్ష పడుతుంది'.

'చనిపోయేంత వరకూ నన్ను ఉరి తీయమని తీర్పు వస్తుంది'.

'అయినా నేను బయటికి వస్తాను'.

'నన్ను కాపాడటానికి సంస్థలున్నాయి. మేధావులున్నారు'.

ఒక్కసారిగా నిశ్శబ్దం.

ఉరిశిక్షలు ఉండాలా? వద్దా?

హింస సరైందా? కాదా?

చర్చించండి.

ఇప్పుడు నా భార్య పద్మ నన్ను ఉరి తీయమంటుందా?

శంకర్‌కి శిక్ష పడిందని సంతోష పడుతుందా?

కెమెరాలు నిశ్శబ్దంగా పనిచేస్తున్నాయి.

కోట్లాది మంది టీవీల ముందు కూర్చుని చూస్తున్నారు.

మీరు నన్నేం అడుగుతారో తెలుసు.

నేనే నాకు శిక్ష విధించుకోవాల్సి వస్తే నా తీర్పు ఏమిటి?

గోపాల్ ఓ క్షణం అందరినీ చూశాడు.

'నన్ను ఉరితీయండి'.

'హేంగ్ మి క్విక్'.

'ఓ మనిషి ప్రాణాన్ని తీసిన నాకు జీవించే హక్కులేదు'

అన్నాడు గోపాల్.

Stop

వ్యంగ్య శీర్షిక




# నిజాలు - నిమజ్జనాలు

వారణాసి రామకృష్ణ

నిజాలనేవి ఏమిటోగానీ వాటి తస్సాదియ్యా ఎప్పుడూ తొందరగా వొహ పట్టాన పైకి తేలవు! అనంతమైన అబద్ధాలు ఊట ఊరినట్టు ఉబికి ఉబికి వస్తూంటాయిగానీ నిజం మాత్రం ఎప్పుడూ నిలకడగా 'నిమజ్జన'మయ్యాకే తేలుతుంది. మా కాలనీలో ఈ మజ్జిన ఎవరింటికెళ్ళి ఫలానా ఆయన ఉన్నారాని అడగటం ఆలస్యం- ఆయన వూరెళ్ళారనో, ఆఫీసు నుంచి రాలేదనో చప్పున సమాధానం రావటం, టక్కున తలుపులు మూసుకోవటం జరుగుతోంది. ఇంతకీ రీజనేంటంటే- వినాయకచవితి చందాలు! ఎలక్షన్లకి ముందు పార్టీల చందాలు ఇచ్చుకోలేక వణికిపోయినట్టు జనం ఇప్పుడు చవితి చందాల ధాటికి కకావికలైపోతుంటారు! పైగా ఈ నెల విశేషమేమిటోగానీ ఎప్పుడూ నిజం తప్ప, అబద్ధం ఆడని హరిశ్చంద్రులంతా అబద్ధాలాడుతుంటారు. మా కాలనీ హరిశ్చంద్రరావు గేటు చప్పుడవగానే ఉలిక్కిపడి ఇంట్లో లేనని చెప్పమని పెళ్ళానికి చెప్పేసి హడావిడిగా బాత్రూమ్‌లోకి దూరి గడి పెట్టుకున్నాడు. వచ్చిన పెద్దమనిషి వినాయకరావు లోనికడుగు పెట్టగానే హరిశ్చంద్రరావు సుపుత్రుడు గట్టిగా "మా నాన్న ఇంట్లో లేనని చెప్పమన్నారంకుల్" అంటూ అరిచాడు. పాపం వినాయకరావుకి నవ్వాలో, ఏడవాలో అర్థంకాక అవాక్కయి తేరుకుని- "బాబూ! మీ నాన్న బాత్రూంలోంచి రాగానే నేనొచ్చి ఈ రేషన్‌కార్డు ఇచ్చానని చెప్పు!" అంటూ బరువుగా బైటికొచ్చేశాడట!

కొన్నికొన్ని మాయదారి కేసులుంటాయి. ఇలాంటి కేసుల్లో ఉన్నట్టుండి మూసుకుపోయిన దారి దానికదే తెరుచుకుని నిజాలు వాటిద్వారా ఎక్కడ ఎలా నిమజ్జనమై తేలిపోతాయో మూడో కంటికి కూడా అంత తేలిగ్గా అర్థమయి చావదు! అప్పట్లో మాయావతి తాజ్ కారిడార్ కేసులో ఇరుక్కుందన్నారు! పాపం పీక్కోలేక, బయటకు రాలేక మాయావతికి మతిపోతోందన్నారు. ఈలోగా రాష్ట్రపతి ఎన్నికలొచ్చాయి. మాయావతి హస్తం అభయహస్తంలా కనిపించింది. అంతే! తాజ్‌కారిడార్ కేసులోని గాలంతా 'వుఫ్' మని రాష్ట్రపతి భవన్ కారిడార్‌లోంచి ఎగిరిపోయింది. "నువ్వేం మాయచేశావోగానీ కేసు కాస్తా తుస్సుమంది పోనీ" - అంటూ మనం హాయిగా 'హొయ్యారే హొయ్యారే హొయ్!' అని పాట పాడుకోవచ్చు. నిజమే మరి- మాయావతి మంచి 'ప్రతిభ' గల ప్రజ్ఞావతి!!

ఒక్కోసారి ఘనమైన నిజాల గనుల కేసులుంటాయి. వీటిల్లోంచి ఖనిజాలు బైటపడ్డట్టు తవ్వేకొద్దీ నిజాలు టన్నులు

టన్నులు బైటికొస్తుంటాయి. ఘనమైన ఈ గనుల కేసుల్లో మహాఘనులు కొందరు వెనక నిలబడి నిజాలను ఎప్పటికప్పుడు నిమజ్జనం చేస్తూంటారు. జనాల ఇయ ర్సులో కాలీఫ్లవర్సు పెట్టి తాము త్యాగధ నులన్నట్టు 'అరికతలు' వినిపిస్తారు. 'బుర్ర కతలు' చెపుతుంటారు. ఆఖరికి అక్రమ గనుల తవ్వక యవ్వారాల్లో గుళ్ళకి గుళ్ళే మాయమైపోతుంటే దేముడి పాలనలో ఏమీ చెయ్యలేక పాపం దేవుడే నిస్సహా యంగా నిజమెప్పుడు బైటకొస్తుందాని గుంతలకేసి చూస్తూంటాడు.

వంద టన్నుల మన్నులోంచి మకిలి తీసి శుభ్రం చేస్తేగానీ ఒక్క ఔన్సు గోల్డు తయారవనట్టు, వందలకి వందల అబద్ధాలు అగాధ చరిత్రలోంచి ఉబికితే గానీ ఒక్క నిండు నిజం వెలికి రాదు. అందాకా జనం నిమజ్జ నమైపోకుండా నిజంకోసం నిల బడే నిగ్రహం సాధించాలి!!

ఈ నిజాలేంటో గానీ వీటి సిగతరగ కొన్ని కేసుల తీరుతె న్నులు ఆకర్షణీయంగా మాంచి మాస్ మసాలా వాసనతో ఘుమాయిస్తుంటాయి. మచ్చుకి మాజీ నటి మోనికా బేడీకోసం చూస్తే తెగ ఉత్సాహం పొంగు తుంది. ఆవిడ దొంగ పాస్‌పో ర్టులు పొందిందన్నారు. క్రిమి నల్ అబూసలేంతో బోలెడన్ని నేరాల్లో పాలుపంచుకుందన్నారు. ఇద్దరూ డ్యూ యెట్ పాడుతూ పోర్చుగల్‌లో ఉన్నారని తెలిసినప్పుడు అప్పటి ప్రధాని వాజ్ పేయిగారు పోర్చుగల్ అధ్యక్షుడ్ని ఏదో శిఖరాగ్ర సమావేశంలో కలుస్తారని, అప్పు డాయన వీళ్ళిద్దర్నీ మన దేశ న్యాయస్థానా లకు అప్పగించాల్సిందిగా కోరుతారనీ అన్నారు. ఐతే అప్పుడు వాజ్‌పేయిగారు 'అప్పగింతలు' ఊసెత్తక సమావేశంలో 'పులకింతలు' అనే కవిత చదివేరు సరే- అబూ మోనికాలు దొరికితే ఎంత, దొరక్క పోతే ఎంత.. కవిత్వం మాత్రం అదిరింద నుకున్నాం! ఇంతలో హఠాత్తుగా మోనికా బేడీకి బేడీలేసి పట్టుకొచ్చారు. అహా న్యాయం! ఓహో చట్టం! జనం తెగ మురి సిముక్కలైపోయారు! ఇంతా చేస్తే మోనికా బేడీని కొన్నాళ్ళు ముంబాయిలో, కొన్నాళ్ళు హైద్రాబాద్‌లో, కొన్నాళ్ళు భోపాల్‌లో- ఇలా పర్యాటకుల్ని తిప్పినట్టు తిప్పారు. జైలు ఏసీ గదిలో ఆవిడ సౌకర్యాల లిస్టు బైట మన జీవితాలతో పోల్చుకుంటే ఛీఛీ!



కుక్క బ్రతుకు బ్రతుకుతున్నాం, అనిపించే లెవిల్‌లో ఉండేది! 32 సూట్కేసులు, వాటి నిండా ఖరీదయిన బట్టలు. అలంకరణ సామగ్రి! ఇక రోజూ ఆవిడకి ఐదు నక్ష త్రాల హోటల్ నుంచి విందు భోజనం. పొద్దున్నే లేవగానే ఆరు ఆంగ్ల దినపత్రి కలు, మూడు హిందీ, రెండు ఉర్దూ పత్రి కలు సరఫరా! తోడుగా కేబిల్ టీవీ కనె

క్షనూ! ఇవన్నీ సరే- కేసులో కతేంటి అంటే - పాపం ఆవిడ చాలా మంచిదట! ఏ నేరమూ చెయ్యలేదట! అలా చేసిందని చెప్పే, చూపే సాక్ష్యం, ఆధారం ఒక్కటంటే ఒక్కటీ లేనేలేదట! ఆఖరికి మొన్నోరోజున అరవిరిసిన చిరునవ్వు మోముమీద చిందిస్తూ మోనికాబేడీ విమానమెక్కిపోతూంటే హుస్సేన్‌సాగర్‌లో బుద్ధుడిలా తెల్లముఖం వేసుకు చూశాం.

హుస్సేన్‌సాగరంటే గుర్తొచ్చింది. నిజానికి నిజాంసాగర్‌లా దీని పేరు నిజాల సాగర్ అని మారిస్తే బావుండును. దీని కడుపులో బోలెడన్ని నిజాలు దాచుకునుంది. బుద్ధుడి సాక్షిగా ఆ నిజాలన్నీ వెలికివస్తే పాలిటిక్సులో నిమజ్జనమైపోయిన విలువలు, వైద్యరంగంలో మానవత్వం, విద్యారంగంలో ఆదర్శం, వ్యాపారంలో నీతి, సినిమాల్లో సృజనాత్మకత, మనుషుల్లో నిబద్ధత తిరిగీ సజీవంగా కనిపిస్తాయి. అంతేగాక అప్పుడు వీధి వీధికి వెలిసిన వినాయకుడి విగ్రహంలో చలనం పుడుతుంది. భక్తి చాటున సాగే విడ్డూరవైనాల్ని ఎండగడుతుంది. మైకులు పెట్టి జనం చెవులు ఛిద్రం చెయ్యటమెందుకని ప్రశ్నిస్తుంది. దొంగ కరెంటు లాగి ఇంతింత జాతీయ సంపద విద్యుత్‌ని వృథా చెయ్యటం కరెక్టానని ఆలోచించమంటుంది. ఊరూ వాడా ఏకంచేసి ఎక్కడికక్కడ ట్రాఫిక్ ఛిన్నాభిన్నం చేసి జనజీవితాల్ని అతలాకుతలం చెయ్యటమేంటని నిలదీస్తుంది. ఓ పక్క జలాశయాల శుద్ధి కోసం వందల కోట్లు విదేశాల్నించి అప్పు అడుక్కోవటం ఎందుకు, మరోవైపు నిమజ్జనం పేరిట కలుషితం చెయ్యటమెందుకు, బుద్ధి లేదాని మననడుగుతుంది!

గల్లీగల్లీలో కొలువైన వినాయకుడు. అసలైన తన భక్తజన హృదయాల్లోంచి ఈ సంగతులన్నీ అడగాలని అనుకుంటున్నా... మజ్జిలో సిల్లీ నాయకులున్నారే? తేడా అక్కడే వస్తోంది మరి! ఐనా నిజాలు నిమజ్జనమైపోతున్నా ముందే మనవి చేసినట్టు తస్సాగొయ్యా.. ఇవే భలే తమాసా చూపిస్తాయి. పరిస్థితులు శ్రుతిమించితే, గతి తప్పితే పైకి లేస్తాయి. ప్రక్కదారి పట్టిన జాతిని, ప్రగతిని పట్టాలకెక్కిస్తాయి! వెర్రితలలేస్తున్న నైజాల బోడితలమీద జెల్లకొట్టి డొల్లతనాన్ని బైటపెడతాయి. దాంతో అబద్ధాలు అదేపనిగా కట్టిన సైకత దిబ్బలు కొట్టుకుపోతాయి. అప్పుడు నిజాలే 'ఉక్కు'తో కంచుకోటలు నిర్మిస్తాయి. దేనికైనా 'టైము' రావాలంతే!! ©

## చతుర సమీక్ష | సెప్టెంబరు '07 నవల 'ఉరి'

సమీక్షకుని/సమీక్షకురాలి పేరు: ______________________

చిరునామా: ______________________

______________________

______________________

(సెప్టెంబరు 25వ తేదీలోపు సమీక్షలు మాకు అందాలి)

కథవెనుక కథ

# ఓ దురదృష్టశాలి భాగ్యం

# స్పృహ


విహారి

మంచి రచయితగా పాఠకులకు సుపరిచితులు విహారి. వాసిలోనే కాక రాసిలోనూ దిట్టనిపించుకున్న ఆయన కలం నుంచి దాదాపు రెండువందల కథలు, నాలుగు నవలలు వెలువడ్డాయి. మూడు కవితా సంకలనాలు వచ్చాయి. నవలల్లో 'సెలయేటి గలగల', 'పావులూ గళ్లూ'తదితరాలు మంచి ఆదరణ పొందాయి. సుమారు ఇరవై ఏడేళ్లక్రితం తను రాసిన 'స్పృహ' కథవెనుక కథపై ఆయన ఏమంటున్నారో చూద్దామా?

---

'స్పృహ' కథ 1980 జ్యోతి దీపావళి ప్రత్యేక సంచికలో ప్రచురితమైంది.

విశ్వం కథానాయకుడు. కథనం ఉత్తమ పురుషలో సాగింది.

అన్ని దురదృష్టాలూ తననే వెంటాడుతున్నాయనుకొనే ఒక చిరుద్యోగి కథ యిది. అతని జీవితంలో జరిగిన అన్ని సంఘటనలూ అతని అభిప్రాయాన్ని - అంచెలంచెలుగా- బలపరచినవే. అయితే అన్ని 'తరుగు'ల్లోనూ ఆవగింజంత 'మెరుగు' తగుల్తూ ఉండటం- ఒక విలక్షణత.

"అసలు నువ్వు పుట్టటమే అలా పుట్టేవు. ఏడో నెలన్నా రాకుండానే ఏదో కొంప మునిగినట్టు నా ప్రాణంతీసి ఈ లోకంలోకి తన్నుకొచ్చావు" అని తల్లి కూడా శపిస్తున్నట్టే వుంటుందతనికి. అక్కణ్ణుంచీ అతనికి అన్నిటా తరుగే!

"అసలు నీ తరుగంతా నీ కుడికాల్లోనే వుంది. కుడి ఎడమలకి అరంగుళం వ్యత్యాసం. అది చాలు కురచదనం కనిపించటానికి" అంటారు మిత్రులు. ఎస్సెల్సీలో ఒక మార్కులో ఫస్ట్ పోయింది. బోర్డు మీదికి తన పేరెక్కలేదు. సినిమా టిక్కెట్‌కి క్యూలో నిలబడితే ఎప్పుడూ తన దగ్గరికి వచ్చేసరికీ బుకింగ్ క్లోజవుతుంది. ఆఫీసర్ పరీక్ష రాసి సెలక్టయినా, ఆ లిస్ట్ తన దాకా వచ్చేసరికీ స్క్రాప్ అవుతుంది. కడకు టైపిస్టవుతాడు. ఇరవై ఏళ్లు తనని పెంచిన మామయ్యా మూడో కూతురు సావిత్రంటే యిష్టం తనకు. ఆమెనో డాక్టర్‌కిచ్చేసి, నాలుగోపిల్ల రమని- చేసుకోమంటాడు ఆయన. రమ తన భార్య అయింది. ఆమె హిందీ ప్రవీణ పాసయితే, టీచర్ ఉద్యోగ ప్రయత్నంలో ఆమె పేరు పైవరకూ అందరికీ యిచ్చి, ఇక వేకెన్సీలు లేవన్నారు. 'అతను ఎక్కవలసిన రైలు ఎప్పుడూ ఒక జీవితకాలం లేటు'! అరడుగు ముందుకు జరిపి, ఆరడుగులు వెనక్కి లాగుతూనే వుంది జీవితం.

ఈ వానపాము విశాఖలో దేకటం ప్రారంభించింది. అదీ కథా వర్తమానం. అక్కడ రెడ్డిగారితో పరిచయం. ఆయన ఆఫీస్‌లో సీనియర్. వయస్సూ ఎక్కువే. ఆయనంటే ఇతనికి చాలా గౌరవభావం.

ఆరోజు- పదిహేనేళ్ల సర్వీస్‌లో ఆరోసారి ప్రమోషన్ తప్పిపోయింది ఇతనికి. అతని మానసిక స్థితి, ఆత్మన్యూనతా భావం, లోలోపలి దుఃఖం- అన్నీ గమనించారు రెడ్డిగారు. హాఫ్‌డే సెలవు పెట్టించి-

ముందు 'గ్రేట్ ఎస్కేప్' మ్యాటినీకీ, అక్కణ్ణుంచీ ఆయన యింటికీ తీసుకువెళ్లాడు.

రెడ్డిగారు తన కథ చెప్తారు. సూక్ష్మంగా ఇది అది: వెండి చెంచాని నోట్లో పెట్టుకుని పుట్టిన అదృష్టవంతుడు ఆయన. తండ్రిది కలప వ్యాపారం. బాగా కలిగిన కుటుంబం. కానీ సినిమాలో లాగా అన్నీ హఠాత్తుగా మునిగిపోయాయి. పూటలు గడుపుకొని ఎస్సెల్సీ అయిందనిపించాడు ఆ రోజుల్లో. మద్రాస్ వెళ్లిపోయాడు. పదహారు రూపాయల జీతంతో జీవితాన్ని ప్రారంభించాడు. నాలుగంతస్తుల భవనంలో, మొదటి అంతస్తులో ఆఫీసు. ఒక రోజు మధ్యాహ్నం ఒంటిగంటకు ఆ భవనం పేకమేడలా కూలిపోయింది. వందల మంది చనిపోయారు. ఎముకలు విరిగి బతికివున్న శవంలా మిగిలాడు, ఈయనొక్కడూ. ఎనభైనాలుగు రోజులు హాస్పిటల్‌లో ఉన్నాడు. అంతా కంపెనీవాళ్లే చూసుకున్నారు. సరి.

భార్యని పరిచయం చేస్తానని లోపలికి తీసుకువెళ్లాడు. మంచంలో ఉంది. ఐదేళ్ల నుంచీ పక్షవాతం. కాళ్లూ, చేతులూ ఆడవు. రెడ్డిగారికొక కొడుకు మెంటల్లీ రిటార్టెడ్. ఆయనకొక పెద్దకూతురూ వుంది. పెళ్లయింది. ఆమెని పుట్టింటికి రానీయరు, అత్తమామలూ భర్తా. ఆమెకిద్దరు పిల్లలు. అన్నీ చెప్పి, 'మాయావిడ దూరపు చుట్టం ఒక ముసలావిడ మాకు వండి పెట్టుంది' అంటాడు. 'ఈ యింట్లో ఉన్న ఒకే వొక్క మనిషి ఆవిడే. మిగిలినవన్నీ జీవచ్ఛవాలు!' ఇదీ రెడ్డిగారి కథ.




పెళ్లాం పిల్లల్ని రిసీవ్ చేసుకోవడానికి స్టేషన్‌కి వెళ్లాడు. వాళ్లు రావలసిన రైలుకి యాక్సిడెంట్. చాలామందికి గాయాలయినై. కొందరు మరణించారు. ఇతనికి ఆందోళన. భయం. రెడ్డిగారు ధైర్యం చెప్తున్నారు. ఫోన్లు లేవు. ఇంటికొచ్చేసరికి టెలిగ్రాం. 'ఈ రోజు రైలు తప్పిపోయింది. రేపు వస్తున్నాం' అని భార్య యిచ్చింది. 'తరుగులో మెరుగు- అంటే యిదే' అని వేరే సందర్భంలో మిత్రుడు సత్యం అన్న మాటలు గుర్తుకొస్తాయతనికి.

'జీవితం నీకు ఎప్పుడు ఏది యిస్తుందో దాన్ని స్వీకరించు. అది రాలేదని బాధపడీ, ఇది కావాలని ఆరాటపడీ మనంగా సాధించగలిగేది చాలా స్వల్పం. కాదంటావా? '- రెడ్డిగారు ప్రశ్నిస్తున్నారు.

ఇదీ 'స్పృహ' కథ!

ఇప్పుడు కథ వెనుక కథ చెప్తాను. నేను బందర్లో ఉద్యోగం చేసేటప్పుడు- దత్తు అని మంచి మిత్రుడు వుండేవాడు.

చాలా సరదా మనిషి. చాలా జోవియల్. ఇతనిలా ఎలా వుంటున్నాడో అని ఆశ్చర్య పోతూ వుండేవాణ్ణి. అతని జీవితాన్ని ప్రోబ్‌చేస్తే తెలిసింది- ఈ కథలో- విశ్వం, అదే కథానాయకుడికి జరిగిన సంభవా లన్నీ- దత్తుకి జరిగిన్నై.

ఆ తర్వాత అతనట్లా జోవియల్‌గా మారిపోయాడు. అతను ఈ కథలో సగం కథానాయకుడు. రెండవసగం- నేనే. ఆర్థి కంగా అత్యంత దయనీయమైన బలహీన వర్గానికి చెందినవాణ్ణి. పదిహేను పదహా రేళ్లొచ్చేసరికీ, అరవైయేళ్ల కష్టాలు అనుభ వించినవాణ్ణి. సోకాల్డ్- బిలో పావర్టీ లైన్ కంటే ఇంకా అధమాధమస్థితిని రక్తంలో అణువణువులో జీర్ణించుకున్నవాణ్ణి. అందు కనే ఇప్పుడు రాజకీయంగా వాడబడుతున్న ఆ రెండు పదాలూ అంటే అసహ్యం, అంటున్నవాళ్లంటే రోత. ఆ అనే వాళ్లల్లో నూటికి తొంభై తొమ్మిదిన్నరమందికి ఆ బాధ తెలియదు. ఇదీ ఆవేదన! నా అను భవాల్ని, కొన్నిటిని- రచయితగా 'మాడ రేట్' చేసుకుని వాడుకున్నాను. అందు కనే- స్పృహ కథలో 'తరుగు' సంఘటన లన్నీ కథాత్మక వాస్తవాలు!

ఇక రెండవ పాత్ర రెడ్డిగారు. శర్మగారని నాకు గురుతుల్యులొకాయన ఉండేవారు. ఆయన కథే అది! మద్రాస్ పృథ్వీ బిల్డింగ్ అనుకుంటా. కూలిపోతే అందులో చిక్కు కుని బతికినవాడు. ఇతర పరిస్థితులూ దాదాపుగా ఆయనవే. కథానుసరణం జరి గింది.

'స్పృహ' కథమీద స్పందన ఉద్ధృతం గానే వచ్చింది. కథలో- నేను విడమర్చి చెప్పిన తాత్విక చింతనని కొందరు పెద్ద విమర్శకులు- 'మధ్యతరగతి మనస్తత్వం, పలాయనవాదం'- అన్నారు. మధురాం తకం రాజారాం వంటి కొందరు పెద్ద రచ యితలు- వస్తువు దృష్ట్యా, శిల్పం దృష్ట్యా చాలా మంచి కథగా అభినందించారు. నిజానికి, "స్పృహ" పేరుతో వచ్చిన కథా సంపుటి ఆవిష్కరణకి రాజారాంగారే వచ్చి అభినందించారు.

చలం అంటాడు, రాసేటప్పుడు నాలో ఒక అగ్నికీల రగుల్తూ ఉంటుంది అని. కొన్ని కథలు వ్రాసేటప్పుడు- బహుశా అందరు కథకులకీ గుండెలో ఓ రసాయన క్రియ జరుగుతూ ఉంటుందనుకుంటాను. అందులోనూ కథలో ఆత్మీయతా ముద్ర వుంటే- యింక చెప్పేదేం ఉంది. ఆ లయ, ఊపు, తూగు, ఉద్వేగం, ఉద్విగ్నత- అన్నీ అనుభవైక వేద్యం! 'స్పృహ' రాసేటప్పుడు నా పరిస్థితీ అంతే.

ఈ కథలో జీవన తాత్త్వికత ఉంది. అ ది తప్పా ఒప్పా అనే చర్చ- అనేకానేక వైయక్తిక అభిప్రాయాలమీదా, సంస్కారం మీద, నిబద్ధతమీద- ఆధారపడి ఉంటుంది. ఒక ఆలోచనీయమైన దృక్పథం ఉంది. ఈ భూమిలో నుంచి వచ్చిన ఒక భావసూత్రం ఉంది. ఒంట్లో వేడి ఉన్నప్పుడు వాదాలూ, నాదాలూ, ఇజాలూ, భేషజాలూ- చాలా చాలా ముప్పి రిగొని ఒక వూపు వూపుతాయి మనిషిని. కానీ "లోకస్పర్శ"నీ, "జీవనాడి"నీ తెలుసు కుంటున్నకొద్దీ- స్పృహలోని తత్వంపట్ల సహానుభూతికి దగ్గరవుతూ ఉంటాడు మనిషి. అనేక సందర్భాల్లో అనేకమంది విషయంలో ఋజువైన అంశం ఇది. బొల్లి ముంత శివరామకృష్ణగారితో మాట్లాడు తుంటే ప్రస్తావించారు. వీటిని ఎక్కడన్నా రాశారేమో కూడా. "37 సినిమాలకు రాశాను. 'శ్రీ వెంకటేశా దయాసాగరా' పాటతోసహా. చాలామంది అడిగారు కమ్యూనిస్ట్ కదా ఏమిటిది? అని. సిద్ధాం తాలు నేర్పే దానికన్నా జీవితం నేర్పేది ఎక్కువ. మన పిలాసఫీకి మించింది ఏదో ఉందని పరిగెత్తటం, చతికిలబడటం,

( మిగతా 129వ పేజీలో )

# జులై చతుర నవల 'పొగడపూల దోసిలి' పై పాఠకుల సమీక్షలు

## అన్నీ రసాలు

**రూ. 100/- పొందిన సమీక్ష**

ప్రేమ, ఆప్యాయతలు, ఈర్ష్యాద్వేషాలు సమపాళ్లలో సమ్మిళితమైన మానవ సంబంధాలకు దర్పణం ఈ నవల. కుటుంబపరమైన ఆప్యాయతానురాగాలు, సామాజిక బాధ్యతలు పాఠకుల్ని పరుగులు తీయించాయి. సహనానికి మారు పేరైన స్త్రీ మూర్తికి ఉండాల్సిన లక్షణాలన్నీ కథానాయిక స్రవంతిలో ఉన్నాయి. ఆమె అందం, హుందాతనానికి తగినంత ఓర్పు, సహనాన్ని కలగలిపి పాత్రను సజీవంగా నిలపడంలో రచయిత్రి కృతకృత్యులయ్యారు.




పురుషాధిక్య సమాజంలో అసమర్థుడైన భర్త పెట్టే హింసలు భరిస్తూ గుట్టుగా సంసారాన్ని నెట్టుకొస్తున్న స్రవంతి పడ్డ కష్టాలు అన్నీ ఇన్నీ కావు. పాలవాడి దగ్గర నుంచీ ప్రతివాడితోనూ అక్రమసంబంధాలను అంటగడుతూ, అనుక్షణం అనుమానపు మాటలతో మానసిక వేధింపులకు గురిచేసే భర్తను వదిలించుకొని జీవితంలో స్రవంతి నిలదొక్కుకున్న తీరు బాగుంది. కోట్లాది రూపాయల ఆస్తిని పక్కన బెట్టి తల్లిలేని పిల్లలకు తానే తల్లిగా మారి, వారి భవిష్యత్తును ఉజ్వలంగా మారుస్తుంది స్రవంతి.

స్నేహానికున్న విలువకు ప్రాణం పోసిందీ నవల. ప్రాణస్నేహితుడు ఇష్టపడ్డ 'ఖ్యాతి'తోనే ఆతని పెళ్లి జరిగేలా చొరవనూ, ధైర్యాన్నీ కనబరుస్తాడు కృష్ణ. అతను తన తెలివితేటలతో మిత్రుడి తల్లిదండ్రుల్ని ఒప్పించి వినయ్, ఖ్యాతిల వివాహం జరిపిస్తాడు. రోడ్డు ప్రమాదంలో అసువులు బాసిన స్నేహితురాలు లక్ష్మికిచ్చిన మాటకు కట్టుబడి ఆమె కొడుకు తరుణ్ పోషణ బాధ్యతల్ని తీసుకుంటుంది స్రవంతి. ఈ రెండు విషయాల ద్వారా స్నేహానికిచ్చిన ప్రాధాన్యత విశదమవుతుంది.

తన అస్తిత్వానికి భంగం కలుగుతోన్న తరుణంలో తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం, ఆత్మగౌరవాన్ని నిలుపుకోవడం కోసం పరితపించిన స్రవంతి, చివరకు తనకిష్టమైన చైతన్యతో జీవితాన్ని పంచుకోవడంలోనూ అదే స్వేచ్ఛను కనబరుస్తుంది. సరళమైన వాక్యాలతో కథాంశాన్ని స్పష్టతతో రచయిత్రి చెప్పగలిగారు. రచనలో వాస్తవికత, పాత్రోచితమైన సంభాషణలు ఉన్నాయి. మహిళల కట్టు, బొట్టు సంప్రదాయాలు, గృహాలంకరణపై రచయిత్రికి మంచి పట్టుంది.

**– గంగిశెట్టి వేణుగోపాల్**, సత్తెనపల్లి.

## పూలవాన

**రూ. 75/- పొందిన సమీక్ష**

**దో**సిలినిండా పొగడపూల వాన కురిసిన అనుభూతిని మిగిల్చిన చక్కటి నవల ఇది. ప్రతి పాత్రలోనూ సజీవత్వం తొంగిచూస్తుంది. అసమర్థుడైన భర్తనుండి విడిపోయి తన జీవితానికో పరమార్థాన్ని సృష్టించుకొని అనాథ పిల్లల ప్రేమతో తడిసిపోయిన స్రవంతి నిజంగా అనురాగ స్రవంతే! సెక్స్ మాత్రమే జీవితం కాదని భర్తతో స్నేహితురాలిగా మిగిలిపోవాలని అనుకొన్నా వీలుకాని పరిస్థితి. తరుణ్ బాధ్యత వహించాల్సి రావడం చక్కటి మలుపు. తన పాత్ర ముగిసేముందు బాధ్యతలను మరొకరికి అప్పగించడం వసంత ఔన్నత్యానికి ప్రతీక. ఐతే ఆమె హాస్యానికి అన్న మాటలు కృష్ణ చైతన్య డ్రీమ్ గర్ల్‌కి అతన్ని అప్పచెప్తానంటే అవి నిజమైపోవడం రచయిత్రి చిత్రీకరణలో గొప్పదనం చేకూర్చుకొన్నాయి.

బిజినెస్ మాగ్నెట్ నందిని, కమలమ్మ, శివరాం పాత్రల చిత్రీకరణ సహజంగా ఉంది. సాయంచేసే చేతులకు దైవమే చేయూతనిస్తాడనే మాట నిజమయ్యేలా వుంది. ప్రారంభం నుంచి చివరిదాకా వదలనీయకుండా చదివించిన నవల ఇది.

మానవతా విలువల్ని మేల్కొల్పేలా, ప్రకృతి

సౌందర్యాన్ని ఆస్వాదించేలా, భావుకతని ప్రేరే పించే ఒక చక్కని నవలని అందించిన మాధవీ కృష్ణగారికి అభినందనలు.

నిజ జీవితంలో ఆమె హీరో కృష్ణ పేరుని నవలా నాయకునికి వాడుకొన్నారు. వినయ్ కృష్ణ ల కలయికతో ప్రారంభమైన నవల వారి కలయి కతోనే ముగిసింది

– కె. శ్యాంసుందర్‌రెడ్డి, మంచిర్యాల

## జీవన గీతం

రూ. 50/–
పొందిన సమీక్ష

తనకు సంబంధించిన ప్రతి ఒక్కరి జీవితాన్నీ మంచిపూల సుగంధంతో, చందన పరిమళాలతో, సంతోష వీచికలతో నింపుతూ తీర్చిదిద్దిన స్రవంతి కథను ఒక చక్కని జీవన గీతంలా ఈ నవలలో ఆద్యంతమూ చూస్తాం. పెళ్లి చేసుకున్న రాజేష్, సైంధవుడిలా వెంటాడిన శేఖర్, దుష్టగ్రహాల్లా బాధించిన వసుంధర, రజనిల వల్ల పడిన బాధలు ఎన్నో ఇబ్బందులు కలిగించినా ఆత్మవిశ్వాసంతో తనకొక గమ్యాన్ని నిర్దేశించుకొని సహనంతో ముందుకు సాగి అంతిమ విజయం సాధించిన స్రవంతి నవలకు ప్రాణం పోసింది. అందరికీ ప్రేమను పంచి ఇవ్వడం, పిల్లలను చక్కగా ప్రేమతో తీర్చిదిద్దడంలో, తన ప్రత్యేకతను కాపాడుకోవడం వంటి లక్షణాలతో స్రవంతిని ప్రశంసనీయంగా చూపగలిగిన తీరు అందరికీ ఆదర్శప్రాయంగానూ, మంచిని పెంచే విధంగానూ వుంది. మన చుట్టూ వున్నవారికి ప్రేమను పంచి యివ్వగలిగితే, మనకు కూడా అందరి ప్రేమా లభిస్తుందనే సూక్తిని యిందులో చూడగలుగుతాం.

కుటుంబ జీవితాలలో తారసపడే విభిన్న వ్యక్తులనూ, స్నేహ బాంధవ్యాలనూ చూస్తుంటే, ఇప్పుడు పెరిగిపోతున్న వ్యాపారబంధాల సంస్కృతి కన్నా ఒక ప్రేమైక జీవిత విధానం ఎంత గొప్పదో కదా అనిపిస్తుంది. సర్వేజనా సుఖినో భవంతు అని అనడమే కాదు, ఆచరించడం కూడా అవసరం. మంచి క్రమశిక్షణ, లాలన, ఆలంబనతో పిల్లలను తీర్చిదిద్దితే, వారి జీవితం ఒక నందనవనంలా అవుతుంది అనే సందేశం ఈ నవలలో కనిపిస్తుంది.

–వరదాలక్ష్మి, హైద్రాబాద్

---

## స్పృహ

(127వ పేజీ తరువాయి)

ఎక్కడా ఏమీలేదు"

'తన సృష్టి తనదిగా గోచరింపజేయలేని ఏ రచయిత కూడా కావ్య నిర్మాత కాలేడు' అన్నారు పింగళి లక్ష్మీకాంతంగారు. కథా నిర్మాత కూడా అంతే.

కథకుడుగా నాకొక ఫిలాసఫీ ఉంది. ఒక మనిషి జీవితంలో జరిగే సంఘటనలూ, సంభవాలూ కథా పండితులు ఆశించేటట్లు కార్యకారణ సంబంధాల్ని సమకూర్చుకుని సాగనే సాగవు. జరిగిన ప్రతి సంభవానికీ ఒక "రీజనింగ్"ని "ఎట్రిబ్యూట్" చేయాలని బలవంతం చేస్తే- కథ ఒక 'మూస"లో దిగబడిపోతుంది. అక్కణ్ణుంచీ ఆ "రీజనింగ్"లోకి "వ్యవస్థ" గట్రా అంటూ, "మూలాలూ" మసాలాలూ అంటూ- అనేక అంశాలు కలగాపులగంగా 'మేధావిత్వం" లోకి జారుకుంటాయి. కథావస్తువులకి వర్తమాన సామాజికస్థితి అనే ముసుగువేసి, ఒకే చట్రంలో బిగించేసి, రాసిన యితివృత్తాన్నే మళ్లీ మళ్లీ చర్విత చర్వణం, పిష్టపేషణం చేసే పరిస్థితి వస్తుంది.

మనిషి బతుకులో రెండో వైపునీ చూపించే కథలు రావాలని నా కోరిక. ఈ రెండోవైపు- అతని అంతరంగ తరంగధ్వని, అంతరీకరణ వాహిని కావాలి.

కథ పాఠకుణ్ణి ఉన్నత పథంవైపు నడిపించాలి. దీనికి వస్తువు మాత్రమే చాలదు. శిల్పమూ, శైలీ కూడా ముఖ్యం. కథ పఠితకు- అనుభవం, ఆనందం, అనుభూతి అందించాలి; ఆపైన అనిర్వచనీయ తని గుండెలో మిగల్చాలి! కొత్త రచయిత చేతిలో తెలుగుకథ- కొత్త కొత్త వంపు వాటాల్నీ, ఇంపు సొంపుల్నీ కూర్చుకుంటోంది. నూరేళ్ల పండుగకు నిండుగా తయారవుతోంది. శుభం!!!

సేకరణ : **చంద్రప్రతాప్**

## ఆనాటి రచనలవలె!

రూ. 50/- పొందిన సమీక్ష

చక్కని కథా కథానాలతో ఆద్యంతం చదివించిన నవల యిది. అలాగని కొత్త పుంతలు తొక్కిందని కాదు. రచనలో వదలకుండా చదివించే ఉత్సాహం, ఆసక్తి ఉన్నాయి అని చెప్పవచ్చును. నవల చదువుతున్నంతసేపు ఒకప్పటి ప్రసిద్ధ రచయిత్రుల రచనలు మదిలో మెదుల్తూనే ఉన్నాయి.

ప్రవంతికి దోసిలి నిండా పొగడపూలు ఇష్టం. అత్యంత ప్రీతి పాత్రమైనవి. మనసు సేదదీరినపుడు, అసంభవం సంభవం అయినప్పుడు మనసు పొందే అనుభూతి సహజం. అదే యీ మధురభావన. వాస్తవానికి హీరోకి హీరోయిన్ పరిచయం ఏమీ లేదు. కేవలం ఫొటోలో చూసిన క్షణంలో కల్గిన గిలిగింత అది. సినిమాటిగ్గానే వారిరువురికీ పరిచయం జరగలేదు. చైతన్య వివాహమాడిన వసంతే నాయికగా అనిపిస్తుంది. వసంత మంచి మనసే ప్రవంతికి పొగడపూల దోసిలి అయింది.

వివిధ పాత్రల చిత్రీకరణ, తీరుతెన్నులు మలచిన విధానం మామూలే. వసుంధర, రజనిల వంటి నెగటివ్ కారెక్టర్లు సర్వసాధారణం. ఇద్దరు చిన్నారుల భవిష్యత్తుకి అండదండలనిచ్చేందుకు నిశ్చయించుకుని ఒకసారి పెళ్లైన చైతన్య జీవితంలోకి అడుగు పెట్టి ఆత్మస్థైర్యంతో ఆటుపోటుల్ని దాటుకుని, తన కిష్టమైన పొగడపూల దోసిలితో నిలిచింది ప్రవంతి. అద్భుతమైన కథా గమనం కలిగి ఉంది నవల.

-వై.యస్.కిరణ్మయి, బెంగుళూరు.

## 'వసంత ప్రవంతి'

రూ. 50/- పొందిన సమీక్ష

ప్రేమానురాగాల వనంలో వెల్లివిరిసిన పరిమళాల వసంత ప్రవంతి- 'పొగడపూల దోసిలి'. రియల్లీ ఇట్స్ హార్ట్ టచింగ్. శ్రీమతి మాధవీ కృష్ణ మంచి పద చిత్రకారిణి. ఆమె కుంచెనుండి జాలువారిన అపురూప తైలవర్ణ చిత్రమే ఈ నవల. కుటుంబ జీవన నేపథ్యానికి స్త్రీ వాదాన్ని రంగరించిన అమూల్య భావసంపద ఇది. సామాజిక సంబంధాలు మిథ్యగా, స్వార్థం సర్వ సాధారణంగా మారిన నేటి పరిస్థితుల్లో వసంత, ప్రవంతి పాత్రలు ఆదర్శనీయాలు. వసంత 'ఆకుపచ్చని ఎడారి' అయితే ప్రవంతి 'జీవనది'! బంధువులే రాబందులై ఆ కుటుంబ జీవనాన్ని అతలాకుతలం చేయాలని విఫల ప్రయత్నం చేసినా చివరికి న్యాయానికే విజయం లభించింది. సంప్రదాయ వాదం, ప్రగతివాదాల మేళవింపు ఈ నవలలో అంతర్లీనం. ముగింపు సుఖాంతం.

ఏ పాత్రను ఎప్పుడు తెరపైకి తీసుకురావాలో బాగా తెలిసిన 'చతుర'రచయిత్రి మాధవీకృష్ణ! రచయిత్రి హిల్ స్టేషన్‌లో నివాసముండడం వల్ల ప్రకృతి ప్రియులకు చక్కని వసంతాన్ని కళ్లకు కట్టినట్లు చూపగలిగారేమో? మొత్తమ్మీద పక్క రాష్ట్రంలో నివసిస్తూ తెలుగు పాఠక లోకానికి ఒక మంచి నవలనందించిన రచయిత్రికి 'పొగడపూల దోసిలి'!

-ప్రాణహిత, హైదరాబాద్

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

